# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి

## రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!

ఎందుకంటే : ఒక్క సారి తోముకొంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85 % వరకు తొలగించును**

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమెన్నడూ తెలియచేయనంతటి శాస్త్ర పరిశోధనం ఫలితముగా నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి దాని చేసతనమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది !

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు ఇష్టపడతారు ఎందుకంటె చాలా పేస్టు ఉండే దాని పిప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !







మీకు పొడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పొడరు ద్వారా పొందగలరు... ఒక డబ్బా వెలలా వస్తుంది

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.

 అనాది ధృవమున అనాసపళ్లా? 

కాదయ్యా మనమపభ్రంశులం కాము 

మిడ్‌లాండ్ వల్లది  సర్వసంభవం



మిడ్‌లాండ్ అనాస ఉవ్విళ్లూరే పిపాసజనితం

డెసర్టులు మధురం  ప్రసిద్ధ భాగ్యం

 రసభరితం రుచి మహాభాగ్యం

# *Midland*

మిడ్‌లాండ్-రుచికరమైన 28 రకములు, పళ్లు, కాయగూరలు, జాములు, జెల్లీస్, అండ్ కెచప్.



తయారు చేయువారు : మిడ్‌లాండ్ ఫ్రూట్ అండ్ వెజిటబుల్ ప్రొడక్ట్స్ (ఇండియా) మధుర

సోల్ డిస్ట్రిబ్యూటర్లు : కార్న్ ప్రొడక్ట్స్ కొ (ఇండియా) ప్రైవేట్ లి., బొంబాయి

దక్షిణభారతదేశంలో ఏజెంట్లు : ప్యారీ అండ్ కంపెనీ లిమిటెడ్

# ఉత్తరాలు

## కార్టూనులు

సత్యమూర్తిగారు వేసిన కార్టూను చాలా బాగున్నది రాను రాను మన 'యాక్టర్లు' సినిమా స్కోన్‌కి కూడా అందకుండా పోతారా అని భయం వేస్తున్నది సత్యమూర్తిగారు, కెమెరామెన్ వడే అగచాట్లు కళ్లకు కట్టినట్లు చిత్రించారు

ఆర్ వెంకటరావు (కాకినాడ)

*　　*　　*

వంతులు, సాహెబ్ తోకొనడంవల్ల సాహెబు టోపీ ఎగిరి వంతులు నెత్తిన వడడం, వంతులు మొహాన ఉన్న నామాలు సాహెబు మొహాని కంటుకున్నట్లుగా కార్టూన్ వేశారు చిత్రకారుని అభిప్రాయమిదే అయితే, అలా జరగడము అనుమానాస్పదమైన విషయమే

కర్రా సోమశేఖరం (బండారులంక)

## బంగారం-సింగారం

సార్! ఒక్క నిముషం మేస్టారూ ఒక్క విషయం చెప్పమంటారా దాచలేను చెప్పేస్తున్నా అయ్ లాయిక్డ్ సింగారం—బంగారం వెర్రి మచ్చిగ నన్ను అపార్థం చేసుకున్నట్టున్నారు వన్నరనన్నానో మంత్రాలకి మీ పత్రికలో అలాంటి కథ ప్రచురించెదరు గాక నాక కదే బాంది నాకా బంగాలం—చింగాలం కదే బాంది అయ్ అయ్యో అదీ విషయం బాపురే అనిపించారు ఈ కథ అయిపోయిందని విచారించాను ఏం లాభం! నాకివ్వాళ్ల తోచలేదర్రోయ్! నేనేం చేతుర్నోయ్! (డాన్సు చేయునట్లు అభినయించును) ఈ కథ ప్రచురించినందుకు మీకు, రాసినందుకు రేఖా గార్కి నా అభినందనలు ఇదేమిటి, విలనులాగా కార్డు కొసకు వచ్చింది ఐమీన్ శైలా పాదరులా అయ్యో అదీ కథ సెలవు

ఎం అవరవిన్నా (మద్రాసు)

## కథలు

వీరాజీగారు వ్రాసిన "సుఖం" కథ చాల బాగుంది అందులో అయ్యగారి రహస్యం సీతారాములు తెలుసుకో గలిగాడు కాని తను ఎవరన్న "రహస్యం" చిక్కిందికాదు సీతారాములుకే కాదు నాకు కూడ చిక్కలేదండి ఆ రహస్యం

బి ఎల్ వతి (హైదరాబాద్)

*　　*　　*

'వాసంతి' గాథ చాలా బాగుంది రచయిత అన్ని పాత్రలకు కొంత విశిష్టత కల్పించారు కాని, కథ నామకరణంలో మాత్రం నాయకురాలియందు పక్షపాతము చూపెట్టినట్లున్నారు అయినా కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్ అన్నట్లు ఉంది

సుకేర్ (హైదరాబాద్)

*　　*　　*

'వాసంతి' కథలో చివ్వరి సన్నివేశం మరీ బాగుంది ఈ కథలోని చంద్రశేఖర్ లాగా మేము కూడా ప్రపంచంలో జరిగే ఘోరాలు, ప్రమా

# ఉత్తరాలు

చాలా పత్రికలో చదివి కొన్ని చూసి చాలా బాధ పడేదాన్ని ఆరోజు అన్నం సహించక, నిద్రపట్టక దుఃఖపడేదాన్ని

కె. మీనాక్షి (ముప్పాళ్ళ)

* * *

"సమస్య" అన్న కథ నన్నెంతగానో ఆకర్షించింది; కాని రచయితగారు ఆఖరు ఘట్టములో వాసుదేవయ్య గారు "సరిగ్గా వూహించారండి మీరే మంటారు?" అన్న వాక్యాలు అసభ్యంగా వున్నా యని నా అభిప్రాయము ఏ ఆడ దానిని కూడ అంత ధైర్యంగా తన సొంత తల్లిదండ్రుల ఎదురుగ నేను ఫలానావాడిని ప్రేమించాను, ఆయన్ను తప్ప మరె వ్వరిని పెళ్ళాడను అని చెప్పేటంత ధైర్యము ఉండదు అందులోను ఆడవారి తండ్రులే ప్రేమించిన అబ్బా యిల తండ్రుల దగ్గర "మా అమ్మాయి మీ అబ్బా యిని ప్రేమించిందని" చెప్పుకోవడములో వాసు దేవయ్యలాంటి తండ్రులకు యీ కలియుగ కుర్రాళ్ళ ముందు కొంచమైనా గౌరవమర్యాద లుంటా యంటారా?

వి. ఎస్ మూర్తి (హంపి)

## సందేహం

"మా న్యూఢిల్లీ విలేఖరి అస్వస్థులుగా ఉన్నందున ఈవారం న్యూఢిల్లీ లేఖ ప్రచురించలేక పోయాము" అని ప్రకటించినారు వారు ప్రభు త్వమువారి ఆస్పత్రిలో చేరినారా, లేక ప్రైవేటు నర్సింగ్ హోములో చేరినారా ?

మోహనరావు (గుడివాడ)

* * *

శ్రీ ఎం ఎల్ పతిగారు యిటీవల పై శీర్షి కతో వ్రాసిన వ్యాసం చదివాను నా తెలంగాణా మిత్రులు కొందరు కూడా చది వారు ఇటువంటి రచనలవలన మనం సాధించ గలది ఏమిటి ? అని మేము తర్కించుకున్నాము. ఇవి 'స్కెచ్' రచనల క్రింద వచ్చినా, 'వెక్కి రింత' రచనలు క్రింద వచ్చినా ఫలిత మొక్కటే తెలంగాణా సోదరుల భాషను మనం వెక్కిరించ డమే జరుగుతుంది ఇప్పటికే కొన్ని విభేదాలు ఉన్నాయి ఇంకా వీటిని పెంచుకోడం మంచిది కాదని మనవి

సి. వే ణా (హైదరాబాదు)

* * *

ఆంధ్రసచిత్ర వారపత్రికలో ఈ మధ్య కొన్ని శీర్షికలు బాగుండడం లేదు వాటిని త్వరలో సరిదిద్దుతారని ఆశిస్తున్నాం

వి యస్ రావు (హైదరాబాదు)

## ఎప్పుడూ ఇంతే

23—8—61 వార పత్రికలో ఎప్పుడూ యింతే చూసి మాకు నవ్వాగలేదు చాల బాగుంది కాని ఒక్క సందేహం—మగవాళ్ళలో అంత సహనం ఓర్పుగలవాళ్ళు ఉంటారంటారా?

కస్తూరి రాధాకృష్ణమూర్తి (గుంటూరు 2)★

బుధవారం 20-9-61

ప్లవ సం॥ భాద్రపద శుద్ధ దశమి

సంపుటము 54 సంచిక . 2

స్థాపితము:

1908

* * *

ముఖ్యసంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

* * *

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

* * *

విడిప్రతి : 25 న పై

సంవత్సర చందా : 13-0-0 రు

* * *

ఆంధ్రపత్రిక కార్యాలయము

7, తంబుచెట్టివీధి, మద్రాసు-1



# లోకంపోకడ



'నీ దురుసుతనానికి నీవు క్షమాపణ చెప్పేవరకు అమ్మ అన్నం తినదట నాన్నా!'

'అప్పుడప్పుడు అన్నం మానెయ్యటం ఆరోగ్యానికి మంచిదని చెప్పరా.'

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

## విషయానుక్రమణిక

ముఖచిత్రం సిద్ధివినాయక పూజ



### శ్రీశైల ఆలయ ఉద్ధరణ నిధి

'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున స్వామివారి ఆలయ ఉద్ధరణ నిధికి సెప్టెంబరు 9 వ తేదీనాటికి రు. 44,988-72 వసూలు అయింది. యథాశక్తి విరాళాలు ఇచ్చి, ఈ పవిత్రమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిందని ప్రజలకు, ప్రజాసంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాము.



అహా! తగిన అభ్యర్థి ఇదుగో
పరిశీలకులు
పంజాబు రాజకీయాలు
అకాలీ
ఉద్యమం
తుపాను
చాలానే రాలాయ్!
ప్రపంచ శాంతి రక్షణ భారం
తగువులు మాని మీరు కూడా సాయం పట్టండి!
గుడ్లు పొదిగే కాలం..
జనసంఘం
సోషలిస్టు
స్వతంత్ర
పియస్‌పి
కాంగ్రెస్

# శకటయోగం

వాకాటి పాండురంగారావ్



**ఇన్నాళ్ళకు మురళీధరుడికి శకటయోగం కలిగింది. అది కూడా మద్రాసు మహానగరవీధులలో !**

ఆ పేరు ఎలా వచ్చిందో ఏమో కాని మదరాసు నగరంలో ఆ మహావీధిని 'చైనాబజారు' అనే అంటారు ఆమధ్య మనదేశానికి స్వాతంత్ర్యం అంటూ ఒకటి వచ్చింది అది రాగానే, బోలెడు విప్లవకరమైన మార్పులు తేవాలని నాయకులు అనుకొన్నారు హఠాత్తుగా ఒకరోజు పొద్దున్నే లేచి, పళ్ళుకూడా తోముకోకుండా కూచుని — "ఇది చైనాబజారు కానేకాదు బోసురోడ్డు స్మండీ—" అన్నారు

సదరు బోసురోడ్డు సువిశాలంగా సముద్రంలా ఉంటుంది ఆ సముద్రంలోకి అనేక గొప్పగొప్ప వీధులు మహానదుల్లాగ వచ్చిపడుతుంటాయి బ్రహ్మపుత్ర లాంటి 'బ్రాడ్ — వే' అన్న ఇరుకైన వీధి — గంగానది బోలిన తంబుచెట్టివీధి — వీటి సరసనే పారుతూ తపతీ, నర్మదల్లా ఉన్న, పండ్ల దినుసులమ్మే బందరువీధి — కాగితాల రకాలమ్మే భద్రయ్య వీధి — ఇవన్నీ కూడా బోసు రోడ్డు లోకి సంగమిస్తూ ఉంటాయి ఈ జీవనదీ సముదాయంలో గోదావరిలాటిది గోవిందప్పనాయని వీధి

ఆ వీధి బోసురోడ్‌లోకి ప్రవహించే సంగమ స్థలాన — ప్రతిక్షణమూ ఒక పెళ్లి జరిగి పోతున్నట్టే ఉంటుంది ఆ రెండు వీధుల కూడలి స్థలాన ఆకాశాన్నంటే పేపరు కుర్రాళ్ల కేకలు విన్పించక ఉండడమే తమ మహదాశయ ముబ ట్టున్న కార్లు అరుస్తుంటాయి కార్లూ, రిక్షాలూ లేపే ధూళివాసన తగలకుండా అగరువత్తి చంద నాదు లమ్మే కొట్లుంటాయి ఇంత మంచి వాసన లెక్కడివా అని గమనిస్తే మైసూరుపాకులతోనూ, జిలేబీలతోనూ జ్యామెట్రీ బొమ్మలను తయారు చేసి ఉంచిన మిఠాయి అంగళ్లూ, వెండియున్ బంగారమ్మే స్త్రీల పాలిటి స్వర్గాలూ, కనబడ తాయి ఇంత హంగామా మధ్య, ఇంత హడా విడిమధ్య నాగరాజా అన్న కళ్లద్దాల కుర్రాడి పిప్పరమెంట్ల షాపు హఠాత్తుగా కనబడక పోవచ్చు కాని, నెమ్మదిమీద — పడుతుంది పిప్పర మెంట్లతోబాటు బిస్కెట్లు, అందుతోబాటు అంగోరా ద్రాక్షలు, అవికాక కాబూలు పిస్తాలు, అటుపిమ్మట షిమోగా పీటన్ వక్కలు, జపాను బొమ్మలు మరియు జర్మన్ కత్తులు — వీటన్నిటితో బాటు నాగరాజా, కూర్చుని ఉంటారు

ఈ కళ్లద్దాల నాగరాజా అనే పిప్పరమెంటు షాపుకుర్రాడికి ప్రధానమయిన దురద — నాటకం, లేక నాటకాలు ఈ మహానుభావుడు గనుక ఓ రాత్రిపూట ఫలానా 'విజయనగర పతనం' అన్న నాటకంలో కృష్ణదేవరాయల వేషం వేశాడూ అంటే, ఇహ వరసపెట్టి నాల్రోజులదాక అడ్డ మయిన వాడినీ 'అప్పాజీ' అని పిలిచేస్తుండేవాడు అంతలా రోజులతరబడి పాత్రల 'మూడ్' లోకి వెళ్లిపోయే నాగరాజుని ఒకానొక నాటకం తర్వాత కలుసుకుని — "ఇందాక మూడో రంగంలో ఆ నౌక రును పిలిచినప్పుడు — మీ ఎడమచేతి ఉంగరం వేలిని మడవడంలో ఎంత రాజసం ఒలికించా రండీ — హోహెూహెూ .. " అని మెచ్చుకున్న వాడు మురళీధరుడు

ఆ క్షణంనుండీ — 'మురళీధర్‌వంటి రసి కులు ఎంతోమంది ఈ తెనుగుసీమను లేరే — వెం యరే — కటా !' అన్నది నాగరాజా బాధ అయింది ఇహ మురళీధరుడేమో — రాజసంతో నాగరాజా వేలు మడిచిన నాటకానికి వారం రోజుల ముందే బి ఎస్‌సీ పరీక్ష రాశాడు అక్కడనుండి తీరికగా కూర్చుని, పరీక్షా ఫలితాలు, వ్లస్ 'కావలెను' ప్రక టనల నిమిత్తమై దిన పత్రికల్ని భూతద్దంతో కొలిచేవాడు ఈ దినపత్రికాన్వేషణ కాలంలో మురళీ ధరుడి జీవితం నాగరాజా షాపులోని బిస్కెట్ల డబ్బా కివతలగా ఉన్న పాత ఇనపకుర్చీ మీద జరిగి పోతుండేది

"కళ కళం టే ఏమిటి ?—రంగులు పులుము కోవడమా, కాదు కాళ్లూ, చేతులూ విసరడమా కాదు ఎనభైగజాల డైలాగుని ప్రేక్షకుల మీదికి వదలిపెట్టడమా, కాదు, కాదు మరి కళ అంటే ఏమిటి ? అదో దీపం అదో వెలుతురు అది అంతరంగంలోనిది ఆత్మ సంబంధమయినది " అంటూ ఎదుటఉన్న టేబిలులాటి బెంచీని గుద్దతోయి నెమ్మదిగా తడుతూ, మురళీధరుణ్ణి చూసి ప్రేక్షక జన ప్రతి నిధి అనుకుని నాగరాజా ఉపన్యసిస్తున్నట్లు అరు స్తున్న—అక్షణాన్నే,

—తాను కూర్చున్న ఇనపకుర్చీ ఎదుటి షెల్ఫు పైవరసలో మూడో సీసాలోని — రూపాయకు మూడే మూడయిన టర్కీ ద్రాక్షలను నాలుగింటిని ఇవతలకు తీసి ఉంచి, ఒక వరుస క్రిందికి వచ్చి అక్కడున్న తౌను నలభై రెండు రూపాయల అప్పను పిస్తాపప్పుల్లో కాస్త బలమైన వాటిని ఏరుకుని—పైన చెప్పిన ద్రాక్షలను ఒక్కొక్క దానినే తీసుకుని బత్తాయి పండులా విప్పి, దాని మధ్య, గరిమనాభి అటీ గమనించి, పైన (రెండో సారి) చెప్పిన పిస్తాపప్పుల్లో ఒక్క దానిని, బంగారంలోకి వజ్రంలా పొదిగి — ఆ విప్పిన ద్రాక్ష పండుని మళ్లీ ఒడుపుగా కప్పి, ఆ ద్రాక్ష పిస్తా మాత్రను నోట్లో వేసుకొని, రెండో ద్రాక్ష రెండో పిస్తాలతో కుస్తీకి సిద్ధమయేవాడు మురళీధరుడు

కళలో పడి కొట్టుకొంటున్న నాగరాజా దృష్టికి మురళీధరుడు ఈ విటమిను మాత్రలను సేవిస్తున్న దృశ్యం — కొన్ని సందర్భాలలో అంటే, నాగరాజా అతితీవ్రంగా కళను విడమర్చి చెబు తున్నపుడు కనిపించేది కాదు కొన్ని వేళల కన్పించినా 'ఇతగాడి కిలా మేలుజాతి పిస్తాలూ, ద్రాక్షలూ తెగ అలవాటయిపోయి, అవి లేకుండా ఓ పూట కూడా గడవనిస్థితిలో కొచ్చేస్తాడు అప్పుడు నా వ్యాపారం యమగా సాగుతుంది' అనుకునేవాడేమో

*   *   *

—ఇది ఇలా ఉండగా,

అంతకు నాల్రోజుల ముందే చిన్నయసూరి అను తెలుగు మేష్టారు 'జీవితము క్షణభంగురము' అని ప్రవచించి ఉండెను

ఇది ఇలా ఉండగా—

ఈ కళమీది ఘోషలూ, పిస్తా పప్పుల మంచి రుచీ, దినపత్రికల ప్రకటనలూ — ఇవన్నీ కూడా క్షణభంగురము లయి బుద్బుదము లయిపోగా — ఆఖరికి మురళీధరుడిలో మిగిలినది — సైకిలు తొక్కడం నేర్చుకోవాలన్న వాంఛ !

ఎక్కడి నాటకం ! ఎక్కడి నాగరాజా ! ఎక్కడి సైకిలు!!

నాగరాజా షాపు పంచను కూర్చుని, ఆ వీధిని, ఆ జన సముదాయాన్ని తిలకిస్తూ ఉండగా, అంతటి ప్రజా సమూహాన్ని ఇట్టే తప్పించుకుని, జాగా లేనిచోటకూడా దారి కల్పించుకొని పాములా మెలికలు తిరుగుతూ వెళ్లిపోయే సైకిలు సాహసా లను చూసి మురళీధరుడి మనసు ఒక పెద్ద వేలుగా మారి అతడి బుర్రముక్కుమీద ఆశ్చ ర్యంగా నిలిచేది ఆశ్చర్యం ప్రశ్నయై, ప్రశ్న కోరి కయి—'ఇదనై రెండేళ్ల కాలంలో సైకి లెక్కడం నేర్చుకొనకనే పోతినే' అన్న బాధగా పరిణమించేది. అందులోనూ సైకిలుకు ముందు వెనుక ఇరు ప్రక్కల తో అరడజను పాలడబ్బాలు తగిలించు కుని కూడా ఆకాశవీధిలో మెరుపు తీగలకు మల్లే వెళ్లిపోయేవారిని చూస్తే, వీళ్ళెవరో శాపం తగి లిన గంధర్వులేమోనన్న అసూయ కలిగేది తను అలా పాలడబ్బాలు తగిలించిన సైకిలు ఎక్కక పోతే మానె గాని, దాని ప్రక్కనే నడుస్తూ దానిని నడిపించి తీసుకువెళ్లగలిగితే చాలు జన్మ ధన్య మవును కదా అనిపించేది 'ఇస్ ' అని జుట్టు పీక్కొబోయేవాడు మురళి ఇంతలో వీధివెంబడి ఇంకో సైకిలు మెరిసేది లేపోతే పిస్తాల డబ్బా పిలిచేది

ఈ సందర్భంలో బెంగుళూరులో నాగరాజా పెళ్లి ఏర్పాటయింది మురళి లేకపోతే తన పెళ్లి కాదన్నాడు నాగరాజా

"అదేంమాట — నీ పెళ్లి కావలసిందే" అన్నాడు మురళీధర్

మొదటిసారిగా బెంగుళూరులో అడుగుపెట్టాడు. వాణీవిలాస సత్రంలో పెళ్లి

ముహూర్తపు తొడ భరించలేని మురళీ ధరుడు పొద్దున్న తొమ్మిదిగంటలవేళ సత్రపు బయటికొచ్చి నిల్చుని గాలి పీల్చాడు ఇటూ తిరిగిచూస్తే—వందకు పైగా సైకిళ్ళ—కొత్తవి, పాతవి, నల్లవి, ఆకుపచ్చవి, మెరుస్తున్నవి,తుప్పు పట్టినవి—అన్నీ పెళ్లి కొచ్చినవి కనుపించాయి రెక్కలులేని పక్షిలా కొట్టుకుంది మురళి గుండె. అతడి మనస్సు బాధతో తడిసి ముద్దయింది. 'ఎందుకే నీకింత తొందరా'—వాయించారు సన్నాయి వారు.

(57-వ పేజీ చూడండి)

# వి(ఘ్న)నాయకుని విచిత్ర కథలు

ఆమంచర్ల గోపాలరావు

గణపతి, గణేశుడు, విఘ్నేశ్వరుడు, వినాయకుడు, గజాననుడు, లంబోదరుడు అని అనేక పేర్లతో గణపతిని పూజిస్తారు. ఈ గణపతిపూజ మనదేశంలో అనాదిగా వర్ధిల్లుతూనే ఉంది స్మృతులందు, పురాణాలందు, ఇతిహాసాలందు, అనేక ప్రాచీన గ్రంథాలందు సైతము, ఈయనను గూర్చిన విశేషాలు కనుపిస్తాయి కాని అన్ని గ్రంథాలల్లో ఈయనగారి కథలు ఒకేరకంగాఉండవు అందుచేత ఈయనగారి పూజ అతి ప్రాచీనమందే గాక అనంతంగా వ్యాప్తమని, బహుముఖమని కూడ మన మనుకోవచ్చు

యాజ్ఞవల్క్య స్మృతిలో రుద్రుడు గణపతిని గణాలకు అధిపతిగా చేసినట్లు, మానవ సంకల్పాలకు విఘ్నములను కల్పించుటే అతని కార్యకలాప మయినట్లు వర్ణించారు బహుశా ఆ కాలానికే వినాయక పూజ బహుముఖమై యుండవచ్చు ఎందుకనగా, మహాభారతంలో, అనుశాసనపర్వంలో వినాయకులు, గణేశ్వరులు అనేకులుగా యుండినట్లు చెప్పబడింది వీరలను స్తుతించిన పాపములు, కల్మషములు తొలగునని నాటి కవి వాక్యము మనదేశంలో భిన్నమార్గమున సంచరించిన బౌద్ధులు కూడ విఘ్నేశ్వరుడిని తప్పించి నడవలేదు వారు వైదికసంప్రదాయములకు ప్రతిగా అనేక చార్యములను సృష్టించుకొన్నారు వీటిలో విఘ్నేశ్వరపూజకూడ ఒకటి కాని వారు విఘ్నములను కల్పించు విఘ్నేశ్వరుని స్తుతింపక, విఘ్నములను హరించు విఘ్నాంతకుడిని పూజించెడివారు ఒక్కొక్కప్పుడు వారి విఘ్నాంతకుడు మానవపక్షపాతియై, విఘ్నములను కల్పించే మన విఘ్నేశ్వరుడిని పడద్రోసెడివాడు నిజంగా మన విఘ్నేశ్వరుడు వైదికమతం వారికోసం అనేక పూజల నందుకొనుటయే గాక, అనేక కష్టాలను కూడ ఓర్చినాడని మన మనుకొనవచ్చు

ఏనుగుముఖం, మానవశరీరం, పెద్దబొజ్జ ధరించి ఉండ్రాళ్లను ఎడతెరపిలేకుండా భక్షించే ఈ వినాయకుడు మన కత్యంత ప్రేమపాత్రమయినాడు మరీ ఇతని ఆకారం, చేష్టలు పసిపిల్లలకు అతి వినోదదాయకములై, వారి హృదయములను పూర్తిగా చూరగొన్నవి నిజముగా వినాయకచవితినాడు ఇతనిని పూజించి, ఉండ్రాళ్లు తినని హైందవబాలు డుండడు

ఈ వినాయకుని జననముమగూర్చి అనేక కథలుకూడ యున్నవి ప్రజాదరణమును పొందిన వ్యక్తినిగూర్చి అనేక కథ లుత్పన్నమగుట సహజము అందులో మన గణేశుడు ఆబాల గోపాలమునకు ఇష్టుడు అందుచేత ఇతనికి అనంత రూపములు ఇతనినిగూర్చి అనేక కథలు ఉండుట ఆశ్చర్యకరమయిన విషయముగాదు

ఇతని జననముమగూర్చి సామాన్య ప్రజానీకములో వ్యాప్తమయి ఉన్న కథ చాల సొంపయినది పార్వతి స్నానమాచరించుతరి ఒక మనుష్యముద్దకు ప్రాణముపోసి కావలిగా నుంచుకొనెనట. ఆ సమయముననే శివు డచటికి వచ్చెనట వినాయకుడు శివున కడ్డతగులగా, శివుడు కోపించి వినాయకుని శిరస్సును నరికెనట పార్వతికీవిషయ మతి దుఃఖకారణ మయినది వెంటనే శివుడు ఏనుగుతల నొకదానిని తెప్పించి, వినాయకుని మొండెమునకు దానిని తగిలించి మరల ప్రాణము పోసి, యీతనిని సజీవునిగ యొనర్చెనట. వినాయకుని చిత్రరూపమునకు కారణమును తెల్పు ఈ కథ ఎంతయు ఇంపైనది పార్వతి మాతృప్రేమ, శివుని ప్రథమకోపము, దయార్ద్ర హృదయములను ఈ కథ చక్కగా సూచించును"

కాని పురాణములందున్న ఈతని జన్మవృత్తాంతములు కవి కల్పనలను, చమత్కారమును కూడ ప్రకటించునవి అయిఉన్నవి శివపురాణమునందున్న కథ వేరుగా ఉండును జయ, విజయులు పార్వతిని సమీపించి, నంది, భృంగి కాక మరొక ప్రత్యేక సేవకు డామెకు అవసరమని, ఆమెతో పలికిరి వెంటనే ఆమె తన చర్మమును నలిచి, వచ్చిన యా మట్టితో విఘ్నేశ్వరుని సృష్టించి, తన ద్వారపాలకునిగా నియమించెనట ఒకనాడు ఆ ద్వారపాలకుడు శివునకే అడ్డుతగిలెనట శివునకు కోపంవచ్చి, తన గణములను యీతనిపై యుసికొలిపెనట. ఆ గణములు ఓడిపోవగా, వారికి సాయముగా విష్ణు, సుబ్రహ్మణ్యుడు మొదలయిన ఇతర దేవతలు కూడ వచ్చి రణమును చేసిరట వారును వోడిపోయిరి అప్పుడు శివుడు కోపమున రుద్రుడై, విఘ్నేశ్వరుని తల నరికివేసెనట. పార్వతికీ విషయము తెలిసి కోపము వచ్చి ప్రళయమును కల్పింపగల్గు అనేక శక్తులను సృష్టించెనట అప్పుడు నారదుడు, ఇతర దేవతలు కాబోవు సర్వనాశనమును తప్పించమని దీనముగా పార్వతిని ప్రార్థించిరట అంత నామె దయతలచి, శివుడు తన విఘ్నేశ్వరుని బ్రతికించి ఇచ్చిన, తాను శమింతునని పలికెనట శివుడు వెంటనే ఒకజీవి తలను కోసి తెమ్మని తన గణముల కాజ్ఞాపించెనట. వారు ఒక ఏనుగుతలను తెచ్చిరట అంతట శివుడు విఘ్నేశ్వరుని మొండెమునకు ఆ తలను తగిలించి, ప్రాణము పోసెనట. అతడే నేడు పూజల నందుచున్న పార్వతి కుమారుడు విఘ్నేశ్వరుడు

కాని స్కాంద, మత్స్య, వరాహ పురాణములందున్న విఘ్నేశ్వరకథ మరొక రీతిగా నుండును దేవతలు, ఋషులు రుద్రుని సమీపించి ఒక విఘ్నకారకుని సృష్టింపమని కోరిరట శివు డప్పుడు పార్వతిని చూచుచు ధ్యాననిమగ్నుడయ్యెను. అప్పుడు పంచభూతాత్మక మయిన ఆయన శరీరమునందలి ఆకాశభాగమునుండి విఘ్నేశ్వరుడు జనించెను అతడు నవమోహనాకారుడు, సర్వాంగసుందరుడు అతనిని జూచినంతనే పార్వతి కెందుకో కోపము జనించెను వెంటనే అతనిని ఆమె శపించెను అప్పు డతనికి ఏనుగతల, పెద్ద బొజ్జ వికృతాకారము ఏర్పడెను

సుప్రభేదాగమంలో కథ మరీ విచిత్రంగా ఉంటుంది ఒకనాడు పార్వతీపరమేశ్వరులు వినోదవిహారము చేయుచుండిరి ఏనుగులు క్రీడించుట గాంచిరి ఉత్సాహ మధికమయ్యె, పార్వతీపరమేశ్వరులువయితము, ఏనుగురూపముల దాల్చి క్రీడించిరి వారలకు వినాయకుడు జనించెను

ఇలాగే ఇతని జననమును గూర్చిన గాథ లనేకములు గణేశుని వివాహమును గూర్చిన ఒక కథ శివమహాపురాణమందు కలదు. అదికూడ చాల విచిత్రమయినదే గణేశునకు, సుబ్రహ్మణ్యునకు యుక్తవయసు వచ్చినదట పార్వతీపరమేశ్వరులు తనయుల నిద్దరిని పిలిచి మొదట భూప్రదక్షిణము చేసినవానికి మొదట పెండ్లి యనిరట. వెంటనే సుబ్రహ్మణ్యస్వామి తన నెమలినెక్కి భూప్రదక్షిణ యాత్రకు బయలుదేరెనట కాని అతిమేధావి అయిన గణేశుడు తలిదండ్రులకు ఏడుమారులు ప్రదక్షిణముచేసి, నమస్కరించి తన పెండ్లిని జరిపించమని కోరెనట వా రతని బుద్ధికి మెచ్చి, వెంటనే పెండ్లి చేసిరట సుబ్రహ్మణ్యన కీ విషయము తెలిసినంతనే కోపము వచ్చి క్రౌంచపర్వతమునకు వెళ్ళెనట.

గణేశునకు సిద్ధి, బుద్ధి అని ఇరువురు భార్యలు క్షేమము, లాభము అని ఇరువురు పుత్రులు

గణేశునికి కథలను మించిన అనేక రూపములు కలవు నాలుగు చేతులమొదలు, పదునారు చేతుల వరకు దేవదేవుడు ధరించును వివిధ ఆయుధములతో, వివిధ వర్ణములతో, ఆయా పేరులకు తగిన రీతిని ఇతడు రూపములను ధరించును. శిల్పశాస్త్రములందు ఇతని రూపములు దాదాపు ఇరువదిరెండు వర్ణింపబడి యున్నవి. వీటిని మించిన రూపములు గణపతిశిల్పములందు కాన వచ్చును

గణపతి రూపతత్వార్థముకూడ గమనింప తగినదే పంచభూతముల స్వరూపము సదాశివమూర్తి అందు ఆకాశభాగము గణపతిస్వరూపము. అతని పెద్దబొజ్జ అన్ని లోకముల నివాసము.

విఘ్నేశ్వరుడు శివునకు గణపతి విఘ్నములను తొలగించుటకై అతని పూజ విద్యయందు ఆసక్తిగల బాలుర కెంతయు ప్రియమయిన దివ్యదేవత గణపతి. 

# ప్రభుత్వ నిర్ణయాలను విమర్శించిన మంత్రులపై ముఖ్యమంత్రి కినుక వి ఐ పి లకు దైవ మర్యాదలు

మనం ఏం చెబుతున్నామన్నది అంత ప్రధానం కాదు అది అర్థం పర్థంలేని విషయమే అయినా పట్టించుకోను కాని ఆ చెప్పేది మనమంతా కలిసి కట్టుగా ఒకేమాటగా చెప్పాలి అని పూర్వం లార్డ్ మెల్బరన్ మంత్రులబాధ్యతలు గురించి సిద్ధాంతీకరించారు నాటినుంచి ప్రధానమంత్రి అభిప్రాయాలకు ప్రభుత్వ నిర్ణయాలకు విరుద్ధంగా మాట్లాడరాదనేది బ్రిటన్‌తోసహా పార్లమెంటరీ ప్రభుత్వాలున్న అన్ని దేశాలలోనూ సంప్రదాయంగా స్థిరపడిపోయింది

ప్రధాన మంత్రి కోరినా ప్రభుత్వ నిర్ణయాలు కాని నచ్చని ఏ మంత్రికైనా మంత్రివర్గం నుంచి వైదొలగడం వినా గత్యంతరం లేదు. మన దేశంలో శ్రీ నెహ్రూతోనూ ఆయన ప్రభుత్వ విధానాలతోనూ సరిపడక శ్రీయుతులు సి. డి. దేశముఖ్ కె. సి. నియోగి, ఎ. పి. జైన్ ప్రభృతులు అట్లా వైదొలగిన సంగతి తెలిసిందే

పార్లమెంటరీ పద్ధతి ప్రభుత్వం ఉన్న మన రాష్ట్రంలో మాత్రం దురదృష్టవశాత్తు ఇందుకు భిన్నమైన సంప్రదాయం ఏర్పడింది మంత్రులుగా ఉంటూనే మంత్రివర్గ నిర్ణయాలను ప్రభుత్వ విధానాలను విమర్శించడం అలవాటుగా మారింది బహుశా అసలైన ప్రజాస్వామ్యమంటే ఇదేనని నిరూపించడానికో ఏమో తెలియదు సంజీవరెడ్డి హయాంలో వ్యవసాయమంత్రిగా ఉన్న శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి ఈ కొత్త సంప్రదాయానికి మూలపురుషులు ప్రభుత్వం రైతులకన్యాయం చేస్తోందని, కొరగాని వ్యవసాయ విధానాలను తీస్తోందని, ఆ ప్రభుత్వంతో తనకు సంబంధం లేనట్టు ఆ శాఖ తనది కాదన్నట్టు ధూర్త్వార పట్టేవారు ఆనాడాయన పెట్టిన ఒరవడి ఇంకా కొనసాగుతూనే ఉంది.



హైదరాబాదులోని జూబిలీహాలులో ఈ 4వ తేదీన బహుమతి శాంప్ల పంచమైత్రి) మానిక ప్రదా ఏర్పాటు చేశారు

ఈమధ్య ఇద్దరు మంత్రులు ప్రభుత్వ ఉత్తర్వులను బహిరంగంగా విమర్శించినట్లు పత్రికలలో వెలువడింది వారిలో ఒకరు శ్రీ కల్లూరి చంద్రమౌళి రెండవవారు శ్రీ పి వి జి రాజు ఆంధ్ర చేనేత సహకారసంఘం వ్యవహారాలను దర్యాప్తుచేయాలని ప్రభుత్వం ఉత్తరువు చేయగా తెలంగాణా సంఘాన్ని మినహాయించి ఒక్క ఆంధ్రసంఘాన్ని గురించే దర్యాప్తు చేయడం సబబుగా లేదని శ్రీ చంద్రమౌళి విమర్శ ఆయన ఈ విమర్శ చేయడంలో తెలంగాణా సంఘంపైన కక్ష ఉన్నదనిగాని ఆంధ్ర సంఘంపైన ప్రత్యేక అభిమానం ఉన్నదనిగాని కాదు. కేవలం జిల్లా రాజకీయాల ప్రభావమే ఇందుకు కారణమై ఉండవచ్చు శ్రీ మంతెన వెంకటరాజు కల్లూరి చంద్రమౌళి ప్రగడ కోటయ్య గుంటూరు జిల్లాకాంగ్రెస్ నాయకులు. ఇందులో శ్రీ వెంకటరాజుకు కడపటి ఇద్దరితో పడిపడదన్నది జగమెరిగిన సత్యం లోగడ శ్రీ వెంకటరాజు చంద్రమౌళిపై కొన్ని ఆరోపణలు చేయడం పార్టీసమావేశంలో వాటిని చర్చించాలని పట్టుబట్టడం కాంగ్రెస్ మంత్రిపై ఇలా బహిరంగంగా ఆరోపణలు చేసినవారిమీద (అంటే రాజుమీద) చర్య తీసుకోవాలంటూ శ్రీ ప్రగడకోటయ్య చంద్రమౌళికి మద్దతుగా రావడం—ఈ విషయాలన్నీ గుర్తుండే ఉంటాయి ఇప్పుడు ఆంధ్ర చేనేతసంఘం వ్యవహారాల దర్యాప్తు చేయాలని పట్టుబట్టినది కూడా (ఆ సంఘం సిబ్బంది యూనియన్ అధ్యక్షుని హోదాలో) శ్రీ వెంకటరాజే ఆనాడు తనకు మద్దతు ఇచ్చిన శ్రీ కోటయ్యను ఆయన వాదాన్ని నేడు సమర్థించడం తన విధిగా ఎంచి శ్రీ చంద్రమౌళి ఈ విమర్శ చేసినట్లుగా స్ఫురిస్తోంది.

ఇక పి వి జి రాజు సంగతి సరేసరి ఆయన ప్రభుత్వాన్ని విమర్శించారంటే అందులో వింత ఏమీ లేదు ముఠా రాజకీయ కలహాలు ముమ్మరంగా ఉన్న రోజుల్లో శ్రీ పి వి జి చేసిన ప్రకటనలు ప్రసంగాలు ఎవరూ మరచిఉండరు వైద్య కళాశాలల్లో ప్రీ–ప్రొఫెషనల్ కోర్సుల్లో సీట్ల రిజర్వేషన్ తగదని ఇటీవల ముఖ్యమంత్రి పాల్గొన్న సభలోనే శ్రీ పి వి జి విమర్శించినట్లు పత్రికలు ప్రచురించాయి (తను ప్రభుత్వ నిర్ణయాన్ని విమర్శించలేదంటూ శ్రీ పి వి జి పత్రికలవార్తకు సవరణగా ఒక ప్రకటన ఇచ్చారు గాని నిజానికి అది వివరణగా ఉందికాని సవరణగా లేదు) అసలు ఈమధ్య ముఖ్యమంత్రి కొత్తగా జారీచేసిన కమ్యూనల్ జి ఓ పట్ల శ్రీ పి వి జి కి సదభిప్రాయం లేనట్లు వినికిడి కులాన్నిబట్టి గాక ఆర్థికస్తోమతును బట్టి వెనుకబడినతనాన్ని నిర్ణయించాలని ఆయన అభిప్రాయం అందుకే ముఖ్యమంత్రి వైఖరితో ఇమడలేక అప్పుడప్పుడు బయట పడుతుంటారు

కారణాలు ఏవైతేనేం వ్యక్తిగతమైన స్నేహం శత్రుత్వాలవల్ల, లేదా స్వకీయమైన ఇష్టా నిష్టాల వల్ల ప్రభుత్వనిర్ణయాలను మంత్రులుగా ఉంటున్నవారు బహిరంగంగా విమర్శిస్తుంటే ముఖ్యమంత్రి సహించి ఊరుకోవలసిందేనా అన్నది ప్రస్తుత విషయం నిక్కచ్చిగా వ్యవహరించే ముఖ్యమంత్రి ఉంటే ఈ బాపతువారు ఏనాడో మంత్రివర్గం నుంచి నిష్క్రమించి ఉండేవారు మొన్న పత్రికా విలేఖరులు ఈ సంగతి తన దృష్టికి తేగా ప్రభుత్వనిర్ణయాలను మంత్రులు విమర్శించడం చాలా తీవ్రమైన విషయమని తగిన చర్య తీసుకొంటామని అన్నారు అలా అన్నా వారు చర్యతీసుకొంటారనే నమ్మకం ఎవరికీ కలగడంలేదు ఇటువంటి సందర్భాలలో చర్యతీసుకోవడం అంటే రాజీనామా చేయమని అడగడం తప్ప వేరేమీ కాదు ముఖ్యమంత్రి అలా అడగలేరని అనుకోడానికి అనేక కారణా లున్నాయి. ఒకటి శ్రీ చంద్రమౌళి తనకైనవాడు ఆయనపై చర్యతీసుకుంటే స్వపక్ష బలహీనత వస్తుంది ఇక పి వి జి రాజు ప్రత్యర్థివర్గంలోని వారు ఆయనను రాజీనామా ఇవ్వమని అడగటం సద్దుమణిగిన ముఠారాజకీయాలను మళ్లీ ప్రజ్వలింపచేయడమే రెండు రానున్న ఎన్నికలు ఏకోన్ముఖంగా ఎన్నికల సమరాంగణంలో దూకవలసిన ఈ సమయంలో మళ్లీ అంతఃకలహాలకు అవకాశమివ్వడానికి ఆయన సిద్ధపడకపోవచ్చు మూడు: ఏ మంత్రిపైనైనా చర్య తీసుకోవాలంటే ముందు అధిష్ఠానవర్గ అనుమతి వేడాలి ఈ సమయంలో అధిష్ఠానవర్గం అనుమతి ఇవ్వడం సందేహాస్పదం నాలుగు ఏమైతేనేం తాడోపేడో తేల్చుకొనే మనస్స్వభావంగలమనిషి కాదు శ్రీసంజీవయ్య ఆ సంగతి నిరుటి ముఠా సంగ్రామంలోనే తేలిపోయింది

ఇన్ని కారణాలవల్ల వ్వాతః చర్య తీసుకోడానికి సిద్ధపడకపోయినా ఈ వ్యవహారం యావత్తు అధి

(౬౬–వ పేజీ చూడండి)

# మొక్కిన వరమిచ్చు వేలుపు

### ఫిలిం డిస్ట్రిబ్యూటరు

ఈసారి కాస్త బంపర్ క్రాప్ పడేట్టు చూడు స్వామీ. నీ మీద గేవాకలర్లో పిక్చరు తీయిస్తాను

### "చండీ" దాసు

మా ఆవిడ—రోజు విడిచి రోజైనా వంట చేసేలా చెయ్యి స్వామీ

### రోమియో

లాస్టియరు నేను హృదయం సమర్పించింది 'వల'ని కదూ చెప్పాను—కాదు—చిన్నమార్పు వచ్చింది—ఈసారి సరోజ—ఐమీన్ భానుమతి—ఆమెను పెళ్లాడకపోతే నైవేటి పూజ దాకా ఆటి రాను—మా అమ్మా నాన్నా, సంఘం, సెన్సారు బోర్డు వాళ్లూ ఒప్పుకునేట్టు చెయ్యి—కాస్త ఆ పిల్లని కూడా ఒప్పించే భారం నీదే—కనసం నా వేపు ఓ సారి చూడమను—ప్లీజ్

### సినిమా కవి

ప్రతిసారి సెట్లు మీద నా డైలాగులు ఖూనీ అయిపోతున్నాయి కత్తితో బాటు నాటివి మార్చిపరి మార్చేస్తున్నారు— నా డైలాగులు నటీ నటులందరికీ వచ్చేట్లు చూడు స్వామీ—

### అప్పిరావు

హాలో! ఒక్క సైడుంటే చూడు స్వామీ—మళ్లీ చవితి నాటికి సర్దేస్తా

### విద్యార్థిని

నాకు డబ్బు మీద మోజు లేదు అందమైన వాడు, నా మాట వినే వాడూ భర్తగా కావాలి—ఆయనకి పెద్ద మేడా, కారూ, పెళ్లానికి బోలెడు నగలూ కొని పెట్టే స్తోమతా వుంటే చాలు—

### తెలుగు ప్రొడ్యూసరు

ఆ కలకత్తా వేపు కూడా పూజకి వెళ్తావు గావోసు—కాస్త మంచి బెంగాలీ స్టోరీ ఏదన్నా వుంటే కనుక్కుందు స్వామీ—డబ్బెంతైనా భయం లేదు

### కాం(బోయి) నాయకుడు

వినాయకుడి దాకా ఎందుకు! నాకు ఓటిస్తే మీ కోర్కెలన్నీ నెరవేరుస్తా

స్వామీ! వీళ్లంతా నా మాట నమ్మేట్టు చూడు—అర్జునవదగ్గర పేరూ గోత్రాలు విని పేలు చెప్పు కునేట్టు చేస్తా—

### వినాయకుడు

స్వామీ—వీళ్లలా పాడు కోరికలు కోరకుండా చూడు—

# మనమూ మనదేహస్థితీ

డా॥ గాలి బాలసుందరరావు

## గొంతునొప్పి: కొన్ని రోగములు

గత వారాల్లో గొంతుకలో నొప్పి రావడానికి అతి సాధారణ కారణములయిన టాన్సిలైటెస్, డిఫ్తీరియా వ్యాధులనుగురించి కొంత వరకు తెలుసుకున్నాము ఇప్పుడు గొంతు నొప్పి కలిగించే మరికొన్ని వ్యాధి విశేషములను చర్చిస్తాను ఇవి, అంత తరుచుగారావు కాని వచ్చినప్పుడు ముదరకముందే వైద్య సహాయం పొందితే శస్త్ర చికిత్స అవసరం లేకుండా, ఆరంభంలోనే సమసిపోయేటట్లు చేసుకోవచ్చును ప్రాణాపాయం జరగకుండా చూడవచ్చును

క్విన్సీ (Quinsy) టాన్సిలైటెస్‌కు ఫలితంగా టాన్సిల్ చుట్టూ "ఏబ్సెస్" (చీముబుగ్గ) ఏర్పడుతుంది ఈ రోగ స్థితిని "క్విన్సీ" అంటారు తీవ్రస్థితిలోవున్న టాన్సిలైటెస్ లక్షణాలే, యీ వ్యాధిలోనూ వుంటవి అంటే, గొంతులో విపరీతమయిన నొప్పి, మింగలేకపోవడం, ఊపిరి తీసుకోవడం అసాధ్యముగా బాధాకరముగా వుండడం, పెద్ద పెట్టున జ్వరం, ఇవన్ని యీ వ్యాధిలోనూ వుంటవి కాని తీవ్రమయిన టాన్సిలైటెస్‌లో సాధారణంగా రెండు టాన్సిళ్ళు యిన్‌ఫ్లేం అవుతవి క్విన్సీ రెండు ప్రక్కలా సాధారణంగారాదు ఒక ప్రక్క టాన్సిలే చాలా పెద్దదై, చాలా ఎర్రబడి రెండు మూడు రోజులలో దానిమీద తెల్లని మొన దేలుతుంది వేలితో నొక్కిచూస్తే విపరీతమయిన బాధ కలిగి, రబ్బరు బుడగలాగా నొక్కితే గుంట బడి వేలు తియ్యంగానే మళ్ళీ యథాస్థితికి వస్తుంది ఆ ప్రదేశం చాలా వేడిగా వుంటుంది క్విన్సీ యీ స్థితిపొందిన తరవాత శస్త్ర చికిత్స తప్పదు నిర్లక్ష్యంచేస్తే నిద్ర పోతున్నప్పుడు పగిలి ఆ చీము శ్వాసనాళంలోకిపోయి, తీవ్రమయిన, అతి ప్రమాదకరమయిన ఫలితములను కలిగించవచ్చును ముందే మేలుకుని, సల్ఫానిలమైడ్ మాత్రలో, పెన్సిలిన్ మాత్రలో, వయస్సుకూ, బరువుకూ తగిన మోతాదులో వాడితే, ఆ స్థితి రాకుండానే వ్యాధి సమసిపోతుంది వైద్య సహాయం వున్నచోట, స్వంతవైద్యం ప్రమాదమనీ, మూర్ఖమనీ యిది వరకే రాశాను కాని, అది లభించనప్పుడు ఏ చికిత్సా లేకుండా విధికి వదిలివెయ్యడము, అంతకంటే ప్రమాదకరం అందువల్ల కొన్ని మందుల స్వభావాన్ని తెలుసుకుని వాడడం, కొన్ని పరిస్థితులలో అవసర మౌతుంది సాధారణంగా సల్ఫానిలమైడ్ మాత్ర కొన్ని మిల్లిగ్రాముల మందుతో వుంటుంది మాత్ర అంతా మందుకాదు కొన్ని మిల్లిగ్రాముల మందు పాల పంచదారలోవేసి మాత్రగాచేసి అమ్ముతారు పుండుమీద సల్ఫానిలమైడ్ పొడుం చల్లితే, చీముపోయి పుండుమానుతుంది ఈ సంగతి తెలిసిన కొందరు గాయం మీద, పుండుమీద సల్ఫానిలమైడ్ మాత్రను పొడుంచేసి చల్లుతారు అందులోవున్న మందు క్రిమి సంహారానికి చాలదు కాని అందులోవున్న పాల, పంచదార క్రిములకు మంచి ఆహారమై వాటి వృద్ధికి చాలా సహాకరిస్తుంది !

సాధారణంగా మందు బిళ్ళల మోతాదు, ఇన్ని కిలోగ్రాముల బరువుకు యింత అనివుంటుంది కిలోగ్రాంఅంటే $2\frac{1}{5}$ పౌనులు రోగి బరువు తెలిస్తే దానిని $2\frac{1}{5}$ పెట్టి భాగిస్తే ఎన్ని కిలోగ్రాముల బరువుగలవాడో, అతనికి ఎన్ని మిల్లిగ్రాముల మందు వాడాలో తెలుస్తుంది కాని ఈ గణితం వైద్యులకే చికాకు కలిగిస్తుంది బరువు, వయస్సు యీ రెండూ కూడా మోతాదు నిర్ణయించడంలో అవసరములే ఆ యా వయస్సుల వారికి, ఉజ్జాయింపుగా మోతాదు నిర్ణయించి, అపయోగించే సూత్రం అవసరం అందుకు ఈ క్రింది సూత్రం ఏర్పడింది

$$\frac{\text{'వ'} \times \text{వయస్కుల మోతాదు}}{\text{వ} + 12}$$

ఇక్కడ 'వ' అంటే రోగి వయస్సు ఉదాహరణంగా ఎనిమిదేళ్ళ కుర్రాడికి "ఏస్పిరిన్" (aspirin) వాడాలనుకోండి ఏస్పిరిన్ పెద్దవారి మోతాదు అయిదు గ్రెయినులు వయస్సు 8 సంవత్సరములు అంటే

$$\frac{8 \times 5}{+12} = \frac{40}{20} = 2 \text{ గ్రెయినులు}$$

ఎక్కడోతప్ప వయస్సు ననుసరించే బరువు వుంటూ వుంటుంది వినికిడినిబట్టి ఫలానామందు ఫలానా వ్యాధికి మంచిదని తెలుసుకుని, పెద్ద వాళ్ళ మోతాదులో పిల్లలకువేసి ప్రాణమోసం తెచ్చుకున్నవాళ్ళు చాలామంది ఉన్నారు ఏ మందు మోతాదు నిర్ణయించడానికయినా యీ సూత్రం సహకరిస్తుంది మోతాదు నిర్ణయించుకుని మందులు వాడడం అత్యవసరం

ఫేరింజైటెస్ (Pharyngigtis) గొంతునొప్పికీ మింగలేకపోవడానికీ మరొక సాధారణ కారణం ఫేరింజైటిస్ : అంటే పేరింగ్సులో ఇన్‌ఫ్లమేషను అంగులి వెనకభాగం తీవ్ర స్థితిలో (acute shape) ఎర్రబడివుంటుంది మింగడం కష్టంగా వుంటుంది ఈ స్థితిలో జలుబు కూడా వుంటుంది కాని యీ వ్యాధి కొందరిలో —ముఖ్యంగా విపరీతంగా పొగ త్రాగేవారిలో దీర్ఘస్థితిలోనే ప్రారంభించవచ్చును ఈ స్థితిలో— నునుపుగా వుండవలసిన పేరింగ్సుమీది మూక్యస్‌పొర గరగరలాడుతూ వుంటుంది మంట వుంటుంది ఋతువు మారినప్పుడూ, శీతోష్ణస్థితి మారినప్పుడూ పడని పదార్థములు తిన్నప్పుడూ యిది తీవ్రస్థితిని పొందుతూ వుంటుంది వూపిరితీసినప్పుడల్లా దగ్గు, కళ్లె పడుతుంది కొన్నాళ్ళకి ఆ ప్రదేశం అంతా పుండయిపోతుంది ఆ స్థితి వచ్చేక నివారణ చాలా కష్టం టింక్చరు బెంజాయిన్‌కో (రెక్టిఫైడ్) మరిగే నీళ్ళలోవేసి ఆ ఆవిరి పీల్చడం మంచిది విటమిన్ సి సల్ఫానిలమైడ్, పెన్సిలిన్, టెట్రసైక్లిన్ (ఆ క్రొమైసిన్, టెర్రమైసిన్ మొదలయినవి) తీవ్ర స్థితిలో ఉపయోగకరములు

స్కార్లెట్ జ్వరం "స్కార్లెట్" అంటే ముదురు ఎరుపు రంగు అంగిలి, గొంతు ముదురు రంగు ఏర్పడేంతగా ఈ జ్వరంలో ఇన్‌ఫ్లేం అవుతవి గనక యీ జ్వరానికి యీ పేరు వచ్చింది ఈ వ్యాధి ఎక్కువగా శీతలదేశములలో వస్తూ వుంటుంది కాని శీఘ్ర ప్రయాణసౌకర్యములు వచ్చిన యీ రోజుల్లో ఏ వ్యాధీ కేవలం యీ దేశాల్లోనే వస్తుంది అని చెప్పడానికి వీలులేదు ఈ జ్వరం టాన్సిలైటెస్‌లాగానే హఠాత్తుగా ఏర్పడుతుంది వాంతులు కావచ్చు రెండవరోజు వంటిమీద పొక్కు వస్తుంది మూడవనాటికి నాలుక లక్కబుర్రలాగా ఎర్రబడిపోతుంది 4 వారాలనుంచి ఆరు వారాలలోగా చర్మంపై పొట్టు రాలిపోతుంది ఈ విషజ్వరాన్ని గురించి విషజ్వరములను గురించి చర్చిస్తున్నప్పుడు ఇంకా విపులంగా వివరిస్తాను ప్రస్తుతం గొంతునొప్పికి కారణములలో ఒకటి అయినందున ఉదహరిస్తున్నాను ఈ జ్వరం ప్రాణాపాయకరమైంది కాకపోయినా, ఇందువల్ల

(49 వ పేజీ చూడండి)

# హరివంశము

## సాందీపనిపర్వం - 28

బ్రహ్మముహూర్తమునకు ముందుగనే సాందీపని నిద్రలేచెను ఆ నిద్ర ఏమినిద్ర! బ్రహ్మానంద సహోదరమ్మైన సుఖమును ఆనిద్రలో తాను అనుభవించెను ఇట్టి నిద్ర తనకు పట్టి ఎన్ని వాళ్ళయినది దీక్షితాయణియు ఇంకను నిద్రపోవు చున్నది ఆ నిద్రలో ఆమెముఖము ఆనందమును విరియుచున్నట్టులున్నది కుక్షివాడు ప్రభాస తీర్థమున ఉగ్రగ్రాహము వాతబడిన అనంతరము ఇట్టి ఆనందము ఆమెముఖములో ఎప్పుడును కనిపించలేదు సాందీపని ఆమెను నిద్ర లేపలేదు ఆమె ప్రతిదినమును తనకన్నను ముందుగా నిద్ర నుండి లేచెడిది స్నానసంధ్యాద్యనుష్ఠానములకుగాను తాను ప్రతిదినమును మణికర్ణికకు పోవును అందుకు వలయు పరికరములును ఆమె తాను లేచునప్పటికే సిద్ధముచేసియుంచెడిది ఇప్పుడు ఆమె ఆనంద మున మునిగి నిద్రపోవుచున్నది కాశిక యంతయు అట్టులే ఉన్నట్టు లున్నది సాందీపని తన ప్రక్క మీదనుండి లేచినాడు శ్రీకృష్ణాది యాదవ కుమా రులు రాత్రి పొద్దుపోయి గూడ ఇంటికి రాలేదు ఆయనకు ముందు కొంత భయమ్మైనది దీక్షి తాయణి మరియు భయపడినది "స్వామి! శ్రీకృష్ణ బలరామాదులకు కాశిక క్రొత్త వారు ప్రొద్దు పోయిగూడ ఇంకను రాలేదు" అన్నది ఆమెను తాను అనునయించినాడు "అమ్మీ! మహానందుడు గూడ వారితో వెళ్ళినాడుగదా! వారు ఉండగా ఎవ్వరికిని ఏమియు భయములేదు" అనినాడు

వారు రాత్రి తిరిగి యింటికి వచ్చినారో! బ్రహ్మముహూర్తమునసే వారికి తాను పాఠము లను మొదలుపెట్టవలయునని సాందీపని అనుకొని నాడు ఈ శిష్యులేమో విచిత్రమ్మైనవారు వారు రాగా కాశికయంతయు వసంతముకన్నను అంద ముగా దేవతలచేత, పరమశివునిచేత అలంకరింప బడినది పరమశివుడు తనకు సమాధిలో దర్శన మిచ్చి, ఈ శిష్యులనుగూర్చి హెచ్చరించి ఉన్నాడు ఇంతవరకు తనవద్దకు శిష్యరికమునకు ఎవ్వరు వచ్చినను తాను పురాసంప్రదాయమునే అనుస రించుచు, వారి శిష్యత్వమును అంగీకరించుట యున్నది. ఇప్పుడు ఆ సంప్రదాయమును ఎట్లు పాటించవలయునో తెలియుటలేదు ఒక్క సంవత్స రము వీరిని శుశ్రూషయందు నియోగించుట ఎందులకో అర్థమగుటలేదు వారిని చూచినచో, తన్ను గురుగౌరవముచేత గౌరవించవలయునని తలచినట్టున్నది. సాందీపని శ్రీకృష్ణ బల రాముల యాదవకుమారులను ఆశ్రమములో [illegible] [illegible] [illegible] [illegible]

నామాక్షి పండుకొనియున్నది సాందీపని కాలి యలికిడికి మహానందుడు లేచినాడు

"సాందీపని! నేను నిత్యజాగరూకుడనయ్యా!" అనినాడు

"అవును! అవును! నీవు నిత్యజాగరూకుడవు రాత్రియంతయు మేము బిడ్డలు ఏమయినారో అని భయముతో కొట్టుకొనిపోయినాము" అని నాడు సాందీపని

"నిజముగనా! సాందీపని!" అని మహా నందుడు నవ్వినాడు

"సాందీపని! నీ యీ శిష్యులు సామాన్యులు కారు నేను గ్రహించినాముకదా!" అనినాడు

"నీవు గ్రహించనిది ఏమి ఉన్నది పద శిష్యు లను మేల్కొలుపు బ్రహ్మముహూర్తవేళకు మనము అవశిష్టములు తీర్చుకొని ఆశ్రమమునకు రావలయును నేడే పాఠములు ప్రారంభింతును" అనినాడు సాందీపని

మహానందుడు సాందీపనిశిష్యులను నిద్రలేపి నాడు అందరును మణికర్ణికకు బయలుదేరినారు



దారిలో సాందీపని ఏమియు మాటాడలేదు ఎవ్వ రును మాటాడలేదు ఆయన ముందు, వారు వెనుకగా, వారు మణికర్ణికను దరిసినారు మణి కర్ణిక ఆ వెన్నెలలో పరమశివుని శరీర కాంతివలె ఉన్నది పరమశివుని ఆగమనమును నిరీక్షించు జ్యోత్స్నాభిసారికవలె ఉన్నది పార్వతీదేవి మంద హాసములు చింది బిందువులకట్టి రసరూపము నవధరించి, ఆనందమును చిందుచున్నట్టు లున్నది భూతములకు పృథివి రసము పృథివికి జలము రసము జలమునకు ఓషధులు రసము ఓషధులకు పురుషుడు రసము పురుషునకు వాక్కు రసము వాక్కు నకు ఋక్కు రసము ఋక్కునకు సామము రసము సామమునకు ఉద్గీథము రసము ఉద్గీథ మునకు మణికర్ణిక రసము అట్టులున్నదిమణికర్ణిక.

కంకాళ కిరీట నిటంక
గ్నారుచి చులికితజల మణికర్ణిక
మందాకిన్యంభో వేగోద్ధర
మధ్య నాభిచక్రము మణికర్ణిక
శివు కాశిపతి విశ్వనాయకుని
సేవింపగ తలపెట్టినయప్పుడు
ప్రణవరూపము పరిత్యజించి
మానితాకారము దాల్చిన మణికర్ణిక
ప్రత్యక్షంబై పుణ్యపురంధ్రీ
భావంబు భజించినదనయంబున
నత్యంత మనోహరహార హావ
భావాభిరామయగు మణికర్ణిక
చక్ర పుష్కరిణి యను నామమున ప్రశ
స్తి వహించిన యది మణికర్ణిక
చక్రనేమి చంక్రమమున దిరిగెడు
సంసృతికి విరుగుడు మణికర్ణిక.

సాందీపని మణికర్ణికలో క్రుంకులిడినాడు. ఆయన శిష్యులును క్రుంకులిడినారు అందరును చక్రపుష్కరిణిలో వార్చినారు ప్రాతః కర్మాను ష్ఠానములను నెరవేర్చుకొన్నారు తిరిగి ఆశ్రమ మునకు బయలుదేరినావరు

ఒక్క దానమును కోటి దానమ్మై
ఒనగు ఫలము నరునకు మణికర్ణిక
ఒక్క యాగమును కోటియాగమ్మై
యొనగు ఫలము నరునకు మణికర్ణిక
ఒక్క ధర్మమును కోటి ధర్మమ్మై
యొనగు ఫలము నరునకు మణికర్ణిక
మణికర్ణిక చింతామాణిక్యము
మణికర్ణిక బృందారకధేనువు
మణికర్ణిక కల్పద్రుమవాటిక
మణికర్ణిక సిద్ధ రసస్యందనము
శ్రీ మణికర్ణిక అణిమాది
మహాసిద్ధి కారణము సేవక కోటికి

కోటికి పడగవెత్తినట్లు ఆశ్రమము శోభాయ మానమ్మై కన్నులకు తోచినది సాందీపని పొంగిపోయి నాడు ఈ తన ఆశ్రమమునకు శ్రీకృష్ణబల రాములవంటి శిష్యులు ఎప్పుడు వచ్చినారు? ఎప్పుడు తన్ను విద్యాభిక్షను వేడినారు! ఇటి అదృష్టము తనకు వినా మరి యెవ్వరికినైనను ఎప్పుడైనను కల్గినదా! ఆయనలో ఇప్పుడు పుత్ర దుఃఖము లేదు పుత్ర నిర్విశేషమ్మైన వాత్సల్యము రామకృష్ణులదెస ప్రసరించుచున్నది ఆయన ఆశ్రమమున అగ్నిగృహమున ప్రవేశించినాడు అప్ప టికే దీక్షితాయణి అచ్చట నంతయు సిద్ధముచేసి యుంచినది ఆమెయు ఆనందముతో తొణికిస లాడుచున్నది సాందీపనికి ఆమెను ఆ స్థితిలో చూడగా నాశ్చర్యమ్మైనది

"స్వామి! బిడ్డలు ఎక్కడ?"

"ఎవరు?" అని ప్రశ్నించినాడు సాందీపని.

"స్వామి! రామకృష్ణులు"

"విద్యామందిరమునఉన్నట్టులున్నారు చూడుము."

"తడిగుడ్డలతో లేరుగద!"

"నాకేమి తెలియును"

సాందీపని నవ్వినాడు ఊర్పు తీసుకొనినాడు. దీక్షితాయణియు పుత్రదుఃఖమును మరచిపోయినది.

దీక్షితాయణి మహానందుని పిలిచినది సుందా ముని పిలిచినది "ఓరి! మహానంద! నాయనా! సుదామ! చూడు అక్కడ రామకృష్ణులకు, ఇతర యాదవకుమారులకు బట్టలు అరవేసినావా. ఈపాటికి ఎండియుండవచ్చును అవి వారికి ఈయుమురా!" అన్నది

(౬౬-వ పేజీ చూడండి)

హారీత శివశర్మ

"ఏమిటీ జీవితం ? ఎందుకోసం ? అంతులేని ఈ జీవిత బాటమీద ఎంతని పయనించేది ? ఎప్పుడు — ఎక్కడ—గండిపడి బాటమీదకు వరద వెల్లువలై ప్రవహిస్తుందో మునిగిపోతుందో తెలుసుకోలేని ఈ అమాయకత మానవుల కెందుకు ?

"ఈ జీవితబాట ముళ్ళపొదల్తో కప్పబడి వుంటుంది ఎందరో ఎదురుపడి పలకరించి పాలించి లాలించి వెళ్ళిపోతూంటారు అవునా, రాణీ! ఆ అందరిలోనూ నన్ను లెక్కవేస్తావా ? నీ అందమైన విగ్రహంకోసం అర్రులుచూచే ఈ దీనుడ్ని "

టక్కున ఆపేసాడు, మధు గుర్రుగా చూశాడు ఆంజనేయులుకేసి

"ఒరే కృష్ణా ! ఈ చుంచుమొహంగాడ్ని అందమైన విగ్రహమని ఎలా వర్ణించేదిరా ? అసలు—నాక తెలియక అడుగుతాను — వీడికి హీరోయిన్ పాత్ర నెవరిమ్మన్నార్రా ?" అంటూ కసురుకున్నాడు ఆంజనేయులు కోపంతో తాటి ప్రమాణానలేచి — ఆ కోపంలోనే రిహార్సల్స్‌కని కట్టుకున్న చీరను కాస్త విప్పేసి, కాకి పొడిచిన కోతిలా అదేపనిగా ఎగరటం మొదలెట్టాడు

"ఒరేయ్ — నీ కిష్టమైతే నటించు లేకపోతే మానెయ్ అంతేకాని మాటి మాటికీ నన్నిలా తిడుతూంటే నేనూరుకునేదిలేదు జాగ్రత్త !! నాలుగురోజుల్నుంచి నీ వరస చూస్తున్నా నువ్వు క్రితం సంవత్సరమే కాలేజీ కొచ్చావు — అద్దైనా



మూడేళ్ళు మాత్రమే హైస్కూల్లో చదివి నాకు స్కూల్లోవున్న అనుభవంలో ఆరోవంతు కూడా నీకు లేదు — వరసగా ఆరేళ్ళు స్కూలు బెస్టు పాత్రధారిణిగా బహుమతి పొందాను తెలిసిందా ? ఇకనుంచీ ఈ వాగడు మళ్ళీ వాగేవంటే— పళ్ళు రాలకొట్టి పొట్లం కట్టిస్తా, జాగ్రత్త"

నేను కల్పించుకోక తప్పలేదు "ఒరేయ్ అంజిగా— ఒరే — విన్నేరా — కాస్త అలుక మానరా !—" వాడు వినిపించుకోలేదు

"ఒరేయ్ ఉషారాణీగారూ !" గట్టిగా అరిచాను "కొంచెం యిటు వస్తారా ?" నా గొంతుకు దడసుకున్నాడో ఏమో వాడు గల్లంతు మానేసి నా వెనుకనే ప్రక్కగదిలో కొచ్చాడు వాడి బుంగ మూతిచూస్తే నాకు నవ్వాగలేదు

"నీకు నిజంగా మీవాళ్ళు భలేపేరు పెట్టార్రా ఆ — సరేకాని, చూడరా యిటు — మనం నాటకం వేస్తున్నది మనకోసంకాదుకదా ఒక సత్కార్యాన్ని తలపెట్టి దాన్ని జయప్రదం చేయడానికిగాను ఈ నాటకం వేస్తున్నాం — మన పుణ్యమా అంటూ ఆ సుబ్బిగాడు ఒకింటివాడైతే మన కదే పదివేలు అనుకున్నాంకదా అవునా ?"

వాడు అవునన్నట్లు తలూపాడు

"ఎన్ని కష్టాలొచ్చినా — ఎన్ని వరదలొచ్చినా జీవిత బాటమీద పరిగెత్తుకుంటూ పోవాలి అలాగే ఈ నాటకం స్టేజి ఎక్కేవరకూ మనలో మనం కష్టాలన్నీ మరిచిపోయి తిన్న తిట్లన్నీ అరిగించుకుని —ఎంత శ్రమైనాపడి — ఈ నాటకాన్ని, తద్వారా సుబ్బరాయుడిపెళ్ళి జయప్రదం గావించాలని మనందరం కోరుకుంటున్నాము అవునంటావా ?"

"అవున్రా కాని — కృష్ణా ! వాడు చూడరా ఆ వెధవగాడిద — మధూగాడూ — మాటి మాటికీ నన్ను 'చుంచుమొహంగాడు'—'నాలుగు—ముచ్చుమొహంవాడు' అంటూంటే ఎలా ఊరుకునేదిరా ! ఒకసారి రెండుసార్లైతే ఫర్వాలేదు —' ఇలా ఆంజనేయులు నాతో విన్నవించుకుంటూంటే, అన్నీ తలుపుచాటున నిల్చుని విన్నాడో ఏమో— మధు లోపలకు పరిగెత్తుకొచ్చాడు తారా జువ్వలా

"ఒరేయ్ — ఒక్క గుద్దుకు చంపేస్తాను అందునా నువ్వు ఆడవేషం వాడివి అబలవుకదాని ఊరుకుంటూంటే 'ఊఁ' వాగుతావా ? గంటకు రెండుసార్లైనా నిన్ను తిట్టవద్దంటావా ఏమిటి— ఆ ! కోతిగాక ఏమిట్రా నీ మొహం — ఇంకా మాట్లాడితే పిడత మొహం — ఎలుకమొహం—"

అంజిగాడికి పౌరుషం వచ్చింది పాట పాడేశాడు

"ఈనాటి భారతదేశంలో అబలలు సబలలేనుసుమ్మా ఇది తెలిసికొమ్మా ఓ రాజారావా ?" అని పాడుతూ మధుమీదకు విరుచుకుపడ్డాడు మధూను చావగొట్టకముందే నేను 'రాణి' చేతుల్ని పట్టుకు బ్రతిమాలాను

"వరేయ్ — యిదంతా స్టేజిమీద వేస్తార్రా ఏమిట్రా— నా పరువులు కాస్తా పోతాయి—" అంటూ వాపోయాను

"మధూ ! ఈసారికి బ్రతికిపోయావురా కష్టమించాన్లే డైరెక్టరుగాడి రికమెండేషన్‌తో" అన్నాడు ఆంజనేయులు

చుట్టూ చేరిన స్నేహితు లంతా గొల్లున నవ్వేశారు మధు తలదించుకునే బుసలు కొట్టాడు. ప్రక్కనున్న శ్రీధర్‌తో—"వీడి పని చూస్తాగా— నాలుగో సీనులో నేను లెంపకాయ కొట్టాలిగా. అప్పుడు తేల్చుకుంటాను వీడి సంగతి స్టైజా గిజా పోతేపోయింది" గొణిగాడు

నాకు కూడా వినిపించాయి వాడి మాటలు అన్నంతపనీ చేస్తాడేమోనని భయపడ్డాను కానైతే యిప్పుడేమీ అనడానికి వీల్లేని పరిస్థితి ఏర్పడింది.

"ఆ—రైట్ ఏదీ — మళ్ళీ మొదటి సీను ప్రారంభిద్దాం ఏడీ సుబ్బారాయుడు"అంటూ చుట్టూ చూశాను వాడు కనిపించక ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకున్నాం

దొడ్లో నూతిగట్టున కూర్చుని తనలో తను ఏదో మాట్లాడుకుంటున్నాడు సుబ్బారాయుడు

"బస్సులో కన్పిస్తావ్—కవ్వించి మొదటి స్టాపులోనే దిగిపోతావ్ సినిమా హాల్లో కన్పిస్తావ్—కాని నలుగురి మధ్యన కూర్చుంటావ్ సముద్రపు వడ్డుకు వస్తావ్ — అయినా ఏం లాభం ? నీ ప్రక్కన ఎప్పుడూ తలపండిన ఆ ముసిల్ది వుంటూనే వుంటుంది నీతో నా హృదయ ఘోష ఎలా చెప్పుకునేది ? అరుణాదేవీ !! నీతో మాట్లాడే అవకాశమే రాదా ?"

వాడి లోకంలో వాడున్నాడు పిండారబోసినట్లున్న నిండు వెన్నెల్లో కూర్చుని మావాడు విరహం అనుభవిస్తున్నాడు ఎలా ఉంటుందో రుచి చూద్దామనుకుని

"ఒరే — సుబ్బిగా నీ సీను వచ్చిందిరా—" అని నేను యిలా కేకేసేనో లేదో అలా లోపలకు పరిగెత్తుకొచ్చాడు తన పాట పాడేశాడు ఆయాసమైనా తీర్చుకోకుండా

"నిదురించకోయి ఎదిరించేవేళ
ఎదిరించవోయి నిదురించే వేళ— "

"ఒరేయ్—ఆపు నీ పాట ఆపావు— ఆపాట అప్పుడేకాదు రాజారావు నిద్రపోవాలి నువొచ్చి పాడాలి ఏదీ—మధూ—నువ్వు నిద్రపో—" డైరెక్టు చేశా

మధు గదిలో మధ్యగా వేసున్న మంచంమీదకు

(45-వ పేజీ చూడండి)

# ఋణదాశరథీ! కఋణాపయోనిధీ!

ఎవ్వనిచే జనించు ఋణ మెవ్వనిచే భ్రమియించు లోకమం
బెవ్వని బుద్ధియే ఋణద మెవ్వడు ఖర్చుచు నప్పులిచ్చు దా
నివ్వగ జాలనం చనక, నివ్వగ జాలక చివ్వనట్టి వా
డెవ్వడు—ఆ ఋణాత్ము, ఋణదేశ్వరు నేను ఋణంబు వేడెదన్.

ఒక నూర్యందు సమస్త జీవులకు దా నొక్కొక్కడై దోచు న
ప్పొకటే యేక ధనమ్ముగా ఋణముగా, నొక్కొక్కచో శత్రుగా
నొకచో రక్షగ, లక్షగా తృణముగా నొక్కొక్కడై దోచుగా
కొకటే సత్యము—ఓ త్రియోకుడి!—అప్పొప్పల్ అపోహల్, భ్రమల్.

ఋణ ఋగ్వేదికి వాదికి! ఋణకారణ జన్ముడైన ఋణఖాదికి దా-
ఋణబుద్ధికి ఋణసిద్ధికి! ఋణభ్రమాభ్రమరుపకును ఋణికిన్ ఘృణికిన్.

ఈ ఋణతరుణ వందన సహస్రం బాచరించి, నా ఋణసర్వంబూనిన శిరక్ప్రకారంబు ఒక్క నిముషం; ముందు నా మనవోటి వినండి తరవాత అసలు విషయానికి రావచ్చు.

కబ్బము చేయుచుంటి నిధి కోగను, యచ్చుకు బంపగాను, నా
కబ్బయ డబ్బు పంపగను—కబ్బయ తప్పక పంపు లెమ్మ—నీ
[illegible] —నమ్మ, శే
[illegible] ఋణదా! శరథీ! [illegible]!

[illegible] లోకము
[illegible] నందుకే!
[illegible]
[illegible] పయోనిధీ!

[illegible]
[illegible]
[illegible]
[illegible] ఋణదా! శరథీ! కఋణాపయోనిధీ!

'నాకడ నప్పు చేయుటకు [illegible] నా
లోకమునందు [illegible] నదులన్నిట [illegible]
నాకడలిన్నగ స్వామిని యక్కట! పుక్కిటబట్టి నిల్పలే
దా? కఋణాసముద్ర! ఋణదా! శరథీ! కఋణాపయోనిధీ!

(తమరు ఋణదానం చేసేవరకూ అంతం బండికదలదు, ఋణగుణాన్వని చప్పున కల్లారిపోతుంది. గాన వెంటనే ఓ దేవా! తామీవిషయం బాలోచింపగలరు.)

ముళ్లపూడి వెంకటరమణ

# మీ(మా) 'సాహిత్య' పరిచయమెంత?

సరియైన జవాబులు (నిజంగా) తెలిసిన ప్రశ్నలకే సమాధానాలివ్వండి ఒక్కొక్క ప్రశ్నకి ఒక 'మార్కు' సమాధానాలు 64 వ పేజీలో ఇవ్వబడ్డాయి

1 గులాబీలు ఎక్కడ కనిపిస్తాయి?
 (అ) గులాబీ చెట్లమీద
 (ఆ) పెద్దమనుష్యులకు తగిలించే మాలలలో
 (ఇ) నాయిక చెక్కిళ్ళలో

2 శ్రీ ఉండేచోటు ఏది?
 (అ) విష్ణుమూర్తి వక్షస్థలం
 (ఆ) ఇనప్పెట్టె
 (ఇ) రచయిత (త్రి) పేరు

3 అప్సరస అంటే?
 (అ) దేవేంద్రుని సభలో ఒక వ్యక్తి
 (ఆ) ట్రాంబేలో ఒకయంత్రం
 (ఇ) కథానాయిక

4. నిట్టూర్పుతో భారంగా కదిలేది, లేక ఆగేది ఏది లేక ఎవరు?
 (అ) తినేందుకు ఏదైనా పెడ్తారని కూర్చునిఉన్న కుక్క
 (ఆ) క్యూలో గంటనుంచున్న తర్వాత టికెట్టు దొరకని వ్యక్తి
 (ఇ) ప్లాట్‌ఫారం పరిసరాలలో ఉన్న రైల్ ఇంజన్

5. అఖండమైన నీటి ప్రవాహం ఎక్కడ లభిస్తుంది?
 (అ) గోదావరిలో
 (ఆ) మునిసిపాలిటీకొళాయిలలో
 (ఇ) నాయిక కళ్ళలో

6 బుర్రమీసాలు (కొన్నిసమయాలలో తెల్లవెంట్రుకలతోసహా) కల వ్యక్తిఎవరు?
 (అ) జోసఫ్ స్టాలిన్
 (ఆ వినోబాభావే
 (ఇ) హీరోయిన్ తండ్రి

7 కథానాయిక నాయకునికి మరదలు, వదినకు వరసకు చెల్లెలు లేక తండ్రి బాల్యస్నేహితుడి కూతురుఅని తెలియనివారెవరు?
 (అ) పాఠకుడు (అంటే మీరు)
 (ఆ) రచయిత
 (ఇ) హీరో

8 గజగజలాడే వ్యక్తి ఎవరు?
 (అ) చలికాలంలో చన్నీళ్లస్నానం చేసేవారు
 (ఆ) 'హోంవర్క్' చేసుకురాకుండా వచ్చిన విద్యార్థి
 (ఇ) కథానాయకుడు

9 అపార్థం చేసుకునేది ఎవరు?
 (అ) అప్పులవాడు
 (ఆ) బ్రహ్మచెముడు ఉందని తెలియకుండా మీరు 'జోక్' చెప్పిన మనిషి
 (ఇ) కథలలో పాత్రలు (మట్టివి కావు)

10 విషాదగాథ ఎవరిది?
 (అ) హోటల్‌బిల్లు ఇచ్చేముందు జేబులో డబ్బులు లేవని తెలుసుకున్నవారిది
 (ఆ) పండుగనాడు ఎక్కువగా తినేసినవారిది
 (ఇ) నాయకుడు, లేక నాయిక లేక వారికి తెలిసినవారిది— (మీరు చదివేది)

11 ఏకవచనప్రయోగం జరిగేది ఎప్పుడు?
 (అ) ఇన్‌స్పెక్టర్ రామాప్రపంతులుతో మాట్లాడినప్పుడు
 (ఆ) బహువచన ప్రయోగం కానప్పుడు
 (ఇ) హీరోప్రేమఖాయమై హీరోయిన్‌తో మాట్లాడినప్పుడు

12 సుఖాంతం అంటే?
 (అ) రచయిత పాఠకుడికి దొరకకుండా తప్పించుకుపోవడం
 (ఆ) కథలు అచ్చుకాని రచయితల చేతులలో లావు క్రలున్నపుడు సంపాదకులు వారికిఎదురుకావడం
 (ఇ) చివరకు పెళ్లి జరగడం లేక ఒడిలో వాలిపోవడం. ★




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**20-9-1961** బుధవారము మొదలు
**26-9-1961** మంగళవారము వరకు

## మేషం

**(అశ్వని, భరణి, కృత్తిక 1 పా )**

బుద్ధిబలంతో ధన సంబంధమైన చిక్కులను దాటుకుంటారు తోటివారి మాటలను అనుసరించ తగిన సమయంకాదు తప్పనిసరిగా చేయవలసి వస్తుందని ఆందోళనపడుతున్న పనుల బాధ్యత సులభంగా తొలగిపోతుంది తలవనితలంపుగా ధనం చేతికి వస్తుంది విద్యావ్యాసంగాదులలో ప్రోత్సాహం బాగుంటుంది మానసికంగా గాని, శారీరకంగా గాని శ్రమ లేకుండా వృత్తి, వ్యవహార రంగాలలో మంచి ఫలితాన్ని పొందగలుగుతారు నౌకరులు మిమ్ములను మోసం చేయటానికి చూస్తారు కాని వారి ప్రయత్నాలు మీమీద పనిచేయజాలవు వారాంతంలో అకస్మాత్తుగా కష్టవార్తలు తెలుస్తవి పెద్ద పెద్ద ఆశలు పెట్టుకుని చేతికి అందిన ఫలితాన్ని వదులుకొనవద్దు 20, 21 లలో నీచజన స్నేహం కార్యసిద్ధి

*    *    *

## వృషభం

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా,)**

స్నేహితుల మాటను కాదనలేక భారం పైన వేసుకుని శ్రమపడవలసి వస్తుంది కుటుంబం లోని వారి ఆరోగ్యం సరిగా ఉండదు

> **గ్రహ స్థితి**
>
> సింహంలో శుక్ర, రాహువులు, కన్యలో సూర్యుడు, కన్య, తులలలో అంగారక బుధులు మకరంలో గురు, శనులు, కుంభంలో కేతువు మకర, కుంభ, మీన మేషాలలో చంద్రుడు

వ్యవహార విషయాలలో సౌమ్యంగా ఏపనీ జరుగదు స్నేహితుల ఆదరణ మాత్రం లభిస్తుంది మిమ్ములను చూచి నేర్చుకున్నవారే మీతో పోటీకి తయారు అవుతారు రకరకాల మనుష్యులతో పరిచయం లభిస్తుంది ఆదాయం తృప్తికరంగా ఉంటుంది నిరుపయోగకరమైన పనులలోనే అధికంగా ఖర్చు పెట్టవలసి వస్తుంది స్త్రీరాస్తులకు సంబంధించిన పనులు కొంచెం నిదానంగా నెరవేరుతవి ఆడంబరము, కీర్తి నిమిత్తం ఎదురు చూడతగిన సమయం కాదు తూర్పు, ఉత్తర దిక్కులనుంచి ఆదాయము, శుభవార్తలు వస్తవి 23, 24 లలో స్వల్ప విషయాలలోనే భయము, ప్రయాణ సూచనలు

*    *    *

## మిధునం

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఏది ఎలా ఉన్నా తలచిన పని సకాలంలో చేయ గలుగుతున్నామనే సంతృప్తి లభిస్తుంది ఈ వారంలో ఎక్కువ కాలం ఇతరుల నిమిత్తం వినియోగించవలసి వస్తుంది ధారాళంగా ఖర్చుపెట్టి ఆడంబరంగా చేయదలుచుకున్న కార్యాలను సమయానుకూలంగా మార్చుకుని క్లుప్తంగా నెరవేర్చవలసి వస్తుంది దేహసౌఖ్యం బాగుంటుంది సంఘంలో మీయందు మంచి అభిప్రాయము, గౌరవము ఏర్పడుతవి మీ ఉద్రేకంవల్ల వృత్తి వ్యాపారాలలో మనస్పర్థలు వచ్చే సూచన ఉన్నవి జాగ్రత్తగా ఉండటం అవసరం ఆదాయం మామూలుగానే ఉంటుంది మీ అజాగ్రత్తను ఆధారం చేసుకుని మోసం చేయటానికి ప్రయత్నించేవారు ఉంటారు ఏ విషయంలో ఇతరులకు హామీ ఉండటం మంచిదికాదు 22, 23 లలో అకస్మాద్ధనలాభం, మానసిక ఆందోళన, సభా గౌరవం

*    *    *

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

వృత్తిలో క్రమక్రమంగా అభివృద్ధి, గౌరవము పెరుగుతవి అధికారులవల్ల అనుకూలత లభిస్తుంది కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి మీ అంచనాకు మించి ఖర్చులు రావచ్చు కాని, అందువల్ల ఏవిధంగానూ బాధ కనుపించదు పెద్ద వారితో చేసుకున్న వ్యవహారనిర్ణయాలు ఈ సమయంలో కార్యరూపం పొంది సులభంగా ఫలిస్తవి. మీఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. వారంమధ్యలో తలవనితలంపుగా ఆందోళనకరమైన వార్తలు తెలుస్తవి మిమ్ములనుగురించి అసూయాభావంతో మాట్లాడేవారు ఉంటారు తొందరపడి కలహాలకు పోవద్దు శుభ, పుణ్య కార్యాల నిమిత్తం ప్రయాణాలు చేయవలసి వస్తుంది 24, 25 లలో సభా గౌరవం, ధనలాభం, క్రొత్తవారి స్నేహం

*    *    *

## సింహం

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా )**

మీతోకూడా ఉన్నటువంటివారు చేసిన పొరపాట్లు మిమ్ములను కొంతవరకు బాధించగల సమయం బుద్ధిబలంతో ధన, గౌరవాలను కాపాడుకొంటారు వ్యవహారరంగంలో మిమ్ములను బెదిరించటానికి చూచేవారు ఉంటారు మంచివా

కలహో లభించటంవల్ల ధైర్యంతో నిలబడ గలుగు తారు ధర్మకార్యాలు చేయగలుగుతారు మీ అంతస్తుకు మించిన వారితో పెట్టుకున్న లావాదేవీలు నష్టదాయకంగా పరిణామం చెందగలవు పిల్లలమూలంగా సుఖ సంతోషాలు లభిస్తవి తాత్కాలికంగా లాభం పొందగల సాహస కార్యాలకు ప్రోత్సహించేవారు ఉంటారు అన్నివిధాలా సమర్థించుకోగల శక్తి చూచుకొని ప్రవేశించటం మంచిది డబ్బుకుసంబంధించిన లెక్కలలో పొరపాట్లు రావటంవల్ల విరోధాలు రాగల అవకాశా లున్నవి 24, 25 లలో ప్రయాణాలు, అనారోగ్య సూచనలు

* * *

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా )**

ఒక అడుగు ముందుకు పోదామని ప్రయత్నిస్తే రెండు అడుగులు వెనుకకు రావలసి వస్తుంది మీకు కావలసినవారే మీ మాటను వ్యతిరేకిస్తూ ఉంటారు పెద్దగా ఉపయోగం లేకపోయినా సంఘ కార్యాల బాధ్యత మాత్రం పైన వేసుకొనవలసి వస్తుంది ఎవరో సహాయం చేస్తారనే ఆశతో ఏ వ్యవహారంలోను దిగవద్దు విలాస సంబంధమైన ఖర్చులు పెరుగుతవి పిల్లల ఆరోగ్యం బాగుండదు వృత్తి ఉద్యోగాలలో క్రొత్త చిక్కులు ఏమీ ఉండవు కాని, దేహశ్రమ అధికంగా ఉంటుంది స్నేహితులకు ధనసహాయం చేయవలసి వస్తుంది వారాంతంలో నిరుపయోగమైన మాటలతో ముఖ్యమైన పనులకు ఆటంకం ఏర్పడుతుంది 21, 22 లలో విలువగల వస్తువులు కొంటారు కలహాలు

* * *

## తుల

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ధనవిషయంలోను, కుటుంబ విషయాలలోను సంతృప్తికరమైన సమయం అధికారుల వల్ల గౌరవం పొందగలుగుతారు మీ సమర్థత వల్ల క్రొత్త మనుష్యులతో సంబంధం కలిగించుకొని కార్యసిద్ధి పొందగలుగుతారు దేహసౌఖ్యం బాగుంటుంది వృత్తివ్యాపారాలలో శ్రమ, పోటీలు తొలగిపోయి రకరకాల మనుష్యులతో నిరాటంకంగా వ్యవహరించగలుగుతారు అగ్ని, ఆయుధాలు మొదలయిన వాటిని ఉపయోగించే సమయాలలో జాగ్రత్తగా ఉండటం అవసరం వారం రెండవ భాగంలో ఇతరుల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవలసిన అవసరం కలుగుతుంది పెద్ద మొత్తాలుగా డబ్బు రాగల అవకాశా లున్నవి వస్త్రాలు మొదలయిన అలంకార వస్తువులు కొంటారు స్థిరాస్తులు కొనటంకాని, అందుకు సంబంధించిన వ్యాపారాలు కాని, ఈ సమయంలో అనుకూలిస్తవి 24, 25 లలో అనారోగ్యం, కలహాలు.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

మీ భయానికి తగినట్లే పరిస్థితులు కూడా తారుమారుగా, కనిపిస్తూ ఉంటవి అపవాదులు రాగల అవకాశా లున్నవి వృత్తిలో వచ్చే మార్పుల వల్ల ధనవ్యయము, శ్రమ అధిక మవుతవి గౌరవం పెరుగుతుంది కాని బాధ్యత కూడా పెరగగల అవకాశా లున్నవి సాధ్యమైనంతవరకు వ్యవహారాలు తగ్గించుకొనటానికి ప్రయత్నించండి తలవనితలంపుగా అనారోగ్యం చేస్తుంది, దూర ప్రదేశాలలో కీర్తికి భంగం వస్తుందేమో నని ఆందోళన కలుగుతుంది అయితే దైవబలంవల్ల పరిస్థితులు చక్కబడగలవు కుటుంబంలో సుఖము శాంతి లభిస్తని స్నేహితుల సలహాను సకాలంలో వినియోగించుకొనటానికి ప్రయత్నించండి. 23, 24 లలో శుభవార్తలు, శ్రమవల్ల కార్యసిద్ధి, చోర భయం.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

యథార్థంగా పరిస్థితులలో పెద్ద మార్పులు కన్పించకపోయినా ధైర్య సాహసాలు బాగుంటవి తోటివారి ప్రోత్సాహం లభిస్తుంది ముందు ముందు ఇతరులమీద ఆధారపడవలసిన అవసరం తగ్గుతుంది. శుభకార్యప్రయత్నాలు ఈ సమయంలో అనుకూలించకపోవచ్చు దూరమందున్న మిత్రులు మీకు వ్యవహారరంగంలో సహాయం చేస్తారు ఇంతకుముందు ఏర్పడిన కలహాలు తొలగిపోయి మనశ్శాంతి లభిస్తుంది మీ కార్యక్రమాలు రహస్యంగా జరుపుకొనటం అవసరం వృత్తి ఉద్యోగాలలో ప్రశాంతత, గౌరవము లభిస్తవి. ప్రయాణాలు అనుకూలిస్తవి. ముఖ్యమైన వస్తువులు సమయంలో లభించకపోవటం వల్ల అనుకున్న పనులలో మార్పులు అవసరమవుతవి 24, 25 లలో మిత్రలాభం, కార్యానుకూలత, దేహ అసౌఖ్య సూచనలు

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1 2, పా)**

ఎవరివల్ల మీ పని నెరవేరుతుందని ఎదురు చూస్తూ ఉంటారో అక్కడ విఘాతం కలిగించే మనుష్యులు ఉంటారు దైవబలంవల్ల మరొక మార్గంలో మీకు సహాయం లభిస్తుంది తరచు ప్రయాణాలు చేయవలసి రావచ్చు. మీ ఆరోగ్యం ఇంతకుముందుకన్నా బాగుంటుంది శీఘ్రంగా చేయగల మనుకొని ఆరంభించిన పనులు ఇంకా పూర్తికాక పోవటంవల్ల మనస్సుకు ఆరాటం ఎక్కువ అవుతుంది కాని, అందువల్ల కష్టనష్టాలు ఏమీ ఉండవు దక్షిణదిక్కునుంచి శుభవార్తలు తెలుస్తవి కుటుంబంలో మీ మాటకు ఆదరణ, గౌరవము లభిస్తవి ఇతరులకు సహాయం చేసే బాధ్యతలను తగ్గించుకొనటంవల్ల కొంత వరకు సుఖం పొందగలుగుతారు 20, 21 లలో వినోదకాలక్షేపం, లాభవార్తలు

* * *

### ఈవారము ధరలు

బంగారు ధర 18 నుంచి పెరిగే సూచన లున్నవి వెండి ధర మామూలుగానే ఉంటుంది వారం చివరలో కొద్ది మందీ వస్తుంది వసుపుధరలో మందీ వచ్చి మరల పెరుగుతుంది వేరుశనగపప్పు ధర తత్కాలికంగా పెరుగుతుంది కాని, నిలవదు వేరుశనగ నూనె ధరలో మార్పు ఉండదు. నూవుల ధర తగ్గే అవకాశా లున్నవి నూవుల నూనె ధర కొద్దిగా తగ్గుతుంది కందులకు గిరాకి వస్తుంది. బెల్లం ధర క్రమంగా పెరుగుతుంది చింతపండు ధర కొద్దిగా పెరిగి తగ్గుతుంది

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా )**

పేరుప్రతిష్ఠలు బాగుంటవి మిమ్మలను పొగడుతూ ఉంటారు కాని, ఉపయోగం మాత్రం ఉండదు స్వశక్తితో ముందుకు సాగిపోయే సమయంలో ఆటంకాలు కలిగించటానికి చూచేవారు ఉంటారు ఏది ఏమైనా దైవబలం బాగున్నది మధ్యలో ఎన్ని మెలికలు తిరిగినా ధనసంబంధమైన లావాదేవీలు సక్రమంగా పరిష్కారం అవుతవి విలువగల వస్తువులు కొనటంవల్ల డబ్బుకు ఇబ్బంది తోస్తుంది స్థిరాస్తుల మూలంగా ఆదాయం పెరుగుతుంది మీ క్రింద పని చేసేవారి వల్ల అనుకూలత ఉంటుంది ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉండవు 24, 25 లో కుటుంబ కలహాలు, స్వల్ప ధనలాభం, శుభవార్తలు

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ భాద్ర, రేవతి)**

అధికారులవల్ల కలిగిన భయం తొలగిపోతుంది. ఆదాయం బాగుంటుంది మానసికంగాను, శారీరకంగాను సౌఖ్యదాయకంగా ఉంటుంది పెద్దవారి సహాయంతో మీ కోరికలు సఫలం అవుతవి మీ నిత్యకార్యకలాపాలలో శ్రమవల్ల స్వల్పమైన మార్పులు చేసుకొనవలసి వస్తుంది మీ సర్దుబాటువల్ల కుటుంబంలో ప్రశాంతత లభిస్తుంది ధర్మకార్యాలయందు ఆసక్తి కలిగినా పూర్తిగా నెరవేర్చలేకపోతారు అకస్మాత్తుగా ధనప్రాప్తికి అవకాశాలున్నవి 22, 23 లలో అకాల భోజనం, మిత్రులతో కలహాలు, చిన్నచిన్న పనులలో కూడా చిక్కులు.






## జరిగిన కథ

కాళిదాసు ఇంటి వరండాలో ఎవరో పొత్తిళ్లా నిండని పసిపిల్లవాణ్ణి విడిచి వెళ్ళారు భార్య మరణంతో, వృద్ధురాలైన తల్లి తప్ప వేరే ఆడదిక్కులేని కాళిదాసు ఆ అనాథ బాలుణ్ణి పెంచడానికి సిద్ధపడతాడు. శంకరశాస్త్రి తనకూతురు రుక్మిణికి సంబంధం చూసి పెట్టమని కాళిదాసును అడుగుతాడు జానకీ రామారావు కాళిదాసు చిన్ననాటిస్నేహితుడు దొంగనోట్లుఅచ్చువేసిన నేరానికి అతణ్ణి పోలీసులు అరెస్టుచేస్తారు కాళిదాసు ఇంటికి చదువుకోటానికి వచ్చిన గోవిందు డబ్బులతో ఉన్న హుండీ దొంగిలిస్తాడు నిరంజనశర్మ కూతురు శరద ని ఆత్మహత్య చేసుకుంటుంది రుక్మిణికి మురళితో వివాహం నిశ్చయం అవుతుంది

అతని కెదురుగా వారిద్దరూ కూర్చున్నారు ఆరేళ్ళపిల్ల కిటికీ ప్రక్కకు జరిగి కూర్చుని బయటికి చూస్తున్నది ఆమెకు దాదాపు ఇరవై అయిదు సంవత్సరాల వయస్సుంటుంది ఆమె కాళిదానువంక ఒకసారిచూసి తర్వాత పిల్ల చెయ్యి పట్టుకుని "ఇలా జరుగు కంట్లో బొగ్గు నలుసులు పడతాయి" అంటూ దగ్గరికి తీసుకుంది కాస్సేపాగి ఒక నిండు టిక్కెట్టూ ఒక అర టిక్కెట్టూ బయటికితీసి పెట్టెతెరిచి అందులో వుంచి మళ్ళీ తాళం వేసింది ఆ పెట్టెతప్ప వారి వెంట సామానేమీలేదు

కాళిదాసు ఆలోచనలో పడ్డాడు తానీ మనిషి నెక్కడో చూసినట్టు గుర్తున్నది ఆమెను గురించి ఆలోచించడం కూడా జరిగింది కాని ఎక్కడ చూశాడో గుర్తుకు రావటంలేదు

ఆమె పిల్లచుట్టూ చెయ్యివేసి కిటికీలోనుంచి బయటికి చూస్తూ ఆలోచిస్తున్నది కాళిదాసు గతాన్ని నెమరు వేసుకుంటూ తానామె నెక్కడ చూశాడో గుర్తు తెచ్చుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు బయట చీకటి చిక్కగా వ్యాపించివుంది ఆకాశమూ, వేగంగా వెనకబడిపోతున్న టెలిగ్రాఫ్ స్తంభాలూ, చెట్లూ అంతా ఒక చక్కని చిత్రం మీద నల్లరంగు పులిమినట్టుగా కనిపిస్తున్నది

ఏ స్టేషనులోనో బండి ఆగింది ఇతర చోట్ల నిలుచునేందుకు కూడా చోటు లేక జనం చాలామంది 'ఈ పెట్టెలో జనమేలేరే' అనుకుంటూ ఆశగా వచ్చి "ఫ్ల వరువుల పెట్టె" అనుకుంటూ వెనుదిరిగి వెళ్ళిపోతున్నారు రైలు ఆ స్టేషనులో రెండు నిముషాలు కూడా ఆగలేదు కూతవేసి మళ్ళీ బయలుదేరింది

ఆమె కాళిదానువంక తిరిగి ఏదో అడగబోయి వూరుకున్నది కాళిదాసు అది గమనించి "ఏమిటండీ ?" అని అడిగాడు

ఆమె "ఏమీలేదు మామూలు టిక్కెట్టు తీసుకుని యిందులో ఎక్కితే మిగిలిన డబ్బు కట్టేందుకు సిద్ధపడినా వూరుకోరా ? నేను ఎంతోసేపు అటూ యిటూ తిరిగి ఎక్కడైనా నిలబడేందుకైనా చోటువుంటుందేమో అని ప్రయత్నం చేశాను ఎక్కడా ఇసకవేస్తే రాలటంలేదు పైగా బండి కదిలేవేళ అయింది అందువల్ల యిక్కడ ఎక్కక తప్పలేదు" అన్నది

కాళిదాసు నవ్వి "ఫరవాలేదు చోటులేదు కనుకనే నేను కూడా ఎక్కువ డబ్బుపెట్టి యీ టిక్కెట్టు తీసుకున్నాను అంతగా ఎవరైనావచ్చి అడిగితే నిజం చెప్పేయండి నేను కూడా చెబుతాను మిగిలిన డబ్బు చెల్లిస్తే సరిపోతుంది"

(44 వ పేజీ చూడండి)



# స్నేహం — సుకుమార్

"ఓరి, ఎక్కణ్ణుంచోయ్ ?" అన్నాడు ఆత్రుతగా మురారి, రోడ్డు మధ్య ఆగి బస్సుకు అడ్డంపడి

"ఇంటినుంచే—నువ్వా ?"

"మామూల గా ఆఫీసునుంచే"

"రా, రా బాగా కలిశాం అసలు ఇవాళ మనం కలుస్తామా కలవమా అని ఆలోచిస్తున్నాను ఏమంటే ఉదయం విడిపోయినప్పుడు మళ్లీ ఏమీ అనుకోలేదు చూడూ" అన్నాడు ముకుందం

"ఉదయానికీ ఇప్పటికీ 'ఇవాళ' అని, ఒక రోజుగా లెఖ వేసేశావే" అన్నాడు మురారి, సిగరెట్టు తీసి ముకుందాని కిచ్చి తనోటి నోట్లో పెట్టుకుంటూ

"కాస్త కాఫీ వేసుకొంటే "

"వో, పద "

మురారీ ముకుందమూ వెళ్లి వెళ్లి జన సమ్మర్దం గల హొటల్లోకి దూరారు కూచునేందుకు ఎక్కడా చోటులేదు ఎవరో యిద్దరు కాఫీలు తాగుతుంటే, వాళ్ల వెనక నుంచున్నారు—వాళ్లిహ లేస్తారుగదా అని కాని వాళ్లెవరో లేవ లేదు ఎందుకంటే మళ్లీ చెరో రెండు రెండు ఇడ్లీలూ, సాంబారులో మునగగొడుతూ తెప్పించుకున్నారు

"ఎట్లాగయ్యా మురారీ ?" అన్నాడు ముకుందం

"అదే, ఎట్లాగా అని ముకుందం ?" అన్నాడు మురారి

నించున్న ఈ ఇద్దర్నీ వెళ్లేవాళ్లూ, వచ్చేవాళ్లూ తోసేస్తున్నారు, నెట్టేస్తున్నారు

ఒకతను మురారిని నేలమట్టానికి పడద్రోసి వంతెనలా నడిచి వెళ్లిపోదామని ప్లాను వేశాడు కూడా కాని ముకుందం అడ్డుపడ్డాడు మంచి నీళ్లు తెస్తున్న సర్వరు గ్లాసు ముకుందం నెత్తిన కొట్టబోతే, మురారి రక్షించాడు ఇంతలో ఇద్దరెవరో లేచారు ముకుందం, మురారి వెళ్లి అక్కడ కూచుని, 'అమ్మయ్య' అనుకున్నారు అంతలోనే వాళ్లు తిరిగొచ్చి, "మేం కూచున్నామండీ, చేతులు కడుక్కోడానికి వెళ్లాం" అన్నారు

మిత్రులిద్దరూ నీరసంగా లేచారు

"పోదామా యేమిటోయ్ ?" అన్నాడు ముకుందం

"ఆ, ఎట్లాగు వచ్చాం కాస్త కాఫీయినా తాగి పోదాం నించునయినా" అన్నాడు మురారి అంతలోనే ఎవరో లేవగా చూశాడు, పరుగెత్తాడు. కాని ముకుందానికి చోటు లేదు ఎట్లా ?

"ఇద్దరమూ దీనిమీదే ఇరుక్కుందామా" అని అడిగాడు

"కష్టం బ్రదర్ ఎవరికీ సౌకర్యం ఉండక పోగా నీకు కూడా మహా యిబ్బంది నువ్వు కూచోనే ఉండు నే నిట్లా నించుంటాను"

(43-వ పేజీ చూడండి)



యోధాన యోధులు చిత్రంలో ఒక దృశ్యం

## చలనచిత్రంగా దక్షిణాఫ్రికా చరిత్ర

1652 లో వాన్‌రీ బీక్ అడుగుపెట్టినప్పటి నుంచి జరిగిన దక్షిణాఫ్రికా చరిత్రను చలన చిత్రాలుగా రూపొందించాలని దక్షిణాఫ్రికా ప్రభుత్వం విద్యాశాఖ నిశ్చయించింది. ఈ చిత్రాల నిర్మాణ పథకం పూర్తయేటప్పటికి 15 సంవత్సరాలు నడుస్తాయని దక్షిణాఫ్రికా సమాచార శాఖ ప్రకటించింది. పాఠశాలలో చరిత్ర బోధనకు వీలుగా ఉండేటట్లు ఈ చిత్రాలు నిర్మిస్తున్నారు. కీస్టోన్స్ ఆఫ్ ది పాస్ట్ అన్న పేరుతో మొదటి చిత్రం పూర్తయి ఈ ఏడాది ఆరంభంతో విడుదల అయిందట కూడా.

ఈ నిర్మాణ కార్యక్రమాన్ని దక్షిణాఫ్రికా చలన చిత్ర నిర్మాత డేవిడ్ ఛార్లెస్ పర్యవేక్షిస్తున్నారు.



ఏరల్ ప్రొడక్షన్స్‌వారి వరలక్ష్మీవ్రతం లో స్వర్ణలత

# సంక్షిప్త వార్తలు

## అమెరికా-భారత్ సంయుక్త చిత్ర నిర్మాణం

అమెరికన్ స్టూడియోలలో చిత్రం నిర్మించేందుకు ప్రప్రథమంగా భారతీయ దర్శకుడు శ్రీ కృష్ణ షా ప్రయత్నిస్తున్నారు. ప్రేమ—కర్మ అన్న పేరుతో తయారయ్యే ఈ చిత్రానికి జూలియస్ డాన్సెన్‌బౌమ్ సహకారంతో శ్రీ కృష్ణషాయే కథరచించారు. ఈ చిత్రానికి కార్ల్ గెర్నర్ దర్శకత్వం వహిస్తారు.

## సింగపూరు చిత్రప్రదర్శనశాలకు అమెరికన్ బహుమతి

1960 సం లో చిత్ర ప్రదర్శన శాలలో క్విగ్లీగ్రాండ్ బహుమతి సింగపూర్‌లోని కాథే సినిమా కు లభించింది. ఈ బహుమతి పోటీని న్యూయార్కులోని క్విగ్లీ పబ్లిషింగ్ కంపెనీ ఏర్పాటుచేసింది.

## భారతదేశంలో 'ఐలండ్' ప్రదర్శనం

మాస్కోలో జరిగిన ద్వితీయ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో గ్రాండ్ బహుమతి పొందిన జపానీ చిత్రం హడాకా—నో—షియా (ఐలండ్) ను ప్రదర్శనకోసం భారతీయ చిత్ర దర్శక నిర్మాత శ్రీ మహబూబ్‌ఖాన్ మన దేశానికి తీసుకువచ్చారు.

## సెబాస్టియన్ చిత్రోత్సవంలో బ్రాండ్ చిత్రం ఎన్నిక

ప్రఖ్యాత నటుడు మార్లన్ బ్రాండో పాల్గొన్న 'ఒన్ ఐడ్ జాక్స్' అన్న చిత్రానికి శాన్‌సెబాస్టియన్‌లో జరిగిన నవమ వార్షిక అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో ప్రథమ బహుమతి లభించింది. ఇదే చిత్రంలో నటించిన మెక్సికన్ నటి మిస్ పినాపెల్లిసెర్‌కు ఉత్తమనటిగా బహుమతి లభించింది.

## జకోస్లొవకియా చిత్రోత్సవంలో 5 చిత్రాలకు బహుమతులు

జకోస్లొవేకియాలో జూన్ 30 నుండి జులై 10 వ వరకు జరిగిన అంతర్జాతీయ కార్మిక చిత్రోత్సవంలో వివిధదేశాలకు చెందిన 5 చిత్రాలకు ఉత్తమత్వ బహుమతులు లభించాయి. రోకో—అతని సోదరులు (ఇటాలియన్) ది డిఫయెంట్ వన్స్ గ్రామీణ సంత (జర్మనీ) ఎగరవే పావురమా (సోవియెట్) చంద్రలోకం నుంచి వచ్చిన స్త్రీ (జకోస్లొవకియా) అనే చిత్రాలకు ఈ బహుమతులు లభించాయి.

## విదేశీ నటుల ప్రవేశానికి మెక్సికో ప్రభుత్వం ఆంక్ష

విదేశీనటులను తమ దేశపు చలన చిత్రాల్లోకి తీసుకోవటం మానివేయాల్సిందని మెక్సికన్ ప్రభుత్వం జాతీయ నటసంఘంకు సూచించింది.

## సరికొత్త సినిమా శీర్షిక! —>

ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ బాపూ కార్టూనులు శీర్షిక క్రింద ప్రతివారం ఒక (వి)చిత్రవ్యక్తిని మీకు పరిచయం చేస్తారు

—>




## [illegible] - 1

"ఏం బాబూ దా ఏవిటికథ? కులాసాగా
ఉంటున్నావా?
ఝోవిటీ? కాలం మారి పోచ్చి అంటున్నావా!
ఖాదు బ్రదర్ – నువ్వే 'మారిపోచ్చ' తోడు-
అదో కథ, వింటున్నావా?
హావ్ ఆయ నలా వాగుతాడు
మనకెందుకనుకుంటున్నావా-ఆఁ?

అటు సూరీ డీటు పొడిచిన
అదేమిటని విస్తుపోకు
గిరుక్కుమని వెనుదిరిగి న
మస్కరించు తెల్లబోకు
ఎగిరి పడే కెరటాలను
రొమ్ము విరిచి ఎదిరించకు
ఎగిరి గంతు వేసి మీది
కెగసి స్వారి చేయుమా ది
గాలు పడకు విడకు మొడుపు
దర్జాగా బతుకు నడుపు"

జీవన్నాటక రంగంపై
నటరంగంపై నతరంగంపై
ముత్తరాల 'పెద్దంతరాల' పై
ముక్కు మాటతో ముద్దు బాటుగా
మూరక సాగే సీనియర్స్టార్–

ఆయన 'సీయుస్సారు' (చైర్మన్ పాండీబజారు)
పక్కనాక్క ఝ్యాకు కాదు
దాని పక్కదాని పేరు - ఫిల్మ్ పాండీబజారు.

పూర్వకాలం ఒకానొక దేశంలోని

ఒకానొక రాజ్యంలో ఒక రైతు ఉండేవాడు అతడు ధనవంతుడు కూడా అతని సంతానానికి వారి వారి లక్షణాలను తెలియజేసే పేర్లు కూడా అసలుపేర్లకి కలపబడ్డాయి. అతనికి ముగ్గురు కొడుకులు, ఒక కూతురు వస్తాదు వాకయ్య మొదటివాడు, లావుపాటి రామయ్య రెండోవానిపేరు.మూడోవాణ్ణి తెలివి తక్కువ దేవయ్య అని పిలిచేవారు కూతురు ముసలికన్నె మారమ్మ, మూగదీ చెవిటిదీకూడా ను అందులో వస్తాదువాకయ్య పట్టణం వెళ్లి రాజుగారి సైన్యంలో చేరిపోయాడు. లావుపాటిరామయ్య నగరంలోని ఒక ప్రసిద్ధవర్తకుని దగ్గర చేరాడు వర్తకం అదీ నేర్చుకోడానికి తెలివి తక్కువదేవయ్యమాత్రం తలి దండ్రులతోటి, పెళ్లికాని చెల్లెలి తోటి ఇంటిదగ్గరే ఉండిపోయి, వ్యవసాయం చేసుకుంటున్నాడు

సైన్యంలో చేరిన వస్తాదు వాకయ్య తన శక్తి సామర్థ్యాలచేత పైకివచ్చాడు పెద్దపదవీ జాగీరు సంపాయించాడు అలాగే ఒక ఐశ్వర్యవంతుని కూతుర్ని పెళ్లి చేసుకున్నాడు కూడా అతనికి జీతమూ పెద్దదే,జాగీరూపెద్దదే.అయినాఖర్చులకిసరిపోవడంలేద అయ్యగారిసంపాదన అంతా అమ్మగారిఖర్చులకే సరిపడుతోంది. ఇంక మిగిలినవాటికి డబ్బెక్కడుంటుంది? అందుకని జాగీరులమీద డబ్బు తెచ్చుకొందామని అనుకొన్నాడతను. కాని పెద్ద గుమాస్తా అడ్డు చెప్పాడు "మనకి డబ్బు తెచ్చుకునే అవకాశం లేదండయ్యా! అక్కడ వ్యవసాయం చేయడానికిగాని చేయించడానికి గాని మనదగ్గర గొడ్డు గోదా ఉందా? బండీ నాగలీ ఉందా? ఇంకేమన్నా ఉన్నాయికనకనా? ముందు అవన్నీ సంపాదిస్తే, తరవాత డబ్బు సంపాదించడం ఆలోచించవచ్చు"

దానిమీద వాకయ్య తండ్రి దగ్గరకిపోయి చెప్పుకున్నాడు. "నాన్నా! మీకు బోలెడంత ఉంది. నాకేం ఇవ్వనేలేదు నా జాగీర్లు అవీ బాగుచేయించుకుంటాను, నా వాటా నాకు ఇప్పించవూ?"

"నువ్వు యీ యింటికోసం యేం పాటుపడ్డావని నీకు మూడోవాటా యివ్వాలి? ఆవిధంగా చేస్తే దేవయ్యకి అమ్మాయికీ అన్యాయం చేసినట్లవుతుందికదా!" అన్నాడు తండ్రి.



"ఆఁ! వాళ్ల మొహం వాళ్లకేం తెలుసు! వాడో తెలివితక్కువ వాడు. అదో ముసలికన్నె పైగా మూగదీ చెవిటిదీని వాళ్లకి యేం కావలసి ఉంటుందిలే!"

"అయితే దేవయ్యని రానియ్యి. వాడేమంటాడో?"

దేవయ్య వచ్చి "దానికేం మా బాగు వాడి వాటా వాణ్ణి తీసుకెళ్లనియ్యి" అన్నాడు మామూలు ధోరణిలో

అప్పుడు వస్తాదు వాకయ్య తన వాటాకు వచ్చిన స్థిరచరాస్తుల్ని తీసుకు వెళ్లిపోయాడు జాగీర్లు బాగుచేయించడం మొదలుపెట్టాడు. ఆ తరవాత మళ్లీ రాజుగారి సైన్యంలోకి వెళ్లిపోయాడు.

లావుపాటి రామయ్య, వ్యాపారంలో మెళుకువలు నేర్చుకున్నాడు ఎంతో సంపాదించాడుకూడా. దానికి తగ్గట్టే ఒక గొప్పింటి వ్యాపారి సంబంధం చేసుకున్నాడు అయినా అతనికీ యింకా కావలసి వచ్చింది. అందుకని తండ్రిదగ్గరికి వచ్చి తన వాటా తనకిమ్మన్నాడు.

కాని ముసలితండ్రికి మాత్రం ఈ రామయ్యకికూడా వాటా యివ్వాలని యేమాత్రం లేదు. అందుకనే అన్నాడు "నువ్వు యీ యింటికి యేం తెచ్చావని నీకు వాటా యివ్వాలి? ఇవ్వ డింట్లో ఉన్నదంతా దేవయ్య సంపాదించినదే. అటువంటివాడికీ, ఆ అమాయకురాలికీ ఎలా అన్యాయం చేసేది?"

"ఆఁ! వాడికేం కావాలి వాడి మొహాం! వాడో తెలివితక్కువ దద్దమ్మ! పెళ్ళా? పెటాకులా? చెవిటిదీ మూగదీఅయినచెల్లెలికిమాత్రం యేం కావాలి?" అని దేవయ్య వైపు తిరిగి "పశువుల్లో సగం పంటలో సగం నాకు యిచ్చేయరా! పరికరాలు నాకేం అక్కరలేదులే. కాని పుల్లెద్దునుమాత్రం తీసుకు వెడతా. దున్నడానికీ దుక్కికీ అది యెలాగా పనికిరాదుగా."అన్నాడు.

ఇదంతావిన్న దేవయ్య పక్కున నవ్వాడు. "దానికేం మా బాగు. నేనేదో కష్టపడి మళ్లీ సంపాదించుకుంటానులే" అన్నాడు.

ఆవిధంగా రామయ్య కూడా తన వాటా తీసుకున్నాడు. ధాన్యం నగరానికి పట్టించాడు. పుల్లెద్దుని తోలుకుపోయాడు. పాపం దేవయ్యకి మిగిలిందల్లా ఒక ముసలెద్దు దాంతోటే ఎలాగో తంటాలు పడి చెల్లెలుసహాయంతో తల్లినీ తండ్రినీ పోషించడానికి నడుం కట్టాడు. (41-వ పేజీ చూడండి)




## జరిగిన కథ

పోలయ్య అంటే ఆ ఊళ్ళో చాలామందికి అభిమానం, గౌరవం కొంతమందికి అతినిపై అయిష్టం కలగడానికి కూడా కారణం లేక పోలేదు నరసింహప్ప చలమయ్య ఒకరినొకరు సాధించుకోవాలని ఎత్తులు వేస్తూ ఉంటారు నరసింహప్ప పోలయ్యను తన పక్షంలో చేర్పించటానికి ప్రయత్నిస్తాడు పోలయ్యకు, నరసింహప్ప పెద్దకూతురు ఇందిరకు, రాజారావు ట్యూషన్ చెబుతూ ఉంటాడు

ఇందిర చెల్లెలు లలిత రాజారావును ప్రేమిస్తుంది నరసింహప్ప రాజారావు ట్యూషన్ మాన్పిస్తాడు రాజారావును మంచిచేసుకునేందుకు చలమయ్య అలివేణిని నియోగిస్తాడు ఎన్నికలలో పోటీ చెయ్యమని పోలయ్యను రాజారావు ప్రోత్సహిస్తాడు చలమయ్య ఏర్పాటు చేయించిన మిల్లు కార్మికుల సభ పోలయ్య ప్రసంగంతో అభాసు అవుతుంది అలివేణి రాజారావును ప్రేమిస్తుంది

ఆ రోజు పోలయ్య కార్మికులసభలో ఉపన్యసించడం ఫలితంగా మిల్లుపనివాళ్ళలో రెండు వర్గాలు ఏర్పడినాయి ఒక వర్గానికి రాజయ్య నాయకుడు రెండవ వర్గానికి మల్లేశం నాయకుడయ్యాడు

అసలు ఆరోజు పోలయ్య ఆ సభలో మాట్లాడుదామని చివరిక్షణంవరకూ అనుకోలేదు అక్కడి వాతావరణం, వాళ్ళ ధోరణి, ప్రశాంతంగా జరిగిపోతున్న కార్మికులజీవితంలో తమస్వార్థానికై కోరికలను రేకెత్తించడంతో పోలయ్య ఆవేశంగా వేదికమీదకు వెళ్ళాడు—రంగపాండును ఆ దౌడా ఈ దౌడా వాయిద్దామని

"ఊరికే ఆవేశపడకు పోలయ్యా" అని రాజారావు ఎప్పుడూ హెచ్చరించడం జ్ఞాపకం వచ్చింది రాజారావు సాన్నిధ్యం, శిశ్రూష లభించడంవల్ల సహజంగాపోలయ్యలో ఉన్న సద్గుణాలకు, శాంతగుణం అలవడింది దాంతో పోలయ్య ఆవేశాన్ని అణచుకొని తనభావాన్ని వ్యక్తీకరించగలిగాడు తన ఉపన్యాసాన్ని చాలమంది కార్మికులు విని ఉత్సాహం చూపడంవల్ల పోలయ్యలో సంతోషం ఇనుమడించింది

ఆ సంతోషంతో రాజారావుకు ఆ సంగతి చెబుదామని వెళ్ళాడు కాని రాజారావు పోలయ్యను విమర్శించడంవల్ల నిరుత్సాహపడిపోయాడు

"నీవు చాలా తొందరపడ్డావు పోలయ్యా! నీవు ఇచ్చిన ఉపన్యాసంవల్ల మంచికంటే చెడు ఎక్కువగా ఉంటుందేమోనని భయంగా ఉంది దీనివల్ల మనం బహిరంగంగా చలమయ్యదొరముఠాను రెచ్చగొట్టినట్టు అయింది వాళ్ళు మరింత కక్షతో మనల్ని సాధించడానికి ప్రయత్నిస్తారు మన పనులకు ఎన్నో అవరోధాలు కల్పిస్తారు ఆ సమయంలో కాకుండా మనం మరొక సమయంలో కార్మికులకు వీరి యదార్థస్వరూపాన్ని వివరించినట్లయితే ఎక్కువ ప్రయోజనం ఉండేది నీవు చెప్పినదాన్నిబట్టి చూస్తే మిల్లుకార్మికులలో రెండువర్గాలు ఏర్పడవచ్చు" అన్నాడు రాజారావు

రాజారావు ఊహించిన విధంగానే రెండు వర్గాలు ఏర్పడినాయి

చలమయ్యదొర కార్మికులను రెచ్చగొట్టడం, బహిరంగసభ ఏర్పాటుచేసి ఆయన అధ్యక్షత వహించడం నరసింహప్పదొరకు చిటపటలాడినట్టు అయింది కాని తన ప్రమేయం లేకుండానే పోలయ్య ఆ సభలో ధైర్యంగా ఉపన్యసించి చలమయ్యవర్గాన్ని విమర్శించడం, యధార్థ విషయాలను చెప్పడం ఒకవిధంగా మిల్లు యాజమాన్యాన్ని బలపరచడమయినందుకు, పోలయ్యవల్ల

(39 వ పేజీ చూడుడు)

# అగ్గిరాముడు బొమ్మల కథ సత్యమూర్తి ౨





















# గిరీశం

## ఆంగ్లాంధ్ర శబ్దాశ్రయ హాస్యంలో ఆస్సెం, హాస్యం (హిహిహి) మేష్టారు చెప్పినట్టు - హాస్యము (హ, హ, మరియు హ)

"కన్యాశుల్కంలో హాస్యం ఇంగ్లీషు తెలుగు మాటల కలయికవల్ల పుట్టింది అది తెలుగు హాస్యం కాదు"—ఒక హాస్య సైద్ధాంతికుడి తాత్పర్యం



డామిట్! (ఇది ఉత్త ఇంగ్లీషు—పైగా తెలుగుతో మిక్సవలేదు ఇందులో హాస్యంలేదు అంచేత నవ్వకు) గొప్ప చిక్కొచ్చింది వెంకటేశం అవును గాని గొప్ప గొప్ప డిస్కవరీ జేసిన (ఇదీ ఉత్త ఇంగ్లీషే హా॥ లేదు నవ్వకు) వాళ్ల కేవిటేవిటేవిటిస్తున్నారయ్యా బహుమతులు ? కొలంబస్సూ (ఇంగ్లీషు కాదు, పోర్చుగీసు వాడి పేరు అయినా హాస్యంకాదు నవ్వకు), కోపర్నికస్సూ (ఇదీ ఇంగ్లీషు వేషం వేసిన లాటిను ముక్క గావోసు హా॥ కాదు గాని ఈయన బతికున్న కాలంలో జనాన్ని తెగ నవ్వించాడు—భూమి గుండ్రడమనీ, పైగా సూర్యుడి చుట్టూ తిరుగుతుందనీ చెప్పి హాస్యపదాలు తెలీకపోతే హాస్యాస్పదాలు మాటాడి నవ్వించొచ్చు ననిందికిదో నిదర్శనం నీ కిష్టమైతే నవ్వు ) చెప్పొచ్చిందేవిటంటే, కొలంబస్సూ, కోపర్నికస్సూ వాళ్లూ డిస్కవరీల్చేసి ఏవేవి ఎవార్డులు (నవ్వకు) పుచ్చుకున్నారో వాటి విలవేపాటో కాస్త భోగట్టా చెయ్యి మరేంలేదు మనవీ మర్చునో బ్రహ్మాండమైన డిస్కవరీ చేశాం—"డిస్కవరీ ఆవ్ ఆంధ్రా, అండిట్స్ సెన్స్ ఆఫ్‌నాన్సెఆఫ్ హ్యూమర్—బై గిరీశం" (హా॥ లేదు న కు) దానిమీద బహుమతీ అందగానే తాకట్టేసి, అప్పు తీర్చేదాం గాని అందాకా రెండు పుంజీల రూపాయ లప్పివ్వమని మీ అంకుల్నడిగి (హా॥ లేదు) పట్రా చెప్తా

మై డియర్ వెంకటేశం (హాస్యం కాదు, నిజంగానే నువ్వంటే నా కపేక్ష నా మాటల్లో ఇంగ్లీషు, తెలుగు కలిస్తే హాస్యం పుట్టేస్తోందని కొందరు అంటున్నారు ముందే చెబుతునా నంచేత ) అయావ్ ప్రొడాఫ్ యు, ఆఫ్ ఆంధ్ర, అండిట్స్ హ్యూమర్ వండిట్స్ (ఇందులో కూడా హాస్యం లేదు ఇవీ ఇంగ్లీషు ముక్కలైనా) బైదిబై బ్రదరిల్లా! (హాస్యంకాదు, ఎమినిట్) ఒక్క చిన్న విషయం ఈ వాక్యాలలో ప్రతి ఇంగ్లీషుముక్క పక్కనా, 'హాస్యంకాదు బాబోయ్ నవ్వకు నాయనోయ్' అని హెచ్చెరుక ల్చెప్పలేక చస్తున్నాను వాటివల్ల ముక్కక్కీ ముక్కక్కీ మధ్యదూరం హాస్యానికీ, హాస్య సైద్ధాంతికులకీ ఉన్నంత ఇదిగా పెరిగిపోతోంది అందువల్ల ఇహనించి ఇలా **రెండు చుక్కలు పెట్టినప్పుడల్లా "ఇది ఇంగ్లీషు, అయినా హాస్యంకాదు, నవ్వ వద్దు" అన్న వాక్యాని కవి గుర్తులు అని కొండగుర్తుంచుకొని నవ్వు మానెయ్యి బాబ్బాబు )

చెప్పొచ్చింది తెలుగువాళ్ల హాస్యరసాస్వాదన లేక హాస్య పరిజ్ఞానము (అంటే సెన్సాఫ్ హ్యూమర్—హా॥ కాదు నవ్వకు) గురించిన నా డిస్కవరీ గురించి. నేను నాకు సహజమైన ప్రతిభయున్నుతో ఆంధ్రాంగ్లాల్లో సవ్యసాచిలా సాచిపెట్టి లెక్చర్లు కొడుతూంటే, 'ఆ మారాజు' చూసి సెబాసని, నాటకాని కెక్కించాడు ఆనాట్నించి జనం నా ముక్కలు వినీ చదివీ పొట్ట చెక్కలయేలా నవ్వడం మొదలెట్టారు అక్కడికీ, మీ తెలివి తెల్లారా ఇది ఇంగ్లీషూ తెలుగు మిక్సవగా మీ తాలములు సొగి, వోష్ఠములు విచ్చుకొని నచ్చినట్టి హాసమయ్యా, హాస్యం యింతమాత్రం కాదు నా గొడవ వేరు, నా ఎత్తులు వేరు, నాది బీభత్సమైన జీవితరంగంమీద వచ్చిన దుర్మార్గపు వ్యూహం, విషాదప్రధాన, విషాదాంతమైన జీవన్నాటకం, బహ్నాటకం, పైకి మటుకే నవ్వులాలా అని చెప్పబోయా కాని వాళ్ళు వినందే తెగపడి పైకి నవ్వి లోపల్లోపల ఆ దుస్థితికి జాలిపడ్డారు, బాధపడ్డారు

"కావమ్మ మొగుడంటే కాబోసనుకొని కాపరం జేశానూ కాదంటే అలాగే పోతా" నన్నాడు టూడు వెనకటికో మాయదారి అల్లుడూ—అలాగ్గా, ఏమో వీళ్లంతా నవ్వుకుంటున్నారు, హాస్యం అంటున్నారు పోనీ అలాగే కానీ మనకేల అని నవ్వుకుని (హాస్యం) వూరుకున్నాను కాని అక్కడే పప్పులో కాలు వేశానని నిన్న మొన్నటిదాకా, "అల్లాయన పేరేవిటి—

(38-వ పేజీ చూడండి)



# హోటలు భ

శంకరానికి నాగమ్మపెటిన మంత్రం ఏమిటి? మళ్లీ అతను తేరుకున్నాడా?

హోటల్లో తలవంచుకొని భోంచేస్తున్న శంకరానికి తలెత్తగానే ఎదురుగుండా నరసింహారావుగారు కన్పించారు

"ఏమోయ్ ! శంకరం, హొటల్లో భోంచేస్తున్నావు ? మీవాళ్ళు వూరెళ్లారేమిటి ?" అని నరసింహారావుగారు అడిగారు

"అబ్బే ! లేదండి మాఆవిడకు వంట్లో బాగు లేదు నాకు వండుకోడానికి తీరుబడి లేదు. అందుకని "

"పోనీ మీ అత్తగారున్నారుకదా, ఆవిడేమి చెయ్యదూ ?"

"ఆవిడకు వంటరాదండి "

"అదేమిటోయ్ ? బొత్తిగా అలా అనేస్తున్నావ్. ఇంత అన్నం ఉడకెయ్యలేదూ, ఆమాత్రం ?"

"ఆవిడకి కూడా, ఉద్యోగం ఉండడంవల్ల తీరుబడి ఉండదు" అన్నాడు శంకరం, తొందర తొందరగా భోంచేస్తూ

"బాగానే వుంది పాపం ! నువ్వు నానా ఇబ్బంది పడవలసి వస్తోందన్నమాట అయినా ఈ రెండేళ్లలో చాలా చిక్కిపోయావుసుమా !" అని నరసింహారావుగారు సానుభూతి చూపించారు భోంచేసి చెయ్యి కడుక్కుంటున్న శంకరంమీద

సర్వర్ తెచ్చియిచ్చిన కారియర్ పట్టుకొని శంకరం నరసింహారావుగారితో, "వెళ్ళి వస్తా" నని చెప్పి హొటల్ బయటికి వచ్చాడు మొహం మీదకి పడుతున్న చింపిరిజుట్టూ, మాసిపోయిన బట్టలూ, పాత చెప్పులూ, మొహంలో పరధ్యానం, చిరాకూ, నిస్పృహా తాండవిస్తూన్న శంకరాన్ని చూసి, రెండేళ్ల క్రిందట అతన్ని చూసిన వాళ్లెవరూ కూడా ఇతనే ఆ శంకరం అంటే నమ్మలేరు

శంకరం గబగబ నడిచి అరమైలు దూరంలో ఉన్న ఒక చిన్న పెంకుటింట్లోకి వెళ్లాడు. ఆయింట్లో మంచంమీద ఒక పద్దెనిమిదేళ్ల యువతి పడుకొనివుంది ఆమె శంకరం భార్య సరళ ఆమెది ఆకర్షణీయమైన ముఖమే ఆమెకు వంట్లో నీరసం తప్ప మరో జబ్బేమీ లేదు ఆమె శంకరాన్ని చూసి, బద్ధకంగా వళ్లు విరుచుకుంటూ లేచి మంచంమీద కూర్చుంది

"సరళా ! ఇదిగో కారియర్ తెచ్చాను నేను ఆఫీసుకు వెళ్తున్నాను" అన్నాడు కారియర్ గదిలో పెట్టి, బైటకు వెళ్లిపోతూ శంకరం

అతను వెళ్ళిన తరువాత సరళ "అమ్మా!" అని, పక్కింట్లో భాతాఖానీ చేస్తున్న తల్లిని పిల్చింది. పండిపోయిన జుట్టూ, బుగ్గని ఖాా

# స్త్రీ జన్మ

## రంగధామ్



లావుపాటి శరీరంతో ఒక ఏళ్ళైఏళ్ళ ఆవిడ,
ంకరం వచ్చాడటే ?' అనుకుంటూ గదిలోకి
ంది
ఆ ! వచ్చి, కారియర్ ఇక్కడ పెట్టేసి వెళ్ళి
యారు అంది సరళ కారియర్ మూత
గిన్నె లోకొక్కటే క్రిందకు పెడుతూ
కూతుళ్ళిద్దరూ కంచాలు పెట్టుకొని
యర్‌లోని అన్నం పెట్టుకొని భోంచేశారు
మాత్రం శంకరం తనతో చెప్పకుండా
ఒకు వెళ్ళిపోయాడని విసుక్కుంది
నా తమలపాకులయిపోయి నేను నానా
ంటి పడుతున్నానుకదా సాయంకాలం నీవేమ
వచ్చేటప్పుడు తెమ్మని చెబదామనుకున్నాను
తో చెప్పకుండానే వెళ్ళిపోయాడు మనిషి కెన్ని
లు చెప్పినా బుద్ధిలేదు అంది కోపంగా
సాయంకాలం రాగానే పంపిస్తే సరి అంది
రు
ఈసారి వందో రెండువందలో తెచ్చి
య్యమను రోజా అర్ధణాపీ కానీపీ కొను
డం భాగులేదు
ఆయన దగ్గర ఎక్కువ డబ్బు లుప్పట్టు
అని నసిగింది సరళ సరళకు తల్లిదగ్గర
ఆమెదగ్గర ఏ మాటన్నా తప్పే
ఏం ? ఏంచేశాడే జీతమంతా ? సాయం
ం రానీ అడుగుతాను నాదగ్గర ఇలాంటి
లు పనికిరావు అత్తగారికి తమలపాకులైనా
వ్వలేని అసమర్థుడు అసలు పెళ్ళెందుకు
సోవాలి ? అని కోపంతో రెచ్చిపోయింది
మ్మగారు,
సరళేమీ జవాబు చెప్పలేదు శంకరం తెచ్చిన
ట అయిదు రూపాయలూ తామిద్దరూ తమ
పిచే వాడారు హోటలుకీ పాలవాడికీ
టన్ని మొదలైన ఖర్చులన్నీ పోగా మిగిలిన
రూపాయలూ తన చేతిమీదుగానే ఎవరాకీ
తి లకీ స్నేకి ఖర్చయ్యి మహా ఉంటే పాక
మో అయిదణాలో చిల్లర ఉంటుంది తల్లి
ం ఆవిడ పెట్లో భద్రంగా ఉంది అందు
ంచి ఒక కానీ బయటికి తియ్యదు
శంకరం తన స్వంత ఖర్చు కోసమని ఒక
నా పావలా అయినా ఉంచుకోడు అయినా
కా అతనేదో దుబారా చేసేం తమని నిర్ల
క్ష్యంగా చూస్తున్నాడని సరళ తల్లి నాగమ్మగారి
అభిప్రాయం సరళకి శంకరం తన శాయ
శక్తులా కష్టపడి భార్యని అత్తగారిని సుఖపెట్టా
చూస్తున్నాడని తెలుసు కాని తన తల్లి
భావమే అంత అవిడను ఎవరూ తక్కువగా
ాడకూడదు. ఎంతసేపూ ఆవిడకు కావలసిన

తారాకిళ్లీ సీమానూ, హోటళ్లనించి టిఫిన్లూ తెచ్చి పడేస్తుంటే శంకరం మంచివాడు లేకపోతే శంకరం వట్టి అసమర్థుడు, తెలివితక్కువవాడు, పోగరుబోతు అని అతన్ని నానామాటలూ అంటుంది

భోజనాలయ్యాక కంచాలూ అవీ అలాగే ఉంచేసి సరళ పక్కమీద పడుకొని డిటెక్టివ్ నవల చదువుకోసాగింది నాగమ్మగారు స్కూలు కెళ్లిపోయింది

నాగమ్మ ఆవూళ్లో ఎలిమెంటరీ స్కూల్లో హెడ్‌మిస్ట్రెస్‌గా పనిచేస్తున్న, నలభై అయిదేళ్ల భర్తృవిసర్జిత బహుశా అలా అనడంకన్నా మొగుణ్ణొదిలిన ఆమె అంటే సరిపోతుంది ఆమె భర్తతో కాపరం చేసిన రోజుల్లోనే సరళ పుట్టినట్టు లెక్క. సరళ పుట్టిన తరువాత మొగుడిమీద కోపం వచ్చి, ఆవిడ అప్పటికే స్కూలు ఫైనలు దాకా చదివివుండడంవల్ల, ట్రైనింగుకు వెళ్లి టీచరుద్యోగం సంపాదించింది అప్పటి నుంచీ, ఒకత్తే కాపురం ఉంటూ, సరళను పద్దెనిమిదేళ్లు వచ్చేదాకా పెంచింది ఆవిడ వూరుకున్నా, లోకం వూరుకోకపోవడంవల్ల, సరళ పెళ్లి గురించి తలపెట్టక తప్పలేదు అప్పటికి సరళ స్కూలు ఫైనలు తప్పి ఇంట్లో కూచుంది తనలాగే కూతుర్ని కూడా ట్రైనింగుకు పంపించి టీచరుద్యోగం చేయిద్దా మనుకొంది గాని, ఆమె ఉద్దేశం కొనసాగలేదు

సరళతోబాటు చదువుకొన్నప్పుడు ఏర్పడిన స్నేహంవల్ల నిర్మల అనే అమ్మాయి తరచూ సరళింటికి వస్తూవుండేది నిర్మల యింటికి సరళ కూడా తరుచు వెళ్తూండేది నిర్మలకు ఇద్దరన్నలున్నారు పెద్దన్నయ్య పేరు శంకరం రెండోవాడు రామం వాళ్ల తండ్రి కృష్ణమూర్తిగారని, ప్లీడరు గుమాస్తా చేస్తున్నాడు. నిర్మలా సరళా స్కూలు మానేసినా ఒకరింటి కొకరు తరచూ వస్తూండేవారు

శంకరం బి. ఏ చదువుతున్న రోజు లవి సరళను చూచిన దగ్గర్నుంచీ అత నామెచే ఆకర్షించబడ్డాడు సరళ తమ యింటికి వచ్చినప్పుడల్లా నిర్మలతో మాట్లాడుతున్నట్టు, కల్పించుకొని తనూ వాళ్ల సంభాషణలో చొరబడేవాడు సరళకి కూడా శంకరంతో మాట్లాడాలంటే చాలా సరదాగా ఉండేది

కృష్ణమూర్తిగారి భార్య చనిపోయి పదేళ్లయింది అప్పటికి నిర్మల ఆరేళ్లపిల్ల అప్పటి నుంచీ శంకరం, రామం, నిర్మలా, ఆయనా ఇంట్లో పనులు చేసుకుంటూ గడుపుకొచ్చారు నిర్మలకు పదిహేనవ సంవత్సరం రాగానే ఆమెకు పెళ్లి చేశారు అప్పటికి శంకరం ఇరవైయ్యేళ్లవాడు అతనికి పెళ్లిచేస్తే, ఇంట్లో కోడలు పనులుచూస్తూ సంసారాన్ని నిర్వహిస్తుందని కృష్ణమూర్తిగారు అభిప్రాయపడ్డారు నిర్మల ఎలాగైనా కొద్ది నెలలలో అత్తవారింటికి వెళ్లిపోతుంది అప్పుడింట్లో బొత్తిగా ఆడదక్షత ఉండదు అందుకని నిర్మల అత్తవారింటికి వెళ్లే లోగానే శంకరానికి పెళ్లి చెయ్యాలని కృష్ణమూర్తిగారు నిశ్చయించారు

# హోటలు: భోజనం

శంకరం సరళల మధ్య సాన్నిహిత్యం క్రమంగా వృద్ధవుతోందని నిర్మల పసిగట్టింది ఒక్కరోజు సరళ, నిర్మల యింటికి గనక రాకపోతే శంకరం "చెల్లాయి! సరళ రాలేదేమే యివ్వాళ?" అని పందసారులు అడిగేవాడు సరళ కూడా నిర్మలతో మాట్లాడుతున్నంతసేపూ, శంకరం కోసమే ఎదురు చూసేది అతనిగురించే అనేక ప్రశ్నలు వేసేది పైగా ఇంట్లో ఆడదిక్కెవరూ, పెద్దవాళ్లూ, చెప్పేవాళ్లూ లేకపోవడంవల్ల, నిర్మలకు గాని, శంకరానికిగాని వయస్సులో ఉన్నవాళ్లు ఎలాటి హద్దుల్లో ప్రవర్తించాలో తెలియదు రామం స్కూల్ ఫైనలు పాసయి యింటరులో చేరాడు. అతనిది చాలా ముభావంగా ఉండే స్వభావం పైగా ఇంట్లో ఎక్కువసేపు ఉండేవాడు కాదు.

సరళా, శంకరం, నిర్మలు ముగ్గురూ కలిసి సరదాగా కబుర్లు, సేళాకోళాలు, పాటలూ, అప్పుడప్పుడూ ఆటలూ, వీటితో కాలక్షేపం చేసేవారు ముగ్గురూ పేకాట తరుచూ ఆడేవారు. కృష్ణమూర్తిగారు ప్రొద్దున్న భోజనంచేసి వెళ్లినాయన

ఒక సర్దార్ జీతో ఆయన ప్రియురాలు: భగవంతుడు అందం పంచిపెట్టే టప్పుడు మీరు ఎక్కడికి వెళ్లారు?

సర్దార్ జీ: యుద్ధానికి.

రాత్రి ఎనిమిది గంటలకు తిరిగి వచ్చేవారు, గాబట్టి ఆయనకు ఈ విషయాలేమీ తెలియవు. సరళతో సరదాగా గడపడం కోసం శంకరం అప్పుడప్పుడు కాలేజీ కూడా ఎగ్గొట్టేవాడు సరళ చేతిలోని పత్రిక శంకరం లాక్కోడం, శంకరం చేతిలోని పుస్తకం సరళ లాక్కోడం, ఒకరి భుజా ల్నొకరు రాసుకుంటూ తిరగడం, అవసరం లేకపోయినా ఒకరి చెయ్యి ఒకరు పట్టుకోడం—ఈవిధంగా వారి ప్రేమ కావ్యంలో ప్రథమాధ్యాయం ప్రారంభమైంది

నిర్మల కాస్త కనుచాటయితే సరళను ఏదో నెపంతో తాకుతుండేవాడు. ఒకనాడు మధ్యాహ్నం నిర్మల వంటింట్లో కాఫీ పెడుతోంది. సరళ వచ్చి, శంకరాన్ని ఒక రూపాయుంటే ఒడు లిమ్మంది. శంకరం పెట్లోంచి రూపాయి తీసి సరళ చేతిలో పెట్టాడు. అలా పెడ్తున్నప్పుడు సరళ చెయ్యి అతనికి తగిలింది వెంటనే అతనికి ఉద్రేకం హెచ్చిపోయి, సరళను దగ్గరికి తీసుకొని ముద్దు పెట్టుకున్నాడు సరళ అతన్ని విదిలించుకోలేదు ఆ సమయానికి అక్కడికి వచ్చి వీళ్లిద్దర్నీ చూసిన నిర్మల కంగారుపడి ఏం చెయ్యాలో తోచక "సరళా" అని పిల్చింది.

సరళా శంకరంలు ఇద్దరూ కంగారుపడి విడిపోయారు

ఆనాటినుంచి సరళా, శంకరంలు మరీ చనువుగా తిరగడం మొదలెట్టారు నిర్మలకు ఏం చెయ్యాలో తోచలేదు తనకన్నా పెద్దవాడైన శంకరాన్ని తనేమనగలదు కాని తండ్రికీ విషయం ఎంతమాత్రం యిష్టం ఉండదని ఆమె అంతరాత్మ చెబుతోంది ఇలా జరిగిన కొద్ది రోజులకే నిర్మలకు వివాహమైంది ఆ హడావిడివల్ల శంకరం, సరళలు కలుసుకొనడానికి వీలుపడలేదు ఒక నెల రోజులపాటు ఇంట్లో ఎప్పుడూ బంధువులుండడంవల్ల, సరళ తమ ఇంటికి వచ్చినా, ఆమెతో ఎక్కువ చనువుగా తిరగడానికి శంకరానికి వీలు చిక్కలేదు లోలోపల ఆమె నెలాగైనా కలియాలని చాలా ఆతృత పడేవాడు పెళ్లయిపోయి బంధువులంతా ఎప్పుడు వెళ్లిపోతారా అని ఆతృతగా ఎదురుచూసేవాడు

వివాహమయినదగ్గర్నుంచీ నిర్మలలో కొంత మార్పొచ్చింది ఎవరూ చెప్పకుండానే ఆమెకు చాలా విషయాలు తెలిసాయి భార్యాభర్తల అనుబంధం ఎలాటిదో, లోకం ఎవర్నెలా చూస్తుందో, వయస్సు అనేది మానవుడికి ఎటువంటి పరీక్షో, ఆమెకు అర్థమవసాగింది మనిషిని ఒక్క తప్పటడుగు, శిఖరంమీద నుంచి అగాధంలోకి తోసెయ్యగలదని గ్రహించింది ముఖ్యంగా సరళా శంకరంల మధ్య రూపొందుతున్న అనురాగం, దాని పరిణామం, ఆమెకు బాగా అవగాహన అయింది. ఎలాగైనా అది తగ్గేటట్లయినా చూడాలి, లేదా యీ విషయం తండ్రి దృష్టిలోకి వచ్చేటట్లయినా ప్రయత్నం చెయ్యాలి, అని నిశ్చయించుకుంది. కొద్దికొద్దిగా చుట్టుపక్కల రేగుతున్న పుకార్లు, తమ పక్కింటి నరసింహంగారి భార్య సరళ గురించి అనే మాటలూ, ఆమె కర్థమవసాగాయి

మొదట సరళతో స్నేహాన్ని తగ్గించుకోడానికి ప్రయత్నించింది కాని సరళ తమ యింటికి రావడం మానలేదు నిర్మల వంతు శంకరమే ఎక్కువ ఆమెతో మాట్లాడసాగాడు వాళ్ల యిద్దరిమధ్య గాఢానురాగం పెరిగిపోయిందనీ, వాళ్లని విడదీయడం అసాధ్యమని గ్రహించింది నిర్మల అనేకసారులు శంకరం చేతుల్లో బంధింపబడిన సరళను చూసింది నిర్మల

కృష్ణమూర్తిగారి దూరపుబంధువు ఒకావిడ చాలా బీదస్థితిలోకి జారిపోయి, కొన్నాళ్లు వీళ్లింట్లో తలదాచుకోవడానికి వచ్చింది ఆమె విధవ ఏభైఏళ్లుంటాయి కృష్ణమూర్తిగారికి బంధుప్రేమ హెచ్చు అందులో భార్య లేకపోవడంవల్ల ఆడదిక్కు లభిస్తే ఆయనకు మరీ సంతోషం ఆమె ఆయనకు వరుసకు అక్కగారవుతుంది ఆమె వచ్చిన దగ్గర్నుంచీ నిర్మల ఆందోళన కొంత తగ్గింది కాని శంకరం బాధ హెచ్చయింది

శంకరం, మునుపటిలా సరళా, తనూ చనువుగా ఉండడం కష్టమని తెలుసుకున్నాడు అయినా సరళ వచ్చినప్పుడు ఎలాగో ఒకలాగా కొద్దిసేపయినా చాటుగా ఆమెను స్పృశించడానికి ప్రయత్నించేవాడు చుట్టపావిడ ఆవిలిస్తే పేగులు లెక్క

పెత్తే తనం శంకరానికీ, సరళకీ గల సాన్ని హిత్యం పసిగట్టేసింది నిర్మలద్వారా కొన్ని వివరాలు లాగింది సరళ తమ శాఖ కాదనీ, వాళ్లది సత్సాంప్రదాయకమైన కుటుంబం కాదనీ, ఆమె తల్లి నాగమ్మమీద పుకార్లు కొల్లలుగా వున్నాయనీ ఆమె వాకబుచేసి తెలుసుకొంది

కృష్ణమూర్తిగారు తీరికగా కూర్చొని మాట్లాడుతున్న సమయంలో, పిల్లలెవరూ దగ్గరలేని సమయం చూసుకొని, తను సేకరించిన భోగట్టా అంతా ఆయనతో ఏకరువుపెట్టి, ఎలాగైనా శంకరానికి వెంటనే పెళ్లి చేసెయ్యమని, అందుకు తగిన సంబంధం చూడమనీ చెప్పింది అనుభవజ్ఞుడు గాబట్టి పరిస్థితినంతా వెంటనే అర్థం చేసుకుని కృష్ణమూర్తిగారు వీలైనంత తొందరలో కొడుక్కు వివాహం చెయ్యడానికి నిశ్చయించుకొన్నాడు

సరళతో విచ్చలవిడిగా తిరగడానికి తమ యింట్లో ప్రతిబంధకాలు ఏర్పడుతున్నాయని తెలుసుకొని శంకరం సరళ యింటికే వెళ్లడం ప్రారంభించాడు వాళ్లిద్దరూ సరదాగా తిరగడం నాగమ్మగారు చూసి, చూడనట్టుగా వూరుకొంది

శంకరం తనకు వివాహసంబంధాలు వస్తున్నాయని చెప్పిన దగ్గర్నుంచీ, నాగమ్మ తన కూతురు పెళ్లిగురించి ఆలోచించసాగింది శంకరం సరళను వివాహమాడడానికి, అతనివాళ్లెవరూ ఒప్పుకోరు అయినా శంకరంలాంటి వాడు తన కూతురికి దొరకడం చాలా కష్టం ఎలాగో వాళ్లిద్దరికీ ప్రేమ కుదిరింది అంత వ్యామోహంలో ఉన్నారుగాని, వాళ్లిద్దరి పెళ్లి మామూలుగా జరిగే విషయం కాదు అంతేకాక ఇంకా ఆలస్యంచేస్తే శంకరానికి పెళ్లి సంబంధం కుదిరిపోయి, అతన్ని మెడలు వంచి వాళ్ల వాళ్లంతా ఒప్పించచ్చు అందుకని ఆమె, శంకరాన్ని తమ యింటికి రావద్దని కట్టడి చేసింది సరళకు మాత్రం జరిపించవలసిన కార్యక్రమమంతా బోధపరచింది శంకరం, సరళలు ప్రత్యేకంగా కలుసుకోకపోయినా, ఇద్దరిమధ్యా ప్రేమలేఖలు ఎడతెరిపి లేకుండా నడుస్తూండేవి

కృష్ణమూర్తిగారికి మంచి ఆస్తి ఉంది పరపతి ఉంది గౌరవం ఉంది ప్రొద్దున్నే లేచి 'మందరకాండ' పారాయణంచేసి, జపం చేసుకొని బయటికి వచ్చేవాడు చేసేది ప్లీడరు గుమాస్తా అయినా, కోర్టు వ్యవహారాల్లో ప్లీడరుకన్నా తెలివైన సలహా ఇవ్వగలడు ఆయన చాలా పరోపకారబుద్ధి గలవాడు అలాంటి వ్యక్తి కొడుక్కి తమ కూతుర్నివ్వడం మహద్భాగ్యంగా తలచి, అనేక మంది శంకరానికి పిల్ల నిస్తామని వచ్చారు పిల్లల జాతకాల్ని పరిశీలించి, అందులో ఒక మంచి సంబంధం ఎంచి వారి పిల్లను చేసుకుంటామని వారికి కబురంపారు కృష్ణమూర్తిగారు

కాబోయే పెళ్లికూతురు ఫోటో తీసుకొని, సంబంధం గురించి మాట్లాడడానికి పెళ్లివారు ఒకనాటి సాయంకాలం కృష్ణమూర్తిగా రింటికి వచ్చారు కృష్ణమూర్తిగారు ఫోటో చూసి సంతోషించారు శంకరానికి కూడా చూపించారు అతనూ నచ్చినట్లు తలూపాడు తక్కిన విషయాలు కూడా మాట్లాడుకున్నారు లాంచనప్రాయంగా పెళ్లికూతుర్ని చూసుకోవడ మవగానే ముహూర్తం నిశ్చయించుకుందా మనుకున్నారు వచ్చిన పెద్దమనుష్యుల్ని సాగనంపడానికి కృష్ణమూర్తిగారు స్టేషనుకు వెళ్లారు శంకరం తన స్నేహితులెవరో వస్తారనీ, రాత్రి వాళ్లతో గడిపి తను తిరిగి వచ్చేటప్పటికి ఆలస్యం అవుతుందనీ, అందుకు తనకోస మెవరూ ఎదురుచూడవద్దనీ ఇంట్లో చెప్పి వెళ్లిపోయాడు కృష్ణమూర్తిగారు తిరిగి వచ్చి, కొంతసేపు శంకరం కోసం ఎదురుచూసి భోంచేసి పడుకున్నారు

శంకరం తెల్లవారుఝామున ఇంటికి వచ్చి మెల్లిగా వెళ్లి తన మంచంమీద పడుకున్నాడు కృష్ణమూర్తిగారు ప్రొద్దున్నే లేచి జపం పూర్తయిన తరువాత తనపని చూసుకోవడానికి బయల్దేరి వెళ్లారు వీధిలోకి ఆయన్ని ప్రక్కయింటి నరసింహంగారు పిల్చారు

"కృష్ణమూర్తిగారూ ఇలా వచ్చి కూర్చోండి"

"ఏమిటండీ, విశేషం ? నరసింహమూర్తిగారూ !"

"మీకు మనస్సుకు కష్టం కలిగించే విషయం ఒకటి చెప్పవలసివచ్చి చెప్తున్నాను అన్యథా

---

ఒక పిల్లవాడు బడికి వెళుతూ స్నేహితునితో: ఈవేళ నేను నిద్రలేవగానే తలనొప్పి, జ్వరం, చెవిపోటూ, గొంతునొప్పి వచ్చాయిరా! కాని ఏం లాభం బడికి వెళ్లక తప్పలేదురా.

---

భావించవద్దు మీరూ, మేమూ ఇన్నాళ్లూ సోదరభావంతో మెలిగాం కాబట్టి చెప్పకతప్పదు"

కృష్ణమూర్తిగారు తెల్లబోయారు "విషయమేమిటండీ ?"

"నిన్న రాత్రి మీ పెద్దబ్బాయి శంకరం వివాహం, సరళ అనే అమ్మాయితో ఈవూరి చివరనున్న సత్యన్నారాయణ కోవెలలో జరిగిపోయింది

కృష్ణమూర్తిగారు నిర్ఘాంతపోయి "ఆ ! మా శంకరం పెళ్లా ?" అన్నారు నరసింహంగారు అవునని తలూచారు తను ఆ సమయానికి అక్కడికి వెళ్లడం తటస్థించిందనీ, అందువల్ల తనకా విషయం తెలిసిందనీ చెప్పారు కృష్ణమూర్తిగారు వెంటనే ఇంటికొచ్చి కొడుకుని పిల్చారు అప్పుడే నిద్ర నుంచి లేచిన శంకరం, తండ్రి తనను అంత హఠాత్తుగా పిలవడంతో జరిగిన విషయం ఆయనకు తెలిసిఉంటుందని వూహించాడు ఎలాగా తను అన్నిటికీ తెగించాడు

"నిన్నరాత్రి నువ్వు ఎక్కడికెళ్లావ్ ?"

శంకరం జవాబు చెప్పలేదు

కృష్ణమూర్తిగారు కోపంతో వణికిపోతూ "మాట్లాడవేం ?" అన్నారు

అప్పటికీ శంకరం, వంచిన తల ఎత్తకుండా మవునంగా నిల్చున్నాడు

"నా కంట్లో కారం కొట్టి పెళ్లి చేసుకునే అవసరం ఏమొచ్చింది నీకు ? నీకోసం మంచి సంబంధాన్ని అవతల నిశ్చయం చేస్తూంటే, చెప్పనన్నా చెప్పకుండా ఎవత్తెనో నీ యిష్టం మెచ్చినట్లు పెళ్లి చేసుకుంటావా ? వాళ్ల మంచిచెడ్డలు విచారించకుండా, ఆఖరికి నిన్ను కన్న తండ్రిని కూడా కాదని చేసుకుంటావా ?" అని క్రోధంతో, దుఃఖంతో మాట్లాడలేక వూరుకున్నారు నిర్మలా, రామం, చుట్టపావిడా ఆశ్చర్యంతో తండ్రి మాటలు వింటూ శంకరం మొహం చూస్తూ వూరుకున్నారు

కృష్ణమూర్తిగారు ఇంట్లో ఉండడాని కిష్టం లేక, కొడుకు చేసిన పని తల్చుకుంటూ, చికాకైన మనస్సుతో బయటికి వెళ్లిపోయారు మరో పావుగంటకి శంకరం పెట్టెలో తన బట్టలన్నీ సర్దుకుని, పెట్టె పట్టుకుని నిర్మలా, రామం "అన్నయ్యా!" అని పిలుస్తున్నా వినక బయటకు వెళ్లిపోయాడు

తల్లిని గోల్పోయిన బిడ్డలని అల్లారుముద్దుగా, ఏ లోపం రానీయకుండా, ఎన్నడు చెయ్యెత్తి దెబ్బయినా వెయ్యకుండా తన పిల్లల్ని కృష్ణమూర్తిగారు పెంచారు పెద్దకొడుకు బుద్ధిగా చదువుకొని వృద్ధిలోకి వస్తాడని, తన ముద్దూ ముచ్చటా తీర్చి, తను ఇంతకాలం వాళ్లకోసం పడిన శ్రమను మరిపిస్తాడని, శంకరంమీద ఆయన ఎన్నో ఆశలు పెట్టుకొన్నారు తల్లీ, తండ్రీ తానే అయి, అన్నివిధాలా తల్లిలా పిల్లల్ని సాకి వాళ్ల సుఖానికి అంతరాయం రాకుండా తను అన్ని సుఖాల్నీ వదులుకున్న కృష్ణమూర్తిగారికి శంకరం చేసిన పని, గుండెల్లో కత్తిపోటులా తగిలింది. దాని పరిణామం, తల్చుకున్నకొద్దీ ఆయన్ను బాధపెట్టసాగింది అయినా ఇదంతా తన కర్మ అనుకున్నా డాయన

అసలీ వివాహం జరిపించడానికి నాగమ్మగారే కారణం శంకరానికి సరళమీద ఉన్న వ్యామోహాన్ని కనిపెట్టి, ఆమె సరళని శంకరంతో మెసలనివ్వడం, కొంతకాలం మానేసింది శంకరం సరళకోసం ఏపనైనా చెయ్యడానికి సిద్ధపడ్డాడని గ్రహించిన తరువాత, వెంటనే వివాహానికి అంగీకరిస్తేనే తన కూతురి మొహం చూడమని, లేకపోతే ఆమె జోలికి రావద్దనీ చెప్పింది ఆ సమయంలో శంకరం సరళకోసం ఉహాళహాలాడిపోతున్నాడు అందువల్ల వివాహానికి వెంటనే ఒప్పుకున్నాడు కోవెలలో రహస్యంగా సరళను వివాహం చేసుకున్నాడు మర్నాడు తన పెట్టె పట్టుకొని సరళ యింటికి వచ్చేశాడు

ఒక నెలరోజులు శంకరానికి సరళతో స్వర్గవిహారం చేస్తున్నట్టు గడిచింది ఆ తరువాత నాగమ్మగారు అతన్నేదైనా ఉద్యోగం చూడమని చెప్పింది ఆమె ఆశించిన ఫలితం, ఈ వివాహంవల్ల రాకపోయేటప్పటికి ఆమె దృష్టిలో శంకరం విలువ తగ్గసాగింది ఎలాగో వివాహం జరిగిపోతే కొడుకు యందుండే వాత్సల్యంకొద్దీ కృష్ణమూర్తిగారు అతన్ని క్షమించి, కోడల్ని తమ యింటికి పిలి

పించుకుంటారని నాగమ్మ ఉద్దేశం అలాటిదేమీ జరిగే సూచనలు లేకపోగా, శంకరం తవ యింట్లోనే తిష్టవేసి, తన సంపాదనను ఖర్చు పెట్టించడం ఆవిడకి చాలా కష్టమనిపించింది

శంకరం బి ఏ చదువుకు స్వస్తి చెప్పాడు ఉద్యోగం కోసం రెండు నెలలు తిరగ్గా ఒక కంపెనీలో గుమాస్తాగా దొరికింది అతను కూడా మొదట్లో, తండ్రి తనకోసం కబురు పంపుతాడేమో ననుకున్నాడు గాని, ఇంటివద్ద తన సంగతే ఎవరితోటీ తండ్రి ఎత్తటంలేదనీ, తననూ పూర్తిగా మర్చిపోయినట్లుంటున్నాడనీ తెలిసి ఆ ఆశ వదులుకున్నాడు తనంత తను వెళ్లి తండ్రిని క్షమాపణ అడగదల్చుకోలేదు పైగా నాగమ్మగారి కెలా ఉన్నా, సరళకు అత్తవారింటికి వెళ్లడం ఏమాత్రం ఇష్టంలేదు తన తల్లిదగ్గర తనుండడం, తనభర్త తన చెప్పుచేతల్లో ఉండడమే సరళ కిష్టం

సరళ యిష్టమే తన యిష్టంగా భావించుకొని మెలగసాగాడు, శంకరం అంతేకాక సరళ దేన్ని కోరితే అది తెచ్చివ్వడం, తను తెచ్చిన జీతమంతా సరళ కిచ్చి ఆమె ఎలా ఖర్చు పెట్టమంటే అలా ఖర్చుపెట్టడం, సరళను ఎల్లప్పుడూ సంతోషంగా ఉంచడానికి ప్రయత్నించడం శంకరం యొక్క స్వభావమైపోయింది అతను సరళను గాఢంగా ప్రేమించాడు ఆమె ఏమాత్రం కష్టపడినా తను ఓర్వలేడు తన హృదయాన్నామె కర్పించాడు ఆమెకోసం తనవాళ్లని తృణప్రాయంగా విసర్జించాడు శంకరంయొక్క ప్రేమ ఎంత హెచ్చు స్థాయికి వెళ్లిందంటే, ఆఖరికి సరళ చేత వంటా పనులూ మాన్పించి హొటలుమీద ఆధారపడడం లేకపోతే తల్లికీ, కూతురికీ తనే కాఫీ కాచిచ్చి పిలైనప్పుడు వంట కూడా వండేటంత వరకూ వెళ్లింది నాగమ్మ కూడా ఉద్యోగస్తురాలే కాబట్టి ఆవిడకి మొదటినుంచీ వంట అలవాటు లేదు, సరళే మునుపు వండేది

భర్తకి బాధ్యతగా చెయ్యవలసిన అవసరం లేక పోబట్టి సరళకి బద్ధకం, మధ్య మధ్య నీరసం లాంటి సుకుమార లక్షణాలు అలవడ్డాయి పత్రికలూ, పుస్తకాలూ కాలక్షేపానికి ఉండనే ఉన్నాయి

శంకరం తనమీద తనూ శ్రద్ధ తీసుకోవడం లేదు, భార్యకీ అత్తగారికీ ఎలాగా అతనిమీద శ్రద్ధలేదు అందువల్ల క్రమంగా అతను చిక్కిపోయి, రెండేళ్లలో ఎముకలగూడులాగా తయారయ్యాడు నాగమ్మ అతన్ని చాలా నిర్లక్ష్యంగా, ఒక నౌకరులా చూస్తుంది అతను సరిగ్గా తిన్నాడో లేదో కనుక్కునేవాళ్లెవరూ లేరు ఎంతసేపూ తమ సుఖం, తమ అవసరాలూ చూసుకోవడంతోటే సరళకీ, వాళ్లమ్మకీ కాలం గడిచిపోతోంది

ఇలా శంకరం నానా అవస్థ పడుతున్నాడని కృష్ణమూర్తిగారికి తెలిసింది ఆయన పైకేమీ అనలేదు ఆయన ఆంతర్యంలో ఏం వూహ లున్నాయో తెలుసుకునే అవకాశ మెవ్వరికీ లేదు

శంకరం పనిచేసే కంపెనీలోనే గోవిందరావని ఒక వ్యక్తి పనిచేస్తున్నాడు. అతను రెండు మూడు సార్లు శంకరంకోసం శంకరం ఇంటికి వచ్చి అతని అవస్థంతా చూశాడు శంకరం అంటే అతనికి చాలా అభిమానం ఉంది శంకరంయొక్క ప్రేమ వివాహపు కథంతా తెలుసుకున్నాడు ఒకనాడు శంకరంతో సాయంకాలం షికారుకెళ్తూ తన మనస్సులో ఉన్న భావాలన్నీ బయట పెట్టాడు.-

"ఏమోయ్! శంకరం నేను చాలా బోళా మనిషిని అందుకని నీ గురించి నా అభిప్రాయం ఎక్కువకాలం దాచుకోలేను నీ పద్ధతేమీ బాగు లేదు లోకంలో అందరం పెళ్లయినవాళ్లమే ఎక్కడో నూటికి ఒకరు తప్ప ఇంచుమించు సామాన్యంగా అందరి భర్తలకీ భార్యలమీద అనురాగం ఉంటుంది కానీ ఆ అనురాగం చూపించడానికి ఒక పద్ధతి ఉంది వాళ్లకే లోటూ రాకుండా చూడడానికి ప్రయత్నించాలి అంత మాత్రాన అలుసిచ్చి నెత్తి కెక్కించుకోకూడదు భార్య చెయ్యవలసిన పని చేసి, ఆమె విధి నిర్వర్తించిన తరువాతే భర్త ప్రేమ కర్హురాలవుతుంది అంతేగాని ఆడది పనీపాటా లేకుండా తిని కూచొని, మగవాడిచేత వంటా వార్పూ చేయించడం సహించరాని తప్పిదం"

"మా ఆవిడకు వంట్లో నీరసమండీ"

"నాల్గు రోజులు పొయ్యిదగ్గర కూచుంటే అదే పోతుంది చురుగ్గా పనిపాటలు చేసుకుంటూ కలకల్లాడుతూ గృహంలో తిరిగినదే గృహలక్ష్మి కాని ఎప్పుడూ ఈదురోమని పక్కమీద పడుకొని మొగుడిచేత చాకిరి చేయించుకునే స్త్రీ భర్త ప్రేమ కనర్హురాలు"

శంకరం ఆలోచించాడు గోవిందరావు చెప్పిన మాటలు విన్నాడు అతని మనస్సులో ఈ భావాలన్నీ అజ్ఞాతంగా ఉన్నాయి కాని సరళమీద ఉన్న ప్రేమకొద్దీ వాటిని అణచిపెట్టేశాడు నాగమ్మగారు తనని అవమానిస్తున్నప్పుడల్లా అవి పైకి రావడానికి ప్రయత్నించినా తండ్రికి దూరమవడంవల్లా, తనని బలపర్చేవా రెవరూ లేకపోవడంవల్లా, అవి పూర్తిగా పైకి రాలేదు. గోవిందరావు తన పక్షం మాట్లాడుతూంటే, శంకర్రావులో మగతనం కొద్ది కొద్దిగా విజృంభించసాగింది గోవిందరావు మాటలన్నీ బాగానే ఉన్నాయి. కాని వాటిని క్రియారూపంలో పెట్టడ మెలాగో శంకరానికి తెలియలేదు

"మీరు చెప్పింది నిజమే కాని " అని శంకరం నానుస్తూంటే—

"కాని, ఎలా దారిలోకి తీసుకురావడమా? అని ఆలోచన కదూ?"

"అవును చాలాకాలం నుంచి మా ఆవిడకు అలవాటైపోయింది"

"ఇప్పుడు వయస్సేమీ మించిపోలేదు నాల్గు రోజులు కొత్తలో అవస్థగా ఉంటుంది తరువాత మామూలుగా అందరితోపాటూ అలవాటయిపోతుంది" అని గోవిందరావు శంకరానికి తన నిజ పరిస్థితి తెలియబర్చిన దగ్గర్నుంచీ శంకరం మనస్సులో ఈ విషయాలు మెల్లిగా మంటను రగుల్కొల్పసాగాయి

తను కన్నతండ్రికి చెప్పనైనా చెప్పకుండా సరళను వివాహం చేసుకున్నాడు పైగా ఎంతో వైభవంతో, కోలాహలంగా జరగవలసిన తన పెళ్లి, ఒక్క సరదా అయినా లేకుండ రహస్యంగా కోవెలలో జరిగింది నిర్మల పెళ్లి ఎంత దర్జాగా జరిగిందో వూహించుకుంటే, తనపెళ్లి ఎంత అవకతవకగా జరిగిందో తెలుస్తూంది తన తండ్రితో గట్టిగా తన మనస్సులోని విషయం చెప్పివుంటే ఆయన అంగీకరించునేమో? ఆయన ఏనాడూ తాము కోరినవాటిని కాదనలేదు తనే చిన్నతనంచేత తొందరపడిపోయాడు అందుకు కారణం నాగమ్మ! ఆమే ఈ ఏర్పాటు రహస్యంగా చేసింది ఆమె ఉద్దేశం తన తండ్రి ఈ సంబంధానికి అంగీకరించడని ఆమె చెప్పినట్లు చెయ్యడం వల్లే తన తండ్రితో అనవసర విభేదం వచ్చింది ఆమె వత్తాసు చూసుకుని తన భార్య తనను బాగా అలుసు చేస్తోంది వాళ్లిద్దరూ ఇష్టం వచ్చినట్లు ఖర్చుచేస్తూ, శంకరం దుబారా ఖర్చు చేస్తున్నట్లు మాట్లాడతారు తన స్వేచ్ఛనీ, ఆరోగ్యాన్నీ, ఓర్పునీ, అన్నిటిని హరిస్తున్నారు. పైగా అనవసరంగా తను వాళ్లకి లొంగిపోయాడు. భర్తగా తానెంత ప్రేమతో సరళను చూస్తున్నాడో, భార్యగా ఆమె అట్టి ప్రేమనే తనయందు చూపాలి అదేమీలేదు సరిగదా తన నొక అప్రయోజకుడి క్రింద చూస్తున్నారు వాళ్లిద్దరూ తను అనవసరంగా సరళ కెక్కడ కోపం

# హోటలు భోజనం



భార్య:- ఏమండీ మీ అమ్మగారు నన్ను అవమానించారు.

భర్త -మా అమ్మ నిన్ను అవమానించడమా అది ఎలా సాధ్య మవుతుంది. ఆమె 150 మైళ్ల దూరంలో.

భార్య అది కాదండీ ఉత్తరం ద్వారా

భర్త -(ఉత్తరం చదివి) ఎక్కడా లేదే, మామూలుగా వుంది.

భార్య:- అయ్యో వ్రాత. ఆ చివర పంక్తి చూడండి. అందులో చి॥ సౌ॥ కమల! యీ జాబు మా బాబు కివ్వడం మరవకు అనివుంది చాలదూ!

అర్ విశ్వనాథం (ఛత్రపురం)



వస్తుందోనని జడుస్తున్నాడు అది వట్టి తెలివి తక్కువ!

శంకరం మనస్సులో ఈ ఆలోచనలు బాగా రూపొందిన తరువాత ఒకనాడు ప్రొద్దున్నే లేస్తూ సరళను కాఫీ పెట్టమన్నాడు సరళ చిరాకుగా అతనివేపు చూసి, అతన్నే పెట్టమంది

"నాకు ఓపిక లేదు నువ్వు పెట్టు" అన్నాడు శంకరం

"నా కంతకన్నా వోపికలేదు హొటలు నుంచి తెండి"

"అల్లా వీల్లేదు నువ్వు కాఫీ చెయ్యాలిసిందే"

"నేను చెయ్యను"

అంత ఖండితంగా సరళ జవాబు చెప్పడానికి ఇన్నాళ్ళూ సరళ కిచ్చిన అలుసే కారణమని గ్రహించి శంకరం హొటలుకి వెళ్ళి తను మట్టుకు కాఫీ త్రాగి వచ్చాడు సరళా, నాగమ్మలు అతను తమకోసం కాఫీ తేవకపోవడం చూసి, కోపంతో మండిపడిపోయారు కొంచెంసేపయ్యాక సరళతో శంకరం అవ్వాళ్టినుంచీ సరళే వంట చెయ్యాలని చెప్పాడు సరళ తను చెయ్యనని చెబుదా మనుకొంది గాని, పొద్దున్న కాఫీ విషయంలో, శంకరం మామూలుగా లేడని గ్రహించి జవాబు చెప్పకుండా వూరుకుంది నాగమ్మగారు మాత్రం "దాని వంట్లో నీరసమని నీకు తెలుసు కదా రోజులాగే హొటలునుంచి కారియర్ తీసుకురా!" అంది

"అలా వీల్లేదు ఇవాళ్టినుంచీ అది వంట చెయ్యాలి!"

నాగమ్మగారు కోపంతో రెచ్చిపోయింది ఎందుకు వీల్లేదు! ఇదేం నీ యిల్లనుకున్నావా? దాని పుట్టింట్లో అది ఉంది హాయిగా చేయించుకుంటుంది నువ్వెవ్వడివి అడగడానికి?" అంది

శంకరం మారు మాట్లాడలేదు బట్టలు వేసుకొని బయటికి వెళ్ళిపోయాడు తిన్నగా హొటలుకి వెళ్లాడు భోజనం చెయ్యడం ఆరంభించాడు ఎదురుగుండా అదే సమయానికి కాఫీ త్రాగడానికి వచ్చే నరసింహంగారు కన్పించారు

"ఏమోయ్! శంకరం మీ చెల్లెలు పురిటి కొచ్చింది ఆ అమ్మాయి నిన్ను చూడాలని ఒకటే అనుకుంటుందట, మా ఆవిడ చెప్పింది" అన్నారు నరసింహంగారు శంకరం మనోపథంలో చెల్లెలూ, తమ్ముడూ, తండ్రీ మెదిలారు

"అలాగే నాకూ దాన్ని చూడాలని ఉంది" అన్నాడు శంకరం

శంకరం ధోరణిలో చిన్న మార్పువచ్చిందని నరసింహంగారు కనిపెట్టారు ఆయన కెన్నాళ్ళ నుంచో తండ్రీ కొడుకుల్ని కలపాలని ఉంది "మీ నాన్నగారి వంట్లో ఈమధ్య అంత కులాసాగా లేదోయ్" అన్నారు

"అలాగా! ఏమిటి జబ్బు?"

"ఆ ఏముంది, ఆయనకు మునుపటినుంచీ ఉన్న కడుపునొప్పే, ఇపుడు తరచుగా వస్తోంది నువ్వు ఆయనకి దూరమవడం, లోలోపల ఆయన ఎంతో బాధపడుతున్నారు" అని అతనివైపు చూశారు

"ఊఁ!" అన్నాడు శంకరం మెల్లిగా ఆలోచిస్తూ

"నువ్వైనా సర్దుకుని, ఆయనే మాటలకు లెక్కచెయ్యక ఆయన్ని తరుచూ క్షేమ సమాచారాలు విచారిస్తే బాగుంటుంది"

శంకరం ఏమీ జవాబు చెప్పకుండా కాస్సేపు ఆలోచించాడు నరసింహంగారి కాఫీ పూర్తయి లేచి వెళ్తూంటే, తను కూడా చెయ్యి కడుక్కొని ఆయన వెనకాల వెళ్లసాగాడు ఇద్దరూ హొటలు దాటి బయటికి వచ్చారు శంకరం, నరసింహంగారితో కొంచెం దూరం నడిచి, "మా నాన్న, నేను వెళ్తే రానిస్తాడా?" అని అన్నాడు మెల్లిగా

"ఎందుకు రానియ్యడోయ్ అదెప్పటికైనా నీ యిల్లే ఏదో ఆయనకిష్టంలేని పని చేశావు అంతమాత్రాన రక్తసంబంధం ఎక్కడికి పోతుందీ ఒకవేళ ఏదైనా అంటా డనుకో, పెద్దవాడు ఆయన అన్నాడని నువ్వు సర్దుకుంటే సరి వెళ్లు! వెళ్లు! వెంటనే మీ యింటికి వెళ్లు!" అన్నారు నరసింహంగారు

శంకరం, తండ్రి ఏమంటాడో అని ఒకవైపు భయంగా ఉన్నా, చిన్నప్పటినుంచీ తనను ఎంతో ప్రేమతో, ఆదరంతో చూసిన తండ్రి మొహం జ్ఞాపకం తెచ్చుకుంటూ ఇంటికి బయల్దేరాడు

వాకిట్లో తండ్రి కూచొని రాసుకుంటున్నాడు శంకరం అడుగుల చప్పుడు విని తలెత్తారు కృష్ణమూర్తిగారు



తండ్రీ కొడుకుల కళ్ళు నాలుగూ కలుసుకున్నాయి

కృష్ణమూర్తిగారు తల దించేసి మళ్లీ రాసుకోసాగారు ఆయన మొహంలో చిన్న మందహాస రేఖ మెరవడం శంకరం కనిపెట్టాడు ఇంట్లోకి వెళ్లాడు

నిర్మల శంకరాన్ని చూసి సంతోషంతో "వచ్చావా అన్నయ్యా! నీకు కబురు పెడదామనుకుంటున్నాను వదినను కూడా తీసుకురాలేకపోయావా? చాలా చిక్కిపోయావు" అంటూ మాట్లాడసాగింది రామం కూడా అన్నను పలకరించాడు ముగ్గురూ చాలాసేపు మాట్లాడుకున్నారు నిర్మల చాలసార్లు 'సరళను తీసుకురాలేదా?' అని నొచ్చుకుంది

శంకరం "నాన్న ఏమైనా అంటాడేమోనని తీసుకురాలేదు" అన్నాడు నిర్మల ఒక్క క్షణం ఆలోచించింది తండ్రి దగ్గరికి వెళ్లింది

"నాన్నా! అన్నయ్యతో వదినను తీసుకు రమ్మని చెప్పనా?" అని అడిగింది

కృష్ణమూర్తిగారు కూతురివైపు చూసి "సరే" అని తలూపారు

నిర్మల శంకరంతో తండ్రి సరళను తీసుకురావడానికి ఒప్పుకున్నాడని చెప్పింది అయినా శంకరం రెండు మూడు రోజు లాగి సరళను పిల్చుకు వస్తానన్నాడు శంకరానికి మనస్సులో సరళ వస్తుందో, రాదో అనుమానంగా ఉంది

శంకరం తండ్రియింట్లోనే ఉండిపోయాడు వారం రోజులుదాకా శంకరం కనుచాటయిన దగ్గర్నుంచి సరళకు మనస్సులో ఏదో భయం పట్టుకుంది దానికి తోడు నాగమ్మను ఇరుగు పొరుగు వారు "మీ అల్లుడు రాలేదా?" అని అడుగుతూండడం, కొందరు శంకరం తండ్రి దగ్గర ఉన్నాడని చెప్పడం, సరళకు పిచ్చెక్కినట్లయింది ఆమెకు జరిగిన విషయాలన్నీ జ్ఞాపకానికి రాసాగాయి తనూ తనతల్లీ అతని కివ్వవలసిన గౌరవం ఇవ్వలేదనీ, అతని ప్రేమనూ, మంచితనాన్నీ ఆసరాగా చూసుకొని, అతన్ని చాలా బాధపెట్టామనీ అనుకోసాగింది తనకోసం శంకరం ఎంత త్యాగం చేశాడో తల్చుకుని, తను అతన్ని అంత హీనంగా చూసినందుకు తనని తను తిట్టుకుంది రోజూ అతనికోసం ఎదురుచూడడం, అతను రాకపోవడం పాత సంగతులన్నీ జ్ఞాపకం వచ్చి సరళ ఏడుస్తూ కూచోడం పరిపాటయింది శంకరం ఇంక తన దగ్గరికి రాడేమో, తనను వదిలేస్తాడేమో? అని భయపడసాగింది నాగమ్మ కూడా కూతురుదే తప్పయినట్లు, తానేమీ ఎరగనట్లూ మాట్లాడసాగింది అందరూ కలిసి తనమీద కసి తీర్చుకుంటున్నట్లుగా సరళ వూహించుకొని బాధపడసాగింది చివరికి ఒకసారి శంకరం కనిపిస్తే చాలు అతని కాళ్లమీద పడి ఏడుద్దా మనుకొంది తల్లిమీద కోపం వచ్చి అన్నం తినడం మానేసింది శంకరం యింటికి తనే వెళ్దామనుకుంది గాని, అక్కడ కృష్ణమూర్తిగారు తనని ఇంట్లోకి రానిస్తారో, రానివ్వరో అని భయపడి మానేసింది

వారం రోజుల తరువాత ఒకనాడు ప్రొద్దున్న సరళయింటికి రామం వచ్చాడు అతన్ని చూడగానే సరళకి కొండంత సంతోషంవచ్చింది 'రా! రామం మీ అన్నయ్య అక్కడే ఉన్నారా?" అని అడిగింది

రామం తలూపుతూ "నిన్ను పిల్చుకు రమ్మన్నాడు" అన్నాడు

సరళకు గొప్ప ఆనందం కలిగింది శంకరం తనకోసం కబురు పెట్టాడు వెంటనే వెళ్ళి అతన్ని కలుసుకోవాలి నాగమ్మ మాత్రం ఇందులోని కిటుకు అర్థం చేసుకుంది ఒక్క నిముషం ఆలోచించింది తన కూతురు సుఖమే తనకు కావాలి కాని, బొత్తిగా తనను లెక్కచేయకుండా, శంకరం రమ్మనడం, సరళ వెళ్లడానికి సిద్ధం కావడం ఆమెకు నచ్చలేదు కూతుర్ని వెళ్ళొద్దని చెబుదా మనుకుంది

"రిక్షా పిల్చుకురా! రామం" అని సరళ చెప్పడం వింది నాగమ్మ

రామం రిక్షా పిల్చుకు వచ్చాడు సరళ వెళ్ళి కూర్చోబోతుంటే "అదేమిటి? అత్తవారింటికి చీరా, సారె పెట్టి పంపించాలి కాస్త ఆగు! రేపు వెళ్దువుగాని" అంది నాగమ్మ

"అవన్నీ తరవాత పంపించవే అమ్మా!" అంటూ రిక్షాలో కూచొని రిక్షావాణ్ణి 'పోనియ్యి' అంది సరళ. రిక్షా కదిలిపోయింది. ★

# గిరీశం లెక్చర్లు

(31-వ పేజీ తరువాయి)

చెప్మా" గారు (ఇంగ్లీషు దొంగచాటుగా మిక్సయిన తెలుగు జోకు నవ్వితే నీ కర్మం) చెప్పిందాకా అన్ప్యంగతి కానుకోలేకపోయా వాటెఫాల్ మై కం( ఓమన్ ! అనుకొన్నా ) వెంకటేశం ! నవ్వాస్తే ఇంగ్లీషులోనే నవ్వు సుమా)

నా పేలాపనలో హ్యూమరు (హాస్యంకాదు బట్టు! హాస్యం అనే అర్థం) ఇంగ్లీషు, తెలుగు మాటలు ఢీకొట్టుకు ఇదవడంవల్ల ఉత్పన్నమైనట్టి దనీ అది తెలుగు హాస్యం కాదనీ ఆయన (లేటెస్టు హాస్య బ్రహ్మ—హాస్యం కాదు, సంస్కృత సమాస బిరుదు) వెల్లడి చేశారు తెలుగ్గాకపోతే పోనీ, ఇంగ్లీషు హాస్యమా అనేవు అదిన్నీ కాదు దీన్ని శబ్దాశ్రయ హాస్యం అంటారు హాస్యానికి గల బిరుదులో ఈ శాబ్దికం ఒకటిలే మొత్తంమీద ఇన్ని లక్షల మంది తెలుగుజనాభా ఇన్నేళ్ళుగా చేసిందీ, ఇంకెన్నేళ్లో వెయ్యబోయేదీ—నామీద ప్రాక్టికల్ జోకు చెయ్యడం అన్నమాట ఇన్నాళ్ళూ నా పేలాపనలో హాస్యం కాని దానిని చూసి పొట్టలు బద్దలయేలా (హా బ్ర గారు ఒప్పుకోపోతే పొట్టలు బీటలు వేసేంత మాత్రమే అని చెప్పుకుందాం) ఏవన్నానూ—లయేలా (శబ్దాశ్రయ హాస్యము) నవ్వడంలో తాత్పర్యం ఒక్కటే— వీడు హాస్య మనుకొన్నది తెల్గూ హాస్యం కాదురోయ్ ! వీ డిది హాస్యం అనుకుంటున్నాడురోయ్ బాబోయ్ నవ్వాగటంలేదురోయ్ అని నవ్వుకుంటున్నారన్నమాట కాని ఆమాట నాకు చెప్పరాదూ పోని ఒహడితో ఒహడైనా చెప్పుకోరాదూ మనక్కాస్త వినబడేలా ?

కాని ఇందులో వో మెలికుందిట ఆరంభంలో ఇది తెలుగు హాస్యంకాదని,ఆంధ్రదేశ భక్తిగలవారెవరూ నవ్వరాదనీ నవ్వొస్తే బిగించుక్కూచోవాలనీ ప్రజలు అనుకుని ఉండవచ్చు ఇందులో హాస్యపదాలన్నీ హాస్యాస్పదాలన్న దృష్టితో మాత్రమే కొంతకాలంపాటు నవ్వివుంటారు అయితే దరిమిలాను ఎన్నాళ్ళకీ వాన్నాన్ తెలుగు హ్యూమర్ (తెలుగు హాస్యం కానిది కానిది) ఏదీ తటస్థపడనందువల్ల బహుశా ఇన్నాళ్ళూ మనం హేళన చేసిందే అసలు హాస్యం కాబోలు భగవంతుడా అని నాలిక్కరుచుకుని మళ్ళీ రిట్రాస్పెక్టివ్ ఇఫెక్టుతో నవ్వ నారంభించారేమోనని ఒకాయన వాదించాడు వారి మొహం

ఇప్పుడు ఆం—గ్లో (అంటే ఆంధ్రము ఆంగ్లము కలిస్తే ఆంగ్లో—అయినా ఇది హాస్యం కాదు నవ్వ వద్దూ) హ్యూమరుని, ఇంగ్లీషు మాటల్ని, వాటినీ వాడినవాళ్ళనీ కోప్పడినాయనే, చాలా సైద్ధాంతిక గ్రంథాలూ, వాటికి దార్శనిక సారస్వతం తయారు చేశారు—తెలుగు హాస్యం కానిదేదీ అన్నది ఆంధ్రాలు పోల్చుకుందికి వీలుగా ఆయన నేతినేతి విధానం అవలంభించి హాస్యం ఇదికాదు, ఇదీకాదు అని తేల్చుకుందికి వీలుగా రచనలు అమరిగ్గా ఏర్పరచారు

ఆపాటి ఈసిన్ను నాకూ వచ్చు వెధవది ఇంగ్లీషు ముక్కలు దొర్లి హ్యూమరు పుట్టిస్తాయి గాని

"హాస్య మనగా నేమి తాలములు (దవడలు గామోసు) సాగుట కొన్ని కండరములు ముడుచుకొని (ఇంగ్లీషు ముక్కలు దొర్లాయన్న కోపంతో కాదు) కొన్ని సాగి వోష్ఠములు విడివడి దంతములు (ఉంటే) తళుకుమని (తగుపాటి వెల్తురున్నపుడు, కారాకిళ్లీ వేసుకొనకపోతే) మెరియుటను హాసమందురు అది తెప్పించుట హాస్యము " ఒహాయన, ఈయన కూడా బిరుదు మొగాడు కాదగ్గవాడే—పై విధంగా ఒక హాస్యోపన్యాసం మొదలెట్టేసరికి హోలు గొల్లు మంది—ఇది హాస్యమనో హాస్యాస్పదమనో తెలీదనుకో అయితే నేం నవ్వింది కానిట్టే హాస్యం అనుకుందాం వెధవ గొడవ ఈ ప్రజల్తో ఇదే చిక్కు నవ్వుతున్నారో, నవ్వుకుంటున్నారో, నవ్విపోతున్నారో పోల్చుకోడం కష్టం మందారిన మనం సిద్ధాంతాలు చేస్తూనే ఉంటాం గాని అజ తెలీదు ఐనా వాళ్ళభిప్రాయం మన కెందుకనుకో మొత్తానికి (హా బ్ర గారి (హా) సిద్ధాంతం ప్రకారం హాస్యం రెండు రకాలైనట్టు తోస్తుంది ఒకటి శబ్దాశ్రయ హాస్యం అనగా చప్పుళ్లను ఆశ్రయించుకు బతికేది (ఇది బతుకుతుందా ? బతికి బట్ట కడుతుందా ? హా ! మిగతాది భవిష్యత్తు వెండి తెరపై చూడుడు ) ఇక రెండోది నిశ్శబ్దాశ్రయ హాస్యం అంటే మాటాడకుండా గుడ్లింతజేసి జడ్డిగా చూడ్డం, ల్జల్యల్యా అని వెక్కిరించడం, పిల్లి మొగ్గలు వెయ్యడం, అంతకీ నవ్వకపోతే ఎదటివాడిని కింద పడదోసి కితకితలు పెట్టడం అయుంటుంది ఆ ఇందుకు బలిష్ఠులు అయినవాళ్లే ఒడిగట్టడం మంచిది ఎందుకైనా మంచిది పోతే, వారు చెప్పిన శబ్దాశ్రయ హాస్యంలో పరభాషా శబ్దాశ్రయ హాస్యం, స్వభాషా శబ్దాశ్రయ



హాస్యం అన్నివిధాలు పైదానిలో చెప్పన్న దేశాల భాషల పేరిటా అన్ని రకాల హాస్యాలూ ఉంటాయి వాటిలో ఆంగ్ల శబ్దాశ్రయ హాస్యం హీనమైంది అది తెలుగు హాస్యం కాదు నీకు తెలుస్తూనే ఉన్నా చెప్పడం నా విధి, వృత్తి స్వభాషా శబ్దాశ్రిత హాస్యంలో భారత రాజ్యాంగం గుర్తించిన పద్నాలుగు భాషలూ కాక, ఉన్న భాషలన్నీ లెక్కేసి వాటి పరస్పర సంకరంవల్ల పుట్టే వాటిని గుణించడానికి గణిత శాస్త్రజ్ఞుడు రావాల్సిందే

ఇక ప్రస్తుత విషయమైన ఆంగ్ల శాబ్దికం ఉంది చూశావూ అందులో హాస్యం కలిగించే ప్రయోగాలు ఇవి కొట్టిపై, తిట్టిపై మొ చచచ అబ్బెబ్బె ఇవి నావి కావు హాస్యం తెలిసినవాళ్ళు కూడా—నవ్వకపోతే అదే పాయె, కనీసం నవ్వుకునైనా పోరా అన్న వూహ చొప్పున కాబోలు—ఆయన ఇంత పొట్ట చెక్కలయ్యేలాటి, ఉదాహరణలు యిచ్చారు అలాగే సంస్కృతంలో కూడా తినమిష జిగమిష అనేవి హాస్యపు ఫాక్టరీలనీ మన్ని నవ్విస్తాయనీ హామీ యిచ్చారు శబ్దాశ్రయ హాస్యం అంటే ఇదేనని ధైర్యం చెప్పారు (అన్యాయం ఘోరం నా టెక్నిక్కును—ది సీక్రెట్ ఆఫ్ మై సక్సెస్సును ఇలా క్షుణ్ణంగా ఆకళింపు చేసేసుకుని అందరికీ చెప్పెయ్యడం అన్యాయం మేష్ట్రరూ )

**అయితే యివన్నీ శబ్దాశ్రయ హాస్యాస్పదాలే. ఇది తెలుగు హాస్యం కాదు.**

**ఇక తెలుగు హాస్యాస్పదా లేవిటి ? అబ్రహాం** లింకను (ఆంగ్ల నామానికి స్వేచ్ఛానువాదం) ఒకనాడు పాదరక్షలు తొడుచుకుంటూ ఉండగా ఒకడు వచ్చి ఏమీ మీ జోళ్ళను మీరు తుడుచుకుంటారా ( యు పాలిష్ యువరోన్ షూస్ ?) అనగా ఆయను మీ రెవరివి తుడుస్తారు అనెనూ ఇది ఇంగ్లీషు కాక అమెరికనీస్‌జోకు అనుకోవచ్చు ఇది శబ్దాశ్రయ హాస్యానికి చక్కని ఉదాహరణ అనీ, దీని బతుకంతా 'యువర్ వోన్' అన్న పలుకుబడిమీద ఆధారపడిందనీ నువ్వనుకుంటే నీ కర్మ నవ్వితే అందుకున్నాను ఆ జోళ్ల జత ఇండియాకి తెచ్చి పింగళి లక్ష్మీకాంతానికో, పిలకా గణపతిశాస్త్రికో తొడిగించి మీ జోళ్లను మీరే పాలిష్ చేసుకుంటున్నారే అన్న ప్రశ్న, అవును వీ రెవరివి చేస్తారు అన్న జవాబు (పై ప్రశ్నక ఇంకెవరు చేస్తారు అన్న జవాబు రావాలనుకుంటే నీకు తెలుగొచ్చినంత ఒట్టు) ఏర్పాటుచేస్తే అది పదహారణాల తెలుగుజోకు (అవ్‌కోర్స్ టు హెల్‌విత్ నుడికారం ) ఆ తెలుగూ జెంటిల్మె నిద్దరూ ఆజోకు చూసి ఆశ్చర్యపడగానే విట్టు పూర్తవుతుంది నువ్వు నవ్వచ్చు లేదా నవ్వుకోవచ్చు

ఫూల్స్‌కు నేను దారివ్వనన్న మూర్ఖుడిని చూసి, వే నిస్తానన్న ఒక సీమ రచయిత డైలాగుని, పదహారణాల తెలుగు చిన్నదానికి తొడిగి, అంతవ మాట— మొగుడి మొకొహమ్మీద విసిరేయిస్తే అది పదహారణాల తెలుగు జోక్ (అవ్‌కోర్స్, టు హెల్‌విత్ ఔచితి ఆర్ వాటెవ రిటీస్) అయ్యో ఆ ముగ్ధనాయిక, పతిని దైవంగా మన్నించేది, ప్రేమించేది, ఒక రచయిత చెప్పిన మాటని విని ఆంగ్లేయ శబ్దాశ్రయ హాస్యాన్ని దొరకబుచ్చుకొని మొగుడి మొహాన విసిరికొట్టేం దేవిటని మీరు నవ్వుకోగానే తాలములు సాగి ఓష్ఠములు విడి హాస్యం ఉత్పత్తి అవుతుంది ఒక టెక్సాసు మిలియనీర్ భార్య కిటికీలోంచి విసిరేసిన వజ్ర వైడూర్యాలను చక్కా పట్టుకొచ్చి (వారు పారేసినవే కాబట్టి చౌర్యం కాదుగా హా !) మన వీధిలో సుబ్బమ్మగారి నోటికిచ్చి పెరటిగో డవతల పారేయించేస్తే అది పదహారణాల తెలుగుజోకు బహుశా 'నిశ్శబ్దాశ్రయ' జోకు అయుంటుంది

ఈవిధంగా తెలుగు హాస్యాన్ని పోల్చుకుని ఆనందించడాని కిన్ని వసతు లుండగా ఈ తెలుగూస్‌గాళ్ళు నా యింగిలీషు ముక్కలు పట్టుకు దేవుళ్లాడ్డం బాగు లేదు పైగా ఇపుడిప్పుడు న కే అనిపిస్తోంది నేటి వాదం ప్రకారం అన్ని హాస్య! రచనలు ? హాస్యం నవ్వాలి) చేసెయ్యడమే గాక, హాస్యబ్రహ్మ (ఇదీ హాస్యమే న వన్స్‌మోర్ హా కాదు) అనే సంస్కృతపు సమాస బిరుదుచ్చుకున్న సైద్ధాంతిక నిర్మాత చెప్పాక ఇహ నాయనమాట నెదిరించిందికి దమ్ముచ్చాలవు అంచేత, నీకు గురి కుదిరినా మానినా, నమ్మకం ఉన్నా మానినా, నవ్వు వచ్చినా, మువ్వు, మిగతా ఆంధ్ర ప్రజలూ నా మాటలు విన్నప్పుడు పైకి నవ్వకండి కావమ్మ అసలు మొగుడే, అర్నెళ్ళు కాపరం చేశాక, నేను కాను మొగ్రో అంటే ఎలా నమ్ముతారో అలాగే నాది తెలుగు హాస్యం కాదన్న మాదన్న మాటకూడా నమ్మి మన్నించాలి మీరు గనక పైకి నవ్వితే మీకు హాస్యం తెలిసినంతొట్టు రేడియో నాటకాలకీ, తెలుగు సినిమా కథలకీ, తలాతోకా ఉన్నాయనుకున్నంత ఒట్టు.



# ఆదర్శాలు-ఆశయాలు

(29-వ పేజీ తరువాయి)

కార్మికులలో రెండువర్గాలు ఏర్పడినందుకు నరసింహప్ప సంతోషించాడు పోలయ్య ఆనాడు ఎట్లా మాట్లాడిందీ మునసబు, శౌయిలు చెప్తుంటే నరసింహప్ప మనస్సులోనే పోలయ్యను అభినందించాడు

''రాజారావు ప్రోద్బలంవల్లనే పోలయ్య ఆరోజు ఉపన్యాసం ఇచ్చి ఉంటా''డనుకున్నాడు నరసింహప్ప

ఆలోచిస్తే రాజారావుకు రాజకీయాలమీద ఉన్న అభిప్రాయమేమిటో నరసింహప్పకు అంతు చిక్కలేదు ''తను వెనక ఉండి పోలయ్యను ముందుకు నెట్టడంలోగల ఉద్దేశ్యమేమిటి ? నిజానికి తనకూ రాజారావుకు ఎక్కువ అభిప్రాయ భేదాలు లేవు తను చెప్పింది అతనికి నచ్చలేదు జరిగిందే అంత తనే తొందరపడి అతణ్ణి దూరం చేసుకున్నాడు అతనూ, పోలయ్యా తన పక్షం ఉంటే ఎంత బాగుండేది ? చలమయ్యను ఎంత ఆట ఆడించేవాడు తను ? పోలయ్యకు ఆశచూపినా లొంగకపోయె

''రాజారావు తెలివిగలవాడు బాగా చదువుకున్నవాడు మంత్రివర్గంలోను, నాయకులలోను పలుకుబడిగలవాడు అతణ్ణి కుడిభుజం చేసుకుందామనుకున్నాడు తను అది ఆదిలోనే బెడిసికొట్టింది అతనికి ఎన్నికలలో నిలబడాలన్న కోరిక కలగడం తప్పా ? తనకంటే ముందునుంచి అతను కాంగ్రెసులో ఉన్నాడు కొంత త్యాగం చేశాడు జైళ్ళకు వెళ్ళాడు అటువంటివాడు ఎన్నికలలో పోటీచేసి, శాసన సభ్యుడు కావాలనుకోడంలో తప్పేమీలేదే ! కాని అతను పోటీచేస్తే తన సంగతేమిటి ? అందుకే భయపడ్డాడు తను పోలాయిబలం రాజారావుకు లేకుండా చేద్దామనీ, తనపక్షం చేసుకుందామనీ ప్రయత్నిస్తే అదీ బెడిసికొట్టిందయ్యె'' నరసింహప్పలో ఆలోచనల మీద ఆలోచనలు సాగిపోతున్నాయి

''తనకు డబ్బుంది స్థానికంగా చలమయ్యకంటే మంచిపరపతే ఉంది ఎంత డబ్బయినా గుప్పగలడు తను రాజారావుకు డబ్బేది ? ఎట్లా గెలుస్తాడు ?'' అని ప్రశ్నించుకున్నాడు నరసింహప్ప

''ఇప్పుడు మిల్లుకార్మికులలో వర్గాలు ఏర్పడ్డాయి కాబట్టి, కొన్ని ఓట్లు రాజారావుకూ, కొన్ని చలమయ్యకూ రావచ్చు తను వాళ్ళను వదిలిపెట్టి మిగతా జనాన్ని ఏదో విధంగా ఆకట్టాలి'' అని సమాధానపరచుకున్నాడు నరసింహప్ప

''అందరూ అనుకుంటున్నట్టు నిజంగా రాజారావు లసలు ఎన్నికలలో పోటీచేస్తాడా ? ఆ ఉద్దేశం ఉన్నవాడు ఊళ్ళో తన ప్రాపకం పెంచుకోక పోలాయిని ఎందుకు ముందుకు నెడుతున్నాడు? ఇందులో కూడా ఏదైనా రాజకీయపు ఎత్తు ఉన్నదా ?'' అని సందేహించాడు నరసింహప్ప

ఇంతలో ఇందిర ''నాన్నా'' అంటూ అక్కడకు వచ్చింది

''ఏమిటమ్మా ?'' అన్నాడు నరసింహప్ప

''నెలరోజులైంది—ఆయనదగ్గరినుంచి ఉత్తరాలు లేక నాకేమో భయంగా ఉంది నాన్నా'' అంటూ సోఫాలో కూర్చుంది ఇందిర.

''చదువుల హడావిడిలో తీరుబడిలేక వ్రాయలేదేమోలే'' అన్నాడు

''మూడు ఉత్తరాలు వ్రాశాను ఒక్కదానికైనా సమాధానం వ్రాయడానికి అంత తీరుబడి లేకుండా ఉంటుందా నాన్నా'' అంది ఇందిర

అల్లుడు ఉత్తరాలెందుకు వ్రాయడంలేదా అని ఆలోచించాడు నరసింహప్ప కారణం ఊహించలేకపోయాడు

''నేను ఇవ్వాళే ఉత్తరం వ్రాస్తాలే నీవేం దిగులుపడకు తల్లీ'' అన్నాడు

ఇందిర మౌనంగా ఏదో ఆలోచిస్తూ కూర్చుంది

''పరీక్ష ఇవ్వడానికి నీవు ఎల్లుండే వెళ్ళాలనుకుంటాను బయలుదేరి నేను వద్దామంటే తీరుబడి లేకుండా ఉంది సీతారామయ్యగారు వస్తామని ఒప్పుకున్నారు వెంట ఒక దాసీదాన్ని కూడా తీసుకువెళ్ళు ఏ హోటల్లోనో బస చేయండ్రాటే, ఎందుకు—మా బంధువుల ఇంట్లో దిగుతాం అన్నారు సీతారామయ్యగారు'' అన్నాడు నరసింహప్ప

''నెగ్గుతానన్న నమ్మకంలేదు నాన్నా'' అంది ఇందిర

''అట్లాగే అనిపిస్తుంది సీతారామయ్యగారు చెప్పారులే—ఫరవాలేదు ప్యాసు అవుతుందని''

''ఆయనెందుకు నాన్నా వెంట? పోనీ నీవే తీరుబడిచేసుకొని రాగూడదూ ?'' అయిష్టంగా అంది ఇందిర

''నేను హైదరాబాదు వెళ్ళాలమ్మా కంపెనీ డైరెక్టర్ల మీటింగుందని వ్రాశారు ఇక్కడచూస్తే బోలెడన్ని పనులున్నాయి''

''పోనీ ఒకపని చేస్తే నాన్నా పోలాయిని తీసికొని రాజారావుగారు ఎట్లాగూ వెడతారుగా నేనూ వాళ్ళతోపాటే దాసీని తీసుకు వెడతాను ఆయనే మాకు ఏ హోటల్లోనైనా బస ఏర్పాటుచేస్తారు'' సాలోచనగా అంది ఇందిర

ఒకసారి కూతురు ముఖంలోకి చూసి ఓక్షణం ఆలోచించాడు నరసింహప్ప

''వాళ్ళతో నీ వెందుకమ్మా అంతగా నీకు సీతారామయ్యగారు రావడం ఇష్టంలేకపోతే మన మునసబు వస్తాడులే—బస ఏర్పాటుచేయడానికి వీలైతే ఆయనా అక్కడే ఉంటాడు ఆ నాలుగు రోజులు''

''సీతారామయ్యగారు రావడం నాకు ఇష్టంలేక కాదు నాన్నగారూ . అనవసరపు ఖర్చు ఎందుకని అన్నాను పోనీ మాస్టారినే తీసుకువెడతాలే'' అంది ఇందిర

''పరీక్ష పేపర్లు వ్రాస్తూ కూడా మీ ఆయన్ను జ్ఞాపకం జేసుకునేవు కనుక పరీక్ష పేపర్లు ఉత్తరాలైపోతాయి'' నవ్వుతూ అన్నాడు నరసింహప్ప

''పో నాన్నా . '' అంటూ ఇందిర లోపలకు వెళ్ళింది

''పోలాయికూడా పరీక్షకు వెడుతున్నాడన్నమాట వాడి తెలివితేటలకు, చురుకుతనానికీ చదువుకూడా ఉంటే చరచర పైకి వచ్చేస్తాడు రాజారావు ఈ ఊరొచ్చి ఉండకపోతే పోలాయికి అక్షరంముక్క వచ్చేదికాదు ఒక్క పోలాయన్న మాటేమిటి ? ఎంతో మందికి ఉచితంగా విద్య ప్రసాదిస్తున్నాడు రాజారావు'' అనుకున్నాడు నరసింహప్ప

ఇంతలో మునసబు అక్కడకు వచ్చాడు

''రావయ్యా—రా కూర్చో . ఏమిటి విశేషాలు ?'' అని ప్రశ్నించాడు నరసింహప్ప

''ఇవ్వాల్టిటి పత్రికలు చూశారా ?'' అన్నాడు మునసబు

''లేదే శౌయిలూ శౌయిలూ'' అని కేకవేసి ''ఏమిటి పత్రికలలో మనని గురించి ఏమైనా వచ్చిందా ?'' ఆదుర్దాగా అడిగాడు నరసింహప్ప''

శౌయిలు వచ్చాడు

''పెద్దమ్మాయిగారిదగ్గిర ఇవ్వాళ్టటి పత్రిక ఉందేమో అడిగి తీసుకురా'' అన్నాడు నరసింహప్ప

శౌయిలు వెళ్ళిపోయాడు

''మనమేం చేశామని మనల్ని గురించి వస్తుంది పత్రికలో చలమయ్యగారు మొన్న సభ పెట్టి ఘనకార్యం చేశారుకాబట్టి ఆయనను గురించి వచ్చింది ఈ దినపత్రికలోకంటే చలమయ్యగారి పార్టీ వారపత్రికలో ఆయన ఫోటో వేసి బ్రహ్మాండంగా వ్రాశారు'' అంటూ జేబులో మడచిపెట్టిన పత్రిక బయటకు తీశాడు మునసబు

మొదటి పేజీలోనే చలమయ్యబొమ్మ కనిపించింది నరసింహప్ప లోలోపలే పత్రికలో వ్రాసిన విషయాలు చదివాడు ''ఇందులో పోలాయి ప్రసక్తే లేదే !'' అన్నాడు నరసింహప్ప

మునసబు నవ్వాడు

''దొరవారు సత్యకాలంలో ఉండవలసినవారు. పోలాయి వాళ్ళకు వ్యతిరేకంగా చురకపెట్టినట్టు మాట్లాడాడుకదా అవి పత్రికలోకి ఎక్కనిస్తారా ?''

శౌయిలు దినపత్రికతెచ్చి బల్లమీద పెట్టి వెళ్ళాడు నరసింహప్ప ఆ పత్రికలోకూడా ఊళ్ళో జరిగిన సభ విషయం చదివాడు

''ఇదేమిటయ్యా ఈ పత్రికలో క్లుప్తంగా వ్రాశారేకాని చలమయ్యనుగురించి గోరింతల్ని కొండింతలుగా వ్రాయలేదే ఆ పత్రికలోలాగా'' అన్నాడు నరసింహప్ప

తెలుగుటీచరు (విద్యార్థితో)
ఒరేయి గోపీ ! ఆశ్చర్యార్థక వాక్యమున కొక ఉదాహరణ ఇమ్ము
గోపి:- ఎంత బుద్ధిలేని వాడవు!
ఎన్. ప్రసాదరావు (జయపురము)

# ఆదర్శాలు-అంతర్యాలు

"అన్నిపత్రికలూ ఎందుకు వేస్తాయంటీ . . అందులో ఈ పత్రిక ఎవరిది ? ఎదుటి పార్టీ మనిషికి అంత ప్రచారం ఇస్తాయా ?"

"అవున్లే అదీ నిజమే ! పాలసీ ప్రకారం పోవాలిగా పాపం, ఆ వార పత్రికలో ఫోటో రావడానికి చలమయ్య ఎంత ఖర్చు పెట్టాడో ?"

"అవుగాని దొరవారూ ఈ విషయం విన్నారా ?" అన్నాడు మునసబు

"ఏమిటది ?" ఆసక్తిగా అన్నాడు నరసింహప్ప

"రాజారావును తనవైపు తిప్పుకోడానికనేమో— అలివేణిని ఉపయోగిస్తున్నారుట చలమయ్యగారు"

"ఏమిటీ అలివేణినా ?" సంభ్రమాశ్చర్యాలతో అన్నాడు నరసింహప్ప

"అవును దొరవారూ, అలివేణి చక్కని చుక్కలా ఉంటుందంటారుగా అంతా ఆమె అంద చందాలకు రాజారావు భ్రమసి వలలో చిక్కుకుంటాడేమోనని చలమయ్యగారు ఎత్తు వేస్తున్నారు రెండుసార్లు ఆమెదగ్గరకు వెళ్ళాడుట రాజారావు ఒకరోజు రాత్రి అక్కడే ఉండి పోయాట్టకూడా అతను" అన్నాడు మునసబు

"నాకు అంత నమ్మకం చిక్కడం లేదయ్యా . ఏదో మిషపెట్టి అతణ్ణి పిలిపించిఉంటారు రాజారావు అలివేణి వలలో పడిపోయేటంతటి తెలివి తక్కువవాడు కాదనుకుంటా" అన్నాడు నరసింహప్ప

"ఏమో ఎవరు చెప్పగలరు . దొరవారికి కోపం రాకపోతే ఒక విషయం చెప్పనా?"

"ఏమిటది ?"

"నేను చెప్పింది విని మీరు ఎవరినీ ఏమీ అనను అంటే చెప్తా"

"సర్లేవయ్యా— ఉపోద్ఘాతం చెబుదూ?"

"ఉహూఁ . అలాకాదు మీరు మాటివ్వాలి"

"సరే . . . ఎవరినీ ఏమీ అననులే చెప్పు"

"మన లలితమ్మగారు రాజారావును ప్రేమిస్తున్నారు" రహస్యంగా అన్నాడు మునసబు

"ఏమిటయ్యా — నీవనేది ?" చిరుకోపంతో అన్నాడు నరసింహప్ప

"నిజం దొరవారూ ఆంజనేయస్వామి తోడు మొన్న ఒకరోజున నేను పనిమీదవెళ్ళి స్కూలు రోడ్డుమీదుగా వస్తున్నా లలితమ్మగారు స్కూలునుంచి వస్తున్నారు దారిలో రాజారావు కలిశాడు ఇద్దరూ నవ్వుకుంటూ ఏమిటో మాట్లాడుకున్నారు నేను దూరాన్నుంచి ఇదంతా చూస్తూనే ఉన్నా నేను వస్తున్నది కనిపెట్టి అమ్మాయిగారు చకచక వెళ్ళిపోయారు రాజారావు లలితమ్మగారిని చూసి మురిసిపోతూ ఆటే చూస్తూ నిలబడిపోయాడు" అని వివరంగా తా నా రోజు చూసినదాన్ని వ్యాఖ్యానించాడు మునసబు

"మరి నీవు చూస్తూ ఊరుకున్నావుటయ్యా రాజారావును గట్టిగా చీవాట్లు పెట్టకపోయావా?"

"ఆసంగతి దొరవారు చెప్పాలా ? నాలుగూ దులిపి, జాగ్రత్త దొరవారికి తెలిస్తే వళ్లునినలిపినట్టు నలిపేస్తారని వార్నింగు ఇచ్చాను" గర్వంగా అన్నాడు మునసబు

"అందుకా, లలిత ముభావకంగా, విచారంగా ఉంటున్నది . అయితే మరి ఏంచేద్దామయ్యా ?" అని ప్రశ్నించాడు నరసింహప్ప

"ఏముందీ ? ఓమంచి ముహూర్తాన ఇద్దరికీ వివాహం జరిపించెయ్యండి !"

"ఏమిటీ — రాజారావుకు లలితను ఇమ్మంటావా ? మా వంశం ఎటువంటిదీ ఎంత పరువుప్రతిష్టలు కల కుటుంబం ? అతనికీ మాకూ ఎక్కడి సాపత్యమయ్యా ?"

"అవన్నీ ఆలోచించాను దొరవారూ ఆలోచించే అంటున్నాను అమ్మాయిగారి కోరికా తీర్చినవారవుతారు దీనితో రాజారావు మీ పక్షం అయిపోతే ఇక మీకు అడ్డు లేకుండానూ పోతుంది రాజారావు ఎంత చెబితే అంతా పోలాయి ఇక అప్పుడు చలమయ్యగారిని ముక్కుపట్టుకొని ఆడించవచ్చు మనం" అన్నాడు మునసబు

"నీవు చెప్పింది బాగానే ఉందయ్యా .

---

తండ్రి -ఒరేయి గోపి ఇంట్లో లైట్లన్నీ ఒక్కసారి ఆర్పేసిరా. రేడియో వార్తలు విందాము

గోపి -అయితే ఉండునాన్న! మెయిన్‌స్విచ్ ఆర్పేసి వస్తా

—డాల లక్ష్మి, (పార్వతీపురం)

---

కాని నా కెందుకో లలితను అతనికివ్వడం ఇష్టం లేదు"

"మీ మేలుకోరేవాడిని కాబట్టి చెబుతున్నా మీమీదా, ఇందిరమ్మగారిమీద చలమయ్యగారు చేసే దుష్ప్రచారంకూడా దీనితో ఆగిపోతుంది"

"అదేమిటీ—నామీదే కాకుండా మా ఇందిరమీద కూడా చలమయ్య దుష్ప్రచారం చేస్తున్నాడా ?"

"రాజారావును ప్రైవేటు చెప్పవద్దని మీరు మాన్పించేశారుగా దానికి చలమయ్యగారి మురా రంగుపూశారు ఇందిరమ్మగారు రాజారావుతో పిచ్చిగా వ్యవహరిస్తుంటే మీరు మాన్పించేశారని ప్రచారం చేస్తున్నారు"

"ఛీ ఛీ చలమయ్య ఇంత నీచానికి పాల్పడుతున్నాడా ? అందరూ తనూ, అలివేణిలాగా అనుకున్నాడా దుర్మార్గుడు" పళ్ళు కొరికాడు నరసింహప్ప

"ఆవేశంపడితే ఏం ప్రయోజనంలేదు దొరవారూ ! తెలివిగా చలమయ్యగారికి చెప్పు దెబ్బకొట్టాలి అందుకు మొదట మీరు రాజారావును అల్లుడిగా చేసుకోవాలి"

"ఉహూఁ అది అసంభవం నాకు తలనొప్పిగా ఉంది నీవు వెళ్ళిపో నన్ను ఆలోచించుకోనీ" నుదురు పట్టుకొని అన్నాడు నరసింహప్ప

"సరే"నంటూ మునసబు నరసింహప్పకు నమస్కరించి వెళ్ళిపోయాడు

"ఏమిటిదంతా ఇలా ఎందుకు జరుగుతున్నది ? నిజంగానే ఇందిర అట్లా ఛీ ఛీ కన్న కూతుర్నే శంకిస్తున్నాడా ? ఏమో అందుకే ఇందిర పరీక్షలకు రాజారావుతో వెడతానందేమో ? ఉహూఁ కాదు ఇదంతా ఆ చలమయ్య పన్నాగం దాయాది ద్వేషం" అనుకున్నాడు నరసింహప్ప

"మరి లలితమాటేమిటి ? లలిత నిజంగానే రాజారావును ప్రేమిస్తున్నదా ? తా నెప్పుడూ ఊహించనైనాలేదే—ఇలా జరుగుతుందని అన్నివిధాలా రాజారావుతో కొరివితో తలగోక్కున్నట్టుందే ! మునసబు ఎందుకు అబద్ధం చెప్తాడు ? లలిత రాజారావును ప్రేమిస్తున్నట్టయితే ఇందిరకు తెలియకుండా ఉంటుందా ?" అని ప్రశ్నించుకున్నాడు

"శాయిలూ శాయిలూ" అని కేక వేశాడు నరసింహప్ప

శాయిలు వచ్చాడు

"పెద్దమ్మాయిగారిని ఓసారి రమ్మని చెప్పు శాయిలూ !" అన్నాడు

ఐదు నిమిషాల్లో "ఏమిటి నాన్నా" అంటూ వచ్చింది ఇందిర తండ్రి ముఖం చూసి ఏదో జరిగి ఉంటుందని ఊహించింది

నరసింహప్ప కూతురిముఖంవంక పరిశీలనగా చూశాడు

"కూర్చోమ్మా ఒక్క సంగతి అడుగుతా నిజం చెప్తావా ?"

"అదేమిటి నాన్నా నీ దగ్గర అబద్ధం ఎందుకు చెబుతాను" కంగారు అణచుకుంటూ అంది ఇందిర

"లలిత రాజారావును ప్రేమిస్తున్నదా ?" ఆమె ముఖంలోని భావాలను పరిశీలిస్తూ ప్రశ్నించాడు నరసింహప్ప

"అమ్మయ్య !" అనుకుంది ఇందిర

ఆమె ముఖకవళికలనుబట్టి నిజమేనని ఊహించాడు నరసింహప్ప

"ఈవిషయం నాకు చెప్పకుండా ఎందుకు దాచావు ? మనకు అతనితో పొత్తేమిటి ? చెల్లాయికి చెప్పు — ఇట్లాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోవద్దను" కోపంగా అన్నాడు నరసింహప్ప

"నాన్నా" అంటూ ఏమో చెప్పబోయింది ఇందిర

"ఇంక నీవేం చెప్పక్కర్లా ఇద్దరూ జాగ్రత్తగా మసులుకోండి రేపు పరీక్షలకు వెళ్ళినా అక్కడ రాజారావుతో మాట్లాడకు"

"అదికాదు నాన్న లలిత" ఆమె వాక్యం పూర్తి చేయకుండానే నరసింహప్ప ఆమెను చుర చుర చూస్తూ "నీవేం చెప్పక్కరలేదు — నేను విననక్కరలేదు వెళ్ళిక్కడినుంచి" అని గద్దించాడు

ఇందిర అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళిపోయింది నరసింహప్ప తల చేత్తో పట్టుకొని సోఫాలో కూర్చుండిపోయాడు (సశేషం)

# 2

# దేవయ్య కథ

(27-వ పేజీ తరువాయి)

వాళ్ళ ఊరిపొలిమేరలో ఉన్న పెద్ద మర్రిచెట్టుమీద ఒక దెయ్యం తన ముగ్గురుపిల్లలతోటీ నివసిస్తోంది. మనుషులంతా మంచిగా, కలిసిమెలిసి సుఖంగా కాలం గడుపుతోంటే దెయ్యాలకి కడుపు మంటగా ఉంటుంది. ఎంతసేపూ మనుష్యులు తగవులాడుతూ, ఒకళ్ల నొకళ్లు ద్వేషించుకుంటూ కొట్టుకు యిదవుతుంటే సంతోషించడమే కదా దెయ్యాల లక్షణం! అలాగే ఈ ముగ్గురు అన్నదమ్ములు యేం తగవులాడుకోకుండా, అంతచక్కగా వేరయి, కాలంగడపడం ఈదెయ్యానికి ఎంతో బాధ అనిపించింది. ఆ అన్నదమ్ముల్లో కలహాలు రేపడం ఎలాగా అని ఆలోచనపట్టుకుంది. అందుకని తన ముగ్గురు సంతానాన్నీ పిలిచి చెప్పింది "ఈ ఊళ్ళో ఉండే ముగ్గురన్నదమ్ములూ అంత కలసిమెలసి ఉండడం నాకేం బాగా లేదు కాబట్టి మీరంతా మీశక్తి యుక్తు లుపయోగించి వాళ్ళల్లో వాళ్ళు కొట్టుకు చచ్చేటట్టుచేయాలి. అప్పుడుకాని నా కళ్ళు చల్లగా ఉండవు. ఈపని మీరు చేయగలరా?"

"ఓ. నిముషాలమీద చేయగలం?"

"ఏవిధంగా?"

"ఏముంది? ముందు ఒక్కొక్కణ్ణే వేరువేరుగా సర్వనాశనం చేసేస్తాం. ఒక్క ముద్దకూడా దొరకని స్థితిలోకి తీసుకువచ్చి, అప్పుడు అందర్నీ ఒక చోటికి చేరిస్తే సరి ఒకరిమీదికి ఒకరు ఆకలితోఉన్న పులిలాగ విరుచుకుతినడానికి పూనుకుంటారు"

"ఆఁ! ఆ పద్ధతి బాగానే ఉంది. అయినా జాగ్రత్త. ఈపనిలో మీరు నెగ్గుకు రాకపోయారో డొక్కచీల్చి డోలు కట్టేస్తాను గుర్తుంచుకోండి"

అని హెచ్చరించి పెద్ద దెయ్యం వెళ్ళిపోయింది పిల్ల దెయ్యాలు మూడు అక్కడ సమావేశమై ముందు కార్యక్రమం నిర్ణయించబోయాయి. కాని ఒకఒప్పందంకుదిరి యేడిస్తేనా? దేనిమటుకు అదే, అతి తేలికైన పని తనకు కావాలని పట్టుపట్టేది చివరకి తేల్చుకోలేక, చీట్లు వేశాయి. యెవరు యే తమ్ముణ్ణి పట్టుకోవాలో నిర్ణయించుకోడనికి. ఆతరవాత తమపని ముగిసిపోతే, తరవాతవారికి సహాయం కావాలంటే చేయాలనీ, తిరిగి మళ్ళీ ఆ మర్రిచెట్టు మీదే కలుసుకోవాలనీ, ఒప్పందం చేసుకుని ఎవరి దారిని వాళ్ళు పోయాగ.

మళ్ళీ అనుకున్న వేళకి అనుకున్నరీతిగా ఆ పిల్లదెయ్యాలు మూడూ ఆ మర్రిచెట్టుమీద కలుసుకున్నాయి. తాము పైన వేసుకున్న పనులు యేవిధంగా నెరవేర్చిందీ చెప్పడం మొదలుపెట్టాయి. అందులో వస్తాదు వాకయ్యని పట్టుకున్న పిల్ల దెయ్యం యిలా చెప్పింది: "నేను తలపెట్టిన కార్యం యించుమించు పూర్తి అయిపోయినట్టే. రేపు వస్తాదు వాకయ్య తండ్రి యింటికిపోతాడు. దాంతో తగవు ప్రారంభం.

"ఏమిటేమిటి? అప్పుడే ఎలా చేయగలిగావు చెప్పు చెప్పు?" అని అని ఆశ్చర్యపోయాయి మిగిలిన రెండూను.

"అదే వినండి" అని మొదలు పెట్టింది. ఆదెయ్యప్పిల్ల "నేను ఆ వస్తాదు వాకయ్యకి ఎక్కడలేని ధైర్యం వచ్చేటట్టుచేశాను. దాంతో అతడు రాజుగారిదగ్గర గొప్పలు పోయాడు. నిజమేననుకుని రాజు అతణ్ణి సేనాధిపతినిచేసి, పొరుగుసే



# దేవయ్యా కథ

ఉన్న పెద్దరాజ్యంమీదికి దండెత్త బోతున్నాడు అతడూ సర్వసన్నద్ధుడై వెళ్ళి ఆవూరి కోటబయట విడిసి ఉన్నాడు ఈలోగా నేను అతని సైన్యం ఉపయోగించే తుపాకీ మందు చెమ్మగిల్ల చేశాను అంతే కాక, అవతలపక్షపు రాజుగారికి గడ్డితో అనేక వేలమంది సైనికులని సృష్టించి యిచ్చేశాను ఈసైనికులు చుట్టు ముట్టేటప్పటికి వాకయ్య సైన్యం తుపాకులు పేల్చబోయింది కాని ఒక్కటీ పేలితేగా! ఓడిపోయిన వాకయ్య తిరిగివస్తే రాజుగారు కోపించి అతని జాగీరులు ఉద్యోగం తీసేసుకుని జైలులో వేశారు. ఇంక మర్నాడు ఉరి తీయిస్తారనగా, మళ్లీ వాకయ్యని జైలులోంచి తప్పించాను ఇప్పుడతడు ఇంటికెళ్లేదారిలో ఉంటాడు. రేపటితో నాపని అయిపోతుంది. ఎవరికి నా సహాయం అవసరమో చెప్పండి"

"నాకు ఎవరిసహాయం అక్కర లేదు" అని మొదలుపెట్టింది. రెండో దెయ్యప్పిల్ల అంటే లావుపాటి రామయ్యని పట్టుకున్నది. "నా వ్యవహారం కూడా యింక వారంరోజుల్లో తెమిలి పోతుంది అంతకంటె ఎక్కువ కాలం అగ లేదు రామయ్య. మొట్టమొదట అతగాడిలోఅత్యాశ రేకెత్తించాను. దాంతో అతనికి కనిపించిన ప్రతీ వస్తువు కొనివెయ్యడం ప్రారంభించాడు. కొన్నాడు, కొన్నాడు. డబ్బు అయిపోయేదాకా లెక్కలేని వస్తువులు కొనేశాడు ఇంకా ఆశ తీరలేదు. అప్పుచేసికూడా కొనడం మొదలుపెట్టాడు వస్తువులతోపాటు అప్పుకూడా పెరిగిపోయింది. ఇంకో వారం రోజుల్లో అప్పులవాళ్లు పైన బడతారు. వాళ్ళని ఉరుకోబెట్టలేక యింటిముఖం పడతాడు. ఆతరవాత ఉండనేఉంది"

ఇద్దరూ యింతచెప్పినా యేం మాట్లాడలేదు మూడోదెయ్యప్పిల్ల అందుకని ఈరెండే అడిగాయి

35 సంవత్సరాల వయస్సు గల ఒక యువతి—40 సంవత్స రాల యువకునితో-మనం పెళ్లి చేసుకుంటే, బావుంటుంది కదూ

ఆయన - అది మంచి ఉద్దేశ్యమే. గాని మనం ఎవర్ని కావాలి

*   *   *

జైలును చూచుటకు వచ్చిన ఒక పెద్దమనిషి ఒక ఖైదీతో యిట్లా అన్నాడు

"నీకు ఒంటరిగా ఉన్నందుకు బాధగా లేదూ?"

"లేదు"

"నీ బంధువులను, స్నేహితులను చూడకుండా ఉండటం బాధగా లేదూ?" అన్నడా పెద్ద మనిషి.

బాధ ఎందుకయ్యా? వాళ్ళు యిక్కడే ఉంటేనూ! అని జవాబిచ్చాడు ఖైదీ

శ్రీశ్రీశ్రీ ఏలూరు

"నీ వ్యవహారం ఎంతవరకూ వస్తుంది?" అని ఆపిల్లదెయ్యం ఒక నిట్టూర్పువిడిచి చెప్పింది "అబ్బే! నాసంగతి యేం బాగాలేదు అక్కడకీ మొట్టమొదట వాడికి బాధ కలగాలని, వాడి మంచీనీళ్ళ కడవలో ఉమ్మివేశాను ఆనీళ్లు తాగితే కడుపునొప్పివచ్చి ఏడుస్తు కూర్చుంటాడు కదా అని. ఆతరవాత వెళ్లి వాడిపొలంఅంతా రాయిలా గట్టిపరచివేశాను ఇంక దున్నడం మానేస్తాడుకదా అని. ఉహూ! ఆవెర్రివెధవ ఎక్కడ మానతాడు? నాగలి పట్టుకు తయారైదున్నడం మొదలు పెట్టాడు. ఒకప్రక్క కడుపునొప్పితో చచ్చేటట్టు మూలుగుతున్నా, దున్నడంమాత్రం మాన లేదు దేవయ్య అక్కడకీ నాగలి విరిగిపోయేటట్టు చేశాను ఇంటికి పోయి క్రొత్తనాగలి సరికొత్తత్రాళ్లు తీసుకువచ్చి మళ్లీ దున్నడం మొదలు పెట్టాడు ఇంకేం దారిలేక భూమిలోదూరి ఆ నాగలి కర్రు గట్టిగా పట్టుకొన్నాను ఆపుదామని. అబ్బే ఎక్కడి ఆగడం? మరింత నొక్కి పట్టుగా దున్నాడేగాని మాన లేదు. ఆ నాగలి కర్రు పదునికి నా చేతివేళ్లు కూడా తెగిపోయాయి. ఆ దున్నడం కూడా అంతా అయి పోయినట్టే! యింకొక చెక్క మిగిలి పోయింది. అది కాస్తా అయిపోతే యింక మనం వాణ్ణేం చేయలేం. ఏంచేసినా ఆ వెర్రివెధవ పనిమానడం లేదే! ఇప్పుడు మనం పూనుకోకపోతే అది వాడు దున్నేయడం శుభ్రంగా పండించుకోవడం ముగ్గురన్నదమ్ములు లేమి అంటె ఎరగక హాయిగా ఉండడం మన పన్నాగం పాడవడం అన్నా జరిగిపోతాయి. అందుకని సోదరులారా! మీరు వచ్చి నాకు సహాయపడాలి రండి ఆలస్యం చేయకూడదు" అని బ్రతిమాలడం మొదలు పెట్టింది

దానిమీద వస్తాదు వాకయ్య దెయ్యంపిల్ల తాను సహాయపడతాననీ ధైర్యంగా ఉండమనీ హామీ యిచ్చింది. ఆ వేళటికి అందరూ వెళ్లారు. [సశేషం]

# స్నేహం

(23-వ పేజీ తరువాయి)

"హావ్, నువ్వే కూచో "
"లేదు నువ్వు కూచుందూ"
"లేదు, నేను నిలుచునే ఉంటాను"
"నేనే నించుంటాను ఫరవాలేదు"
"కాదు నే చెప్పేది విందూ "
"కాదు, నే చెప్పేది " అంతే! ఈలోగానే ఆ కుర్చీని ఇంకో దారినపోయేదానయ్య ఆక్రమించాడు

"మధ్య దానయ్య తన్నుకుపోయాడు" అన్నాడు మురారి

"అదుగో అక్కడ రెండు సీట్లు ఖాళీ బనయ్ రా, రా, తొందరగా పరుగెత్తాలి ఇంకా స్పీడ్‌గా బాగా ఆ స్పీడ్ చాలదు జోరుగా

ఆ! లాభం లేదయ్యా—ఎవరో వచ్చేసి కూచున్నారు"

ఇద్దరూ అలసిపోయారు చెమటలు కక్కుతున్నారు అక్కడ పైన ఒక తిరిగీ తిరగని ఫానుంటే దానికింద నించున్నారు 'ఉస్సు' మంటూ

ముకుందమూ మురారీ మాంచి స్నేహితులు చాలా 'మందం' అన్నమాట! ఒక మంచం మీద పడుక్కొని ఒక కంచంలో తినేవారు అంటే మా పార్థసారధి అన్నట్లుగా, రెండు కంచాలూ మంచాలూ లేక కాదు, ఆ స్నేహం అట్టిది! అందుకనే ఒక కుర్చీలో కూర్చుని కాఫీ సేవిద్దా మనుకున్నా విధి అడ్డం తిరిగింది

ఈవిధంగా వచ్చిన అడ్డంకుల్ని లక్ష్యపెట్టక, దీక్షాతత్పరులై, క్రమశిక్షణాయుతులై, పెద్దల వాక్యమును మీరనివారై, ఎట్టకేలకు—సీటులు సంపాయించుకున్నారు ముకుందమూ, మురారీ

"హే భగవాన్!" అన్నాడు మురారి

"ఆపద్బాంధవా" అన్నాడు ముకుందం

"ఆహా, భక్తవత్సలా ముకుందా" అన్నాడు మురారి

"హేహే—శ్రీహరీ మురారీ" అన్నాడు ముకుందం

"ఇన్నాళ్లకు మాకు స్థలం దక్కించావు కదయ్యా" అనుకున్నారు ఇద్దరూ నిట్టూర్పులు విడిచేస్తూ

"ఎన్న ఏంకావాలి?" అన్నాడు వడ్డనదారు

"ఆఁ, ఏమిటి బ్రదర్ ఇడ్లీ తీసుకుందామా,"

"వద్దులే బ్రదర్, పొద్దున్నా అదే సాయంత్రమూ అదే అవుతోంది"

"ఐతే బజ్జీ తిందాం బ్రదర్"

"ఆమాట బావుంది బ్రదర్"

ఇద్దరూ బజ్జీలూ, ఆతర్వాత దోసే, ఆతర్వాత ఒక్కోటే కాఫీ తెప్పించుకున్నారు వడ్డందారు బిల్లు రాసి తెచ్చాడు ముకుందం చెయ్యి చాపి తీసుకున్నాడు

"అదేమిటయ్యా అతని చేతిలో పెడతావూ?" అన్నాడు మురారి, 'బుద్ధిలేదూ, గడ్డి తింటున్నావా, ఆమాత్రం తెలీదా' అనే ధోరణిలో

"చెయ్యి చాపాడు యిచ్చాను ఆపైన మీరేమన్నా కాండి మాకు అందరూ ఒకటే అసలే మేం 'సర్వ' రులం" అని వెళ్లిపోయాడు, సన్న 'య్యరు' గూడకట్టు పైకి మడుస్తూ.

"తేరా ముకుందం, నే యిస్తాతే" అన్నాడు మురారి

"ఆ ఏముందిలే ఎవరిస్తేనేం గనక" అన్నాడు ముకుందం

"అందుకే నే నిస్తాను—ఏం గనక ఎవరిస్తే"

"ఆఁ, ఎందుకుందూ, లే"









ఇద్దరూ లేచారు నడుస్తున్నారు

"తేరా ముకుందం, బావుండదు" అన్నాడు మురారి

"ఏమిటి బావుండదు నే నివ్వటమా"

"కాదు ఇన్నిసార్లు అడిగించుకోవటం" అంటూనే మురారి ముకుందం చేతిలోని బిల్లును లాగేశాడు

"ఛాఛా, వద్దంటూ వుంటే ఏమిటది?" అని తిరిగి లాక్కున్నాడు మురారి, కోపంగా

"మళ్లీ లాగకూడదు అట్లా—ఏమిటా ఇది?" అని మళ్లీ లాగబోయాడు ముకుందం.

"ముకుందం, వద నామాట విను"

"మురారీ, నామాట విను"

"ఏం, వినేదిలేదు నే నివ్వను" అన్నాడు కోపంగా మురారి, గుప్పిట ముడిచి

"ఇవ్వవూ? ఎట్లా ఇవ్వవో నేను చూస్తాను" అని కోపంగా గుప్పిట విప్పబోయాడు మురారి గట్టిగా పట్టాడు

"ఇస్తావా లేదా" అని గద్దించాడు ముకుందం.

"ఏంట్రా దబాయిస్తావ్, ఇవ్వను నీ తాతొచ్చెప్పుకో"

"మర్యాదగా అడుగుతున్నంతసేపూ ఇవ్వవురా" అని ముకుందం పౌరుషంగా మురారిపైకి లంఘించాడు ఆ చేతిని అందుకోబోయాడు మురారి తప్పించుకుంటున్నాడు ఇద్దరూ ఒకరొకరు గట్టిగా పట్లు పట్టారు బిల్లు కాయితం నలిగి నలిగి చెమటకు తడిసిపోతున్నది ముకుందం మురారిని బలంగా క్రిందకు పడదోశాడు ఈ 'వేడుక' చూస్తూ తింటున్నవాళ్లు కూడా సగం ఇడ్లీముక్క చేత్తో పట్టుకుని చోద్యంగా చూడసాగారు ఎవరూ విడిపించలేదు ఆ ఆలోచనా లేదు కిందపడ్డ మురారి రొప్పుతూ లేచి, ముకుందాన్ని లాగి క్రిందకు తోసి—"తోస్తావ్రటా" అన్నాడు ఆవేశంగా

"యూ రాస్కెల్" అని లేచి, ఉద్రేకంగా మురారి చెంపమీద చెళ్లుమని చరిచాడు ముకుందం మురారి తిరిగి బలంగా ఒక్కటిచ్చాడు ముకుందం మురారి ఒకరి జుట్టొకరు పట్టుకునారు గుడ్డలు నలిగిపోతున్నయ్ నోటికొచ్చిన దుర్భాషలన్నీ ఆడుతున్నారు ఆయాస పడుతున్నారు రొప్పుతున్నారు క్రింద పడుతున్నారు—లేస్తున్నారు.

కాస్సేపటికి జనం ఇద్దర్నీ విడదీసి "వూరుకోండి వూరుకోండి" అని ముకుందాన్ని బయటకు పంపే ఏర్పాట్లు చేస్తున్నారు కొందరు మురారిని పట్టుకున్నారు మురారి వదిలించుకొని ముకుందం పైకి రాబోయాడు అందరూ కలిసి ముకుందాన్ని బయటకు లాగేశారు మురారి రాబోతే "వుండవయ్యా" అని గసురుకున్నారు

"రారా, రా బయటికి, నీ పని చెప్తాను రారా" అన్నాడు ముకుందం రొప్పుతూ జుట్టు పైకి ఎగదోసుకుంటూ

"పోరా, పోరా రక్తం కళ్ల జూస్తా(నా— ఏమనుకున్నావో" అన్నాడు అంతకన్నా రొప్పుతూ మురారి జనం వారిస్తున్నారు

సాయంపట్టి ముకుందాన్ని వో ప్రక్కకూ, మురారిని వో ప్రక్కకూ నెట్టేశారు—వీధిలోకి మురారిని పట్టుకొని కొందరూ, ముకుందాన్ని పట్టుకుని కొందరూనూ ఇద్దరిమధ్యా అర ఫర్లాంగ దూరం ఉండేట్టు విడదీసేశారు

"అటుపక్క రారా, నీ రక్తం " అంటున్నాడు మురారి

"నీ తల వెయ్యి చెక్కలు చేస్తా(నా నా తడాఖా తెలీదు" అంటున్నాడు ముకుందం

కాఫీహోటలు మధ్యభాగంలో చెమటతో అల్లుకుపోయిన నేలమీద నానిపోయి చివికిపోయిన బిల్లు కాయితం ముక్కలు వచ్చే పోయే జనం కాళ్లక్రింద పడి మరింత నలుగుతున్నై 

ఆమె నిశ్శబ్దంగా కూర్చున్నది కాళిదాసు కొద్ది సేపాగి "నేను మిమ్మల్ని, యీ పిల్లనూ కూడా ఎక్కడో చూశాను ఎంతగా ఆలోచించినా గుర్తు రావటంలేదు" అన్నాడు అతని మాటలు విని ఆమె తలవంచుకుంది ఆమె ముఖం అవమానంతో ఎఱ్ఱబడింది

కాళిదాసు హఠాత్తుగా 'అవును' అను కున్నాడు అతనికి అంతా జ్ఞాపకం వచ్చింది అనాటిరాత్రి కుర్చీలలో, బెంచీలలోచేరి కిళ్ళీలు నములుతూ, సిగిరెట్లు కాలుస్తూ, యీలలు కున్నాడు అతనికి అంతా జ్ఞాపకం వచ్చింది అనాటిరాత్రి కుర్చీలలో, బెంచీలలో చేరి కిళ్ళీలు నములుతూ, సిగిరెట్లు కాలుస్తూ, యీలలు వేస్తున్న ఆ జనసమూహంముందు వారి మెప్పు కోసం సిగ్గూ ఎగ్గూ విడిచి జుగుప్సాకరంగా సినిమా పాటలు పాడుతూ 'నృత్యం' చేసిన వారిలో యీమె ఒకతె ! ఆ పసిపిల్ల కూడా అప్పుడు రంగస్థలం మీదికి వచ్చింది పట్టాభి 'తనతో చదువుకున్నద'ని చెప్పిన యువతి యీమె ఆ జనానికి కావలసిన విధంగా, రంగస్థలంమీద ఆడలేక, వారి మాటలకు అవమానభారంతో క్రుంగిపోయినట్లు కనిపించింది యీమే !

కాళిదాసు మౌనంగా కిటికీలోనుంచి బయటికి చూస్తున్నాడు 'గాలికి విసురుగా వస్తున్న బొగ్గు నలకలు కళ్ళలో పడతాయేమో'నని భయంతో అతడు తల యువతివైపుకు తిప్పి ఆమెవైపు చూసి ఆశ్చర్యపోయాడు ఆమె కళ్ళ నీళ్ళు పెట్టుకుని పిల్ల చుట్టూ ఎడమచేయివేసి కూర్చునివుంది

కాళిదాసు కేమీ అర్థం కాలేదు ఆమె ఒక్క క్షణం ఆగి పమిటకొంగుతో కళ్ళు తుడుచుకుంటూ "ఎక్కడో చూశానన్నారు జ్ఞాపకం వచ్చిందా ? మీరు ఒకనాడు అక్కడికి వచ్చారు. మీవెంట 'పట్టాభి రామారావ'నే ఆయన వున్నారు మీ యిద్దరూ ముందువరుసలో కూర్చునివుండటం వల్లనూ, ఆయన నాకు తెలిసినవారు కావటం వల్లనూ నేను మీ యిద్దర్నీ గమనించాను ఆయన మీ స్నేహితుడనుకుంటాను నేనాయనతో కలిసి చిన్నతనంలో చదువుకున్నాను ఆయన నాకు బాగా గుర్తు ఫోర్తుఫారం చదువుతూ వుండగా ఒక కుర్రవాడు 'భోగందానికి చదువెందుక'ని నాతో అన్నాడని వాడితో దెబ్బలాటకు తయారైనారు మీ యిద్దరినిచూసి ఆనాడు నేను పడిన యాతన అంతా యింతా కాదు రాత్రి అంతా ఏడుస్తూనే గడిపాను ఆయన నన్ను గుర్తుపట్టేవుంటారు అవునా ?" అన్నది

కాళిదాసు "అవును గుర్తుపట్టి మిమ్మల్ని గురించి చెప్పాడు కూడా అతను చాలా బాధపడ్డాడు ప్రస్తుతం నేను పని చేస్తున్న హైస్కూల్లోనే పని చేస్తున్నాడు ఎవరో ఆ డ్యాన్సులు బాగున్నాయని అతనికి చెప్పడంవల్ల మే మానాడు అక్కడికి వచ్చాము అంతకుముందు మాకు వాటిని గురించి ఏమీ తెలీదు" అన్నాడు

ఆమె ఒక్కక్షణం ఆగి "ఆ తర్వాత అక్కడి వారు ఎవరో షావుకారును తీసుకువచ్చారు అతను కోటీశ్వరుడట. 'కోరినంత డబ్బిస్తాడ'ని అన్నారు.

# ధ్రువతార

(22-వ పేజీ తరువాయి)

నేను కాదన్నాను అక్కడ అలా డాన్సుచేసినందుకు రోజూ అయిదు రూపాయలిచ్చేట్టు అంతకుముందు వారితో ఒప్పందం చేసుకున్నాను అక్కడ అంత తక్కువ రకం మనుషులు చేరుతారని నాకు అప్పటి దాకా తెలియదు అప్పటికే మనకు వచ్చిందేదో పాడివినిపిద్దామ'నీ, 'ఆ జనం ఎటువంటివారైతే ఏమ'నీ సమాధానపడ్డాను వారితో 'అటువంటి సంపాదన నా కక్కరలేద'ని చెప్పాను తర్వాత నాలుగు రోజులపాటు వారందరూ నన్ను బలవంతం చేశారు అయినా నేను వినలేదు రాత్రిళ్ళు భయంగా వుండేది 'ఏం ప్రమాదం ముంచుకు వస్తుందో'నని హడలిపోతూవుండేదాన్ని పిల్లను దగ్గర పెట్టుకుని పడుకునేదాన్ని అలా కొన్నాళ్ళు జరిగిన తర్వాత ఒకనాడు నన్ను పిలిచి "నువ్వు మాకు పనికిరావు జనం అంతా నిన్ను చూసి అసహ్యించుకుంటున్నార'ని చెప్పి, నన్ను వెళ్ళిపొమ్మన్నారు నాకు రావలసిన డబ్బు యిచ్చేయమని అడిగాను 'నీకింక ఏమీ యివ్వనక్కరలేద'న్నారు నా దగ్గర ఒక అయిదు రూపాయలనోటు మాత్రం మిగిలి వుంది వాళ్ళను ప్రాధేయపడ్డాను లాభంలేక



పోయింది అనాటి మధ్యాహ్నానికల్లా మరొకతెను తీసుకుని వచ్చారు" అన్నది

కాళిదాసు జాలిగా ఆమె వంక చూశాడు. ఆమె మళ్ళీ "అసలు మొదట్లోనే నేను మోసపోయాను అలాంటిచోటికి వెళ్ళటమే తప్పు అయినా అప్పుడంతకంటె మార్గంలేదు ఈ పిల్ల తండ్రి పోయి రెండు సంవత్సరాలవుతున్నది ఆ మహారాజు వున్నంతో గౌరవించేవారు ఆయన భార్య మహాసాధ్వి ఆమెను నే నెప్పుడూ చూడలేదు ఆమె ఫోటో మాత్రం ఆయింట్లో వుండేది దేవత లాంటి భార్యను పోగొట్టుకుని ఆయన నా దగ్గరికి వచ్చారు అప్పు డాయనను చూసి ఆయన ఎన్నాళ్ళో బ్రతకడని అనుకున్నాను అప్పటివరకూ నాయింటి చాయలకైనా ఎవర్నీ రానిచ్చేదాన్నికాదు మెట్రిక్ పరీక్షకు చదువుకుంటూ వుండేదాన్ని ఆయన ఆ దుఃఖభారంతో వొస్తూవుంటే అభ్యంతరం చెప్పలేకపోయాను తర్వాత ఆయన "నాకు జీవంపోసి చావబోతున్నవాణ్ణి బ్రతికించావు నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించుకుంటాను" అంటూ వుండేవారు తర్వాత ఈ పిల్లను జ్ఞాపకంగా మిగిల్చి ఆయన రెండేళ్ళక్రితం " అంటూ మొహం తిప్పుకుని కళ్ళు తుడుచుకుంది

కాళిదాసు నిశ్శబ్దంగా వింటూ కూర్చున్నాడు బండి అక్కడక్కడ ఆగుతూ వెంటనే బయలుదేరుతూ విర్విరామంగా పరుగెత్తిపోతున్నది.

ఆమె పిల్లను వొళ్లో పడుకోబెట్టుకుని మళ్ళీ "ఆయన చనిపోతూ మిగిల్చిపోయిన డబ్బుతో కొన్ని బాకీలు తీర్చి కొన్నాళ్ళు గడిపాను నాకొక దూరపు పినతండ్రి వున్నాడు ఆయన స్వగ్రామంలో రెండెకరాల భూమిని దగ్గరవుండి సేద్యం చేయించుకుంటూ, నన్ను కూడా వచ్చి తనదగ్గరే వుండిపొమ్మని వ్రాశాడు నేను ఎందుకూ కొరగాని నా కొద్దిపాటి చదువునూ, సంగీతాన్ని ఆసరాగా చూసుకుని స్వతంత్రంగా జీవించాలని ఏదో పిచ్చిపిచ్చి వూహలకు లొంగిపోయాను కాని యిప్పుడు బాగా తెలిసివచ్చింది ఇప్పుడు మా పినతండ్రి దగ్గరికే వెళ్ళిపోతున్నాను" అన్నది

ఏదో స్టేషనులో బండి ఆగిన తర్వాత ఆ చిన్నపిల్ల "ఏదైనా కొనిపెట్టమ"ని అల్లరిచేస్తే కాళిదాసు దిగివెళ్ళి బిస్కెట్లుకొని తీసుకు వచ్చాడు మళ్ళీ రైలు కదిలింది

ఆమె "ఈ పసిపిల్ల మాత్రం నాకు మిగిలింది ఇది అటువంటి వాతావరణంలో మరికొంతకాలం వుంటే ఎలా పాడైపోతుందోనని తలుచుకుని భయపడ్డాను ఆడదానికి సహజంగా వుండవలసిన సర్వ లక్షణాలూ వొదులుకొని అక్కడి వారికి కావలసినట్లు మెలిగితే తప్ప ఆ అయిదు రూపాయల సంపాదనా వుండదు అయినా నాకలా చెయ్యటం యిష్టంలేదు అంతగా కానిరోజువస్తే యీ పిల్ల గొంతు నులిమి ఏ నూతిలోనన్నా పారెయ్యటమన్నా నాకంత కష్టం వుండదు కాని అన్నీ వదులుకొని అంతమందిచూసే విషపు చూపులను భరిస్తూ, అన్ని అవమానాలనూ సహిస్తూ బ్రతకటంకంటె చావటం చాలా నయం అంతకంటె ఆడదానికి ఘోరయాతన మరొకటి వుండదు. ఇలా మాన మర్యాదలకు తిలోదకాలిచ్చి ఎందరు ఆడవాళ్ళు తమను తాము చంపుకుంటూ, మగవారిని చంపుతున్నారో మీకు తెలియదు ఇలా కుక్కమూతిపిందెలువేసే పాదు వట్టిపోయేందుకు ఎంతోకాలం పట్టదు" అన్నది

కాళిదాసు నివ్వెరపోయాడు ఈమె చదువుకున్నది తెలివిగా ఆలోచిస్తుంది అద్భుతంగా మాట్లాడుతుంది అతడు తల పంకించి "అవును ఈమె అద్భుతమైన స్త్రీ" అనుకున్నాడు.

అతడు నిట్టూర్చి "మీ కథ చిత్రంగావుంది మళ్ళీ కలుసుకున్నప్పుడు పట్టాభికి యీ విషయాలన్నీ చెబుతాను" అన్నాడు

ఆ తర్వాత చాలాసేపు యిద్దరూ మాట్లాడలేదు ఆ పిల్ల తల్లి వొడిలో తల పెట్టుకుని పడుకుని నిద్రపోయింది కూతురివంక చూస్తూ ఆ తల్లి అలాగే నిశ్శబ్దంగా కూర్చునివుంది కాళిదాసు కళ్ళు మూసుకుని వెనక్కు ఆనుకుని కూర్చునివున్నాడు బండి అప్పుడప్పుడు కూత వేస్తూ ఆ నిశ్శబ్ద నిశీధిలో పరిగెత్తిపోతున్నది

ఎంతసేపు గడిచిందో తెలియదు ఎవరో తట్టి లేపినట్టయి కాళిదాసు ఉలికిపడి కళ్ళు తెరిచి చూశాడు ఎవరో ఒక వ్యక్తి "కాస్త జరగండి సార్ కిటికీ పక్కన కూర్చుని చుట్ట కాల్చుకుంటాను" అంటున్నాడు కాళిదాసు యువతలికి జరిగి చుట్టూ చూశాడు ఆపిల్లా తల్లీ అక్కడ లేరు అతడు కిటికీలోనుంచి వొంగి స్టేషను పేరు

పోశాడు వారు దిగవలసిన స్టేషను వెనకబడి పోయింది వాళ్ళిద్దరూ దిగిపోయివుంటారు

రైలు మళ్ళీ కూతవేసి బయలుదేరింది కాళి దాసు దిగవలసిన స్టేషనుకు మరో అరగంట మాత్రమే ప్రయాణం అతడు మళ్ళీ కిటికీ వైపు జరిగి కూర్చున్నాడు చల్లనిగాలి వేగంగా వీస్తున్నది తూర్పుదిక్కు కొద్దిగా తెల్లబడు తున్నది క్రమంగా వెనకబడిపోతున్న ఆ వూళ్లో కొన్ని పూరిపాకలలోనుంచి అప్పుడే పొగ సుళ్ళు సుళ్ళుగా పైకి లేస్తున్నది ఏదో వంతెనమీదుగా బండి పోతున్నది

తను దిగవలసిన స్టేషనులో బండి ఆగగానే కాళిదాసు తన సూట్‌కేస్ చేతిలోకి తీసుకుని క్రిందికి దిగాడు అది చాలా చిన్న స్టేషను ఒక స్టేషను మాష్టరూ యిద్దరు ముగ్గురు పోర్టర్లూ, తప్ప అక్కడ మరెవరూ లేరు ఆ రైల్లోనుంచి కాళిదాసుతోబాటు మరి యిద్దరు వ్యక్తులు మాత్రమే ఏవో మూటలతో అక్కడ దిగారు

కాళిదాసు టిక్కెట్టుయిచ్చి బయటికి వచ్చాడు ఎదురుగా కనుచూపుమేర అంతా పొలాలు స్టేషను వెనకగావున్న మర్రిచెట్టు శాఖలలో పక్షులు రొద చేస్తున్నాయి అక్కడినుంచి దాదాపు అరుమైళ్ళు నడిచిపోతేనేగాని అతడు వెళ్ళవలసిన వూరు రాదు మునుపు అత డిక్కడికి వచ్చినప్పుడు ఒంటెద్దు బండ్లు రెండో మూడో వున్నట్టు గుర్తు ఇప్పుడవి కూడా లేవు అతనితో బాటు దిగిన వారెవరో మాట్లాడుకుంటూ భుజాలమీద మూటలతో మరోవైపు నడిచి పోతున్నారు

కాళిదాసు నడవటం ప్రారంభించాడు గాలిలో తేమ ఎక్కువగా వుంది ఇంకా ఎండలు ముదిరి నట్టులేదు అక్కడక్కడ గడ్డి మొక్కలమీద మంచుబిందువులు పడివుండి, కొద్దికొద్దిగా వ్యాపిస్తున్న వెలుగులో మెరుస్తున్నాయి అది సన్నని ఎర్రమట్టిబాట బాట కటూ యిటూ తుమ్మచెట్ల క్రింద బంగారం ముక్కలుగా కొట్టి పోసినట్టు పువ్వులు రాలివున్నాయి దూరంగా మేఘా లలో ఒక పెద్ద డేగ తీవిగా ఎగిరి పోతున్నది.

అతడు ఊరు చేరుకునేసరికి ఎండలో చురుకు పాలు ఎక్కువైంది వీథుల్లో అక్కడక్కడ కొంత మంది, ఫళ్ళసందున వేపపుల్లలతో 'ఎవరీ కొత్త మనిషి ?' అని పరకాయించిచూసి మళ్ళీ తలలు తిప్పుకుంటున్నారు ఇళ్ళముందు రక రకాల ముగ్గు లున్నాయి ఒక మట్టి గోడల యింట్లో ఎవరూ కాపురం వుండటంలేదు కాబోలు, పాడుబడి వుంది ఆయింటి గోడలమన్నంతా కరిగి క్రిందికి జారిపోయింది మొండిగావున్న గోడలమీద ఏవో మొక్కలు మొలిచివున్నాయి ఆవరణలో జిల్లేడు చెట్లూ, ఉమ్మెత్తచెట్లూ మొలిచివున్నాయి

కాళిదాసు వూరి చివరగావున్న పెంకుటింటి ముందు నిలబడ్డాడు ఆ వాకిట్లో పెద్ద రథం ముగ్గు వుంది ఆవరణలో ఒక ప్రక్క ధాన్యపు పాతర వుంది అతడు నెమ్మదిగా లోపలికి నడి చాడు (సశేషం)

---

## మా నాటకం

(17-వ పేజీ తరువాయి)

అనడం తప్పే"

"ఒరేయ్ అప్పన్నా ! ఒక్క నిమిషం రోలు వేస్తూ నీకింత పొగరు పనికిరాదురా" అంటూ మందలించాడు శ్రీధర్

ఆ మాటతో మళ్ళీ ఏం గొడవ ముంచుకొస్తుందో నని నా భయం గదికి ఒక మూలగా ఉన్న ఓ బల్ల మీదకు చెంగున ఎగిరి చిన్న ఉపన్యాసం దంచేశాను

"ఓ ప్రకృతి నాటక సమాజ శాశ్వత సభ్యులారా! నా మొర వినండి ఇది ప్రఖ్యాత నాటక రచయిత సుబ్బారాయుడు రచించిన 'దేశంకోసం' అనే నాటక మని మీకందరకూ తెలుసును—"

"ఏమిట్రా యీ సొద ?' అంటున్నాడు శ్రీధర్ నేనదేమీ పట్టించుకునేరకం కాదులెండి

"మీకు తెలియదనికాదు నా అనుమానం నాటక రచయిత అసలుద్దేశ్యం ఏమిటో మీకు తెలి యదని నా దృఢ విశ్వాసం, దేశక్షేమాన్ని ఎలా భద్రపరుచుకోవాలో తెలియజెప్తుంది ఈ నాటకం నిద్రపోతున్న దేశ భక్తుల హృదయాలను మేలుకొలుపు పాడి సుబ్బరాయుడు స్టేజి ప్రవేశం చేస్తాడు ఆ మేలుకొలుపుతో నాటకం మొదలవుతుంది—"

"ఇదంతా ఎవరికి తెలియని గోలరా ? మా కందరికీ తెలుసు బాబూ ! ఎందుకీ ఉపోద్ఘాతం ? అంతా చెప్పాక మమ్మల్ని గొడవ చెయ్యొద్దం టావ్ అంతేగా ?" నేను చెప్పబోయేదేమిటో సరిగ్గా ఊహించాడు భద్రం కాని—నేను డైర క్టర్ని

"ఆ మేలుకొలుపుపాట అయ్యాక రాజారావుగా మధు నిద్ర మేల్కొంటాడు ఇలా మొదటి సీను ప్రారంభమై నవరసభరితమైన నాటకానికి అంకురార్పణ జరుగుతుంది రెండో సీనులో దేశ భక్తులిద్దరూ కలుసుకుని మాట్లాడుకుంటారు, నేతాజీ విప్లవ సంఘంలో చేరటమా వద్దా అని

"మూడోసీనులో ఇద్దరూ నేతాజీతో చేరి, దేశస్వాతంత్ర్యంకోసం పోరాటం మొదలు పెడ తారు దాంతోపాటు మధు అంజనేయుల్ని ప్రేమి స్తాడు—"

"ఆహాహా—ఏంకథరా—అద్భుతం—' ఆవులిస్తూ అన్నాడు భద్రం

"ఒరే డైరక్టరూ ! ఆదేంటిరా—పాత్రల పేర్లలో చెప్పక యిదేంపనిరా ? నన్ను వాడు ప్రేమిస్తాడా ?"—అంజనేయులి ఘోష

"ఉష్ గొడవచెయ్యక నువ్వు కానీరా—" ప్రోత్సహించాడు శ్రీధర్

"నాలుగో సీనులో ఉషారాణిని ప్రేమించిన రాజా రావు వో దరిద్రుడుగా ! అందుకని ఆమె తిరస్క రించి లెంప పగలకొడుతుంది నిజంగా కొట్ట దులే చెయ్యి అలా అతని బుగ్గమీద ఆనించగానే తెర వెనకాల శబ్దం చేస్తాం అప్పుడు రాజా రావుకు కోపం వస్తుంది—తిరిగి ఆమెను కొడ తాడు—"

మధు కంగారుపడ్డాడు "ఒరే కృష్ణా ! అది డ్రామాలో లేందే ?"

"ఏది" అనడిగా

"అదేరా—నన్ను ఉషారాణి కొట్టినట్లుగా—"

నేను చిన్నగా—చిలిపిగా నవ్వాను "నువ్వు వాడ్ని మరి—గట్టిగా కొట్టేస్తే వాడికి కోపం రాదూ — అందుకని వాడే నిన్ను ముందుగా కొడ తాడు—"

"ఒరేయ్ నీయిష్టమేనా నాటకాన్ని మార్చ డానికి—రచయిత వప్పుకోవద్దూ ?" మధు గట్టిగా అడిగాడు

"మధూ ! కృష్ణ ఎలా మారిస్తే అలాగే నా అభ్యంతరం ఏమీలేదు" అన్నాడు సుబ్బా రాయుడు నావంక చూస్తూ

"అవునే అభ్యంతర మెలావుంటుందిలే ఇదో నాటకమైతే బాధపడతావు గానీ—" అన్నాడు అప్పన్న మొహం చాటవేస్తూ

బడలికగా వచ్చి నడుం వాల్చాడు కొంచెం కళ్ళు మూసాడో లేదో—గభాల్ను సుబ్బారాయుడు లోపల కొచ్చాడు ప్రక్కగదిలోంచి

"అబ్బబ్బ—అంత తొందరగా రాకూడదురా నెమ్మదిగా లోపలికొచ్చి ఆవేశం తెచ్చుకోవాలి పడుకున్న మధుగాడి మొహంలోకిచూసి, కమ్మగా వన్నటి గొంతుతో మేలుకొలుపుగా పాడాలి —"

"ఒరే డైరక్టరుగారూ ! నువ్వెంత డైరక్టర వైనా మరీ యింతగా లేతగా కొయ్యగూడదురా కోతలు—"అన్న అప్పన్నకేసి చూసాను

"ఏం ?" అన్నా

"వాడిది అసలే గార్దభస్వరం—దానికితోడు నెమ్మదిగా కమ్మగా హాహా ఆ—యిహ ఆడియన్స్ హాల్లో కూర్చున్నట్టే—"

"ఒరేయ్ అప్పిగా నాది గాడిదగొంతా—' కాలరు పైకి లాగుతూ సుబ్బారాయుడ్ని అడిగాడు

"గాడిదగొంతని నేనవలేదు"

"మరి—యిప్పుడు కూసిన కూతేమిటి ?"

"గార్దభస్వరం అన్నాను"

"అదే—ఎందుకన్నావని అడుగుతూంట—"

నాకు తల తిరిగిపోతోంది గిరగిరా యిందంతా చూస్తే ఓ కుర్చీలో కూలబడ్డాను—తల పట్టు కుని

"నా ఖర్మరాబాబూ—మీతో నాటకం వేయించా లనుకోవడం నిమిష నిమిషానికి యిలా ఎవరో ఒకరు కొట్టుకుంటూవుంటే మనం నాటకం వేసినట్లే ఒరేయ్ సుబ్బిగా ! ఆ వెధవ అన్నాడే అనుకో—నువ్వు వాడి మాటలన్నీ పట్టించుకోవా లనుందా—చెప్పు "

ఆంజనేయులు తన కాలి చెప్పుతీసి నా చేతిలో పెట్టాడు

"ఇదేమిట్రా" అంటూ విస్తుపోయాను

"ఒరేయ్—చెప్పు అడిగావు కదరా—"

అందరూ గొల్లున నవ్వారు అప్పన్న తల దించు కున్నాడు

"నాది తప్పే కృష్ణా ! వాడిది గార్దభస్వరం

"అప్పుడు అతను—అంటే రాజారావన్న మాట—ఏడుస్తూ వెళ్ళిపోతాడు—"

"ఛీ ఛీ ఛీ ఎక్కడైనా విలన్ ఏడుస్తాడా ?" అంటూ అంకెళ్ళు నొక్కుకున్నాడు శ్రీధర్

"ఏడుస్తాడు లేవోయ్ రచయిత ఏడిపిస్తే ఏడవాలి నవ్వమంటే నవ్వాలి తెలిసిందా ?" అన్నాడు సుబ్బారాయుడు కాలర్ విప్పదీస్తూ

"అయిదో సీనులో ఆ అమ్మాయి సుబ్బరాయుడితో—అంటే—ఉషారాణి సునీల్‌తో మాట్లాడుతుంది ఇద్దరూ పెళ్ళి చేసుకోడానికి నిశ్చయించుకుంటూ మాట్లాడుకుంటారు ఇక—ఆఖరిసీనులో మధూను అరెస్టుచేసి తీసుకుపోవడానికి యిన్స్పెక్టర్ వేషంలో అప్పన్న ప్రవేశిస్తాడు మధు కడుపుబ్బరం పట్టలేక ఓ రెండు పేజీల డైలాగు చెప్పి అరెస్టవుతాడు ఆరోజునే మనకు స్వాతంత్ర్యం వచ్చినట్లు మాట్లాడుకుంటారు సుబ్బారాయుడ్ని ఆంజనేయులూనూ మధూ చేసిన త్యాగాన్ని అర్థం చేసుకుంటాడు సుబ్బారాయుడు"

'ఇదీ నాటకంయొక్క జిస్టు !' అని ముగించాడు శ్రీధర్ నా ఉపన్యాసాన్ని నేను దాంతో ఆపకోక తప్పలేదు

"ఇందులో మధు చేసిన త్యాగమేమున్నదిరా ?" ప్రశ్నించాడు అంజి

"ఉంది లేవోయ్ స్వాతంత్ర్యంవచ్చినా కూడా జైలుకెళ్ళడం త్యాగం కాదూ ? ఉషారాణితో మన వాడి పెళ్ళి కావడానికి అవకాశం కల్పించిన మధు త్యాగం చేసినట్లవలేదూ ?" అని శ్రీధరనగానే అందరూ ఘొల్లున నవ్వారు

"అవునుగానీ—డైరెక్టరూ ! ఆ మధూ రెండు పేజీల డైలాగు చెప్తున్నప్పుడు నేను ఏం చేస్తూ వుండాలిరా ? భజన చెయ్యాలా—" అప్పన్న కోపంగా అడిగాడు

"నువ్వేమీ భయపడకు వాడెలాగో స్టేజి మీది కెళ్ళేసరికి కొంత మరిచిపోతాడు యిహ చెప్పేది ఓ అర పేజీ వుంటుంది ఆకాస్తసేపైనా స్టేజిమీద నిల్చోలేకపోతే ఎందుకురా నీ నటన—తగలెయ్యనా?' అన్నా

"అదికాదురా నాకిదే మొదలు కదరా నాటకాల్లో ఎప్పుడూ వెయ్యలేదాయె అందుకని—అనుమానం వచ్చి—ఎందుకైనా మంచిదని అడుగుతూంటే—" నీళ్ళు నమిలాడు అప్పన్న నాకు కూడా నిజంగానే ఏం చేయాలో తోచలేదు

"మరేంచేస్తావ్ ?' అనడిగా

"కుర్చీలో కూర్చునేదా ?"

'ఛా వాడంతగా కళ్ళు చిట్లించి నుదురు కొగలగొట్టుకుని కష్టపడి మాట్లాడుతూంటే నువ్వు దర్జాగా కూర్చుంటావా ? నువ్ ఫీలింగ్సు చూపిస్తూ, నిల్చునే వుండాలి" అని చెప్పా

"ఒరేయ్ ఒక చిన్నపాత్ర గురించి యింత కష్టం ఎందుకురా ? వాడెట్లా తగలేసినా ఫర్వాలేదు మొదటి నాలుగు సీన్లూ చూసేప్పటికీ ఆడియన్స్ ఒకరో యిద్దరో మిగిలినా—ఎలాగూ నాటకం అయిపోవచ్చింది గనుక వాళ్ళేమీ బాధ

# మా నాటకం

పడరు"—శ్రీధర్

సుబ్బారాయుడు మొహం చిన్నబుచ్చుకున్నాడు "మీరంతా కలిసి నా నాటకాన్ని ఖూనీ చేసేట్టున్నారు యిదంతా చూస్తే ! నా నవ నాడుల్లోంచి ప్రవహిస్తున్న కవిత్వావేశమే నన్నీ నాటక రచనకు ప్రోత్సహించింది నా హృదయంలో ఓ మూల ప్రవేశించి మొత్తాన్నే ఆక్రమించేసుకున్న ఆ అమ్మాయి—అరుణాదేవి నా నాటకం చూస్తుందనేగదా ఈ అవస్థంతానూ నేను నటించిన పాత్రను ప్రేమించి తద్వారా నాకు సానుభూతి చూపుతుంది ఆసానుభూతి కొన్ని రోజులకు పరిణయంగా—ప్రణయంగా మారి—"

వాడింకా ఏమో చెప్పబోతూండగానే అంతా

---

తన ఇంటిలో ఉన్న రోగి కోసం ఆంబులెన్స తెచ్చేందుకు ఒకాయన ఆస్పత్రికి వెళ్ళి, డాక్టరుతో "అయ్యా, మా ఇంట్లో రోగి చాల బాధపడుచున్నాడు. ఆంబులెన్సును త్వరగా పంపండి" అన్నాడు

డాక్టరు-ఆంబులెన్స మరియొక రోగిని తేవడానికి వెళ్లింది.

అతడు కొంత సేపు కూర్చొని చప్రాసీతో "ఏమయ్యా ఆంబులెన్సు ఇంతవరకు రాలేదా?"

చప్రాసీ-మా అయ్యగారు కూరగాయలు తేవడానికి బజారుకు పంపాడండి.

ఆకుదారి రాజు (లాలాగుడ)

---

'ఐ సీ ' అన్నారు ఆవులిస్తూ నేను చిరునవ్వు నవ్వా

"ఒరేయ్ సుబ్బా ! తప్పు అంటున్నావురా ప్రణయం పరిణయంగా మారి—అవాలి" తప్పు పట్టాడు శ్రీధర్

"అవునులేరా ప్రణయం పరిణయంగామారి మేం హనీమూన్‌కు బయలుదేరిన రోజున మీ అందరకూ ఓ బ్రహ్మాండమైన డిన్నర్‌పార్టీ—

అందరూ 'ఓకే' అన్నారు వాడి ప్రణయం గురించి తెలియనివారు ఎవరూలేరు అందరూ ఒప్పుకున్నారు—వాడితో సహకరించడానికి అప్పన్నకో అనుమానం వచ్చింది

"ఒరే సుబ్బా అంతా బాగుందికానీ—ఒకవేళ డ్రామా ఫెయిల్ అయిందే అనుకో—అప్పుడేమవుతుంది ?"

"ఛా—అపశకునం పలకబోకురా ! ఈ డ్రామా చెడిపోతే అందుక్కారణం మనచాతకానితనమే కనుక, మన శక్తిసామర్థ్యాలు నిరూపించుకుని దీన్ని ఒక బ్రహ్మాండమైన కళాఖండంగా తయారు చేయాలి" అన్నాను

"ఏమిటీ — ఖండంగానా ? అంటే ముక్కలు ముక్కలుగా చేయడమా—" అమాయకంగా అడిగాడు భద్రం

"ఒరేయ్—ఈ రాత్రికి సెలవు పుచ్చుకుందాం గానీ—రేపట్నుంచి రిహార్సల్సు చాలా సీరియస్‌గా సాగాలి ఏమంటారు ?" అనడిగా, అందరి మొహాల్లోకి చూస్తూ అందరూ యిష్టపడ్డారు యిళ్ళకు పోవడానికి

*   *   *

మర్నాడు

కాలేజీమెట్లపై వయ్యారంగా నడుచుకుంటూ రెండో అంతస్థుకొచ్చింది మిస్ అరుణాదేవి సుబ్బారాయుడు టిప్‌టాప్‌గా తయారై ఎదురు పడ్డాడు

"హల్లో—మిషర్ రాయుడూ" అంటూ ఆమే పలకరించింది నేను వరండా చివర్న నిల్చొని ఆశ్చర్యపోయాను కళ్ళు నులుముకుని చూశా అవును—అరుణాదేవి సుబ్బరాయుడ్ని పలకరించింది

ఆ అమ్మాయి కళ్ళజోడు, వెనుకనున్న కళ్ళు చిలిపిగా నవ్వాయి అరుణ బంగారుతీగెలా వుంటుంది ఎర్రగా మెరుస్తున్న ఆమె పెదిమల్ని, నిగనిగలాడుతున్న ఆమె చెక్కిళ్ళను చూసే ఆమె కాపేరు పెట్టుంటారు

కొంతసేపటివరకూ మాట్లాడలేకపోయాడు, సుబ్బా నేనిదంతా పరికించి చూస్తున్నా వాడు బుర్ర గోక్కున్నాడు ఏమనాలో తెలియక

వాడి అవస్థ చూస్తుంటే ఆమెకు నవ్వాగలేదు పకపకా నవ్వేస్తూ, "రాయుడుగారూ, నమస్తే—" అంది

అప్పటికిగానీ మావాడు ఈ లోకంలోకి ఊడి రాలేకపోయాడు "ఆ—నమస్తే అరుణాదేవీ ! ఏమిటి—' అనడిగాడు తనేమిటంటున్నాడో తనకే తెలియక

"మీరు 'కల్చరల్ వీక్సుకు' నాటకం వేస్తున్నారటగా ?" అనడిగింది

"అవునండీ ! మీ కెవరు చెప్పారు ?"

"ఆ నాటకం మీరే వ్రాశారటగా చాలా బావుందని చెప్పాడు మా తమ్ముడు"

"మీ తమ్ముడా ! ఎవరది ?"

"పి యు సి చదువుతున్నాడండి పేరు మురళీ రోజూ మీ రిహార్సల్సు చూస్తూనే వున్నాట్ట మీ నాటకం ఏ రోజున వేస్తారు ?"

"ఏమోనండి ఇంకా ప్రోగ్రాం సెటిల్ కాలేదు"

ఏదో విధంగా వాడితో మాట్లాడడానికి ఆమె ప్రయత్నిస్తూవుంటుందని నాకు తెలియతలేదు ఆమె హృదయంలోనూ వాడంటే కొంత

ప్రేమ ఉన్నట్లు నాకు తెలియకపోదు అందుకనే వాడు అడగ్గానే 'ఊ' కొట్టాను వాడు ఎలాగూ జయిస్తాడు గనుక—యిలా చేస్తే నాకు కూడా కొంత పేరొస్తుందిగా—అందుకని డ్రామా డైరెక్టు చేయడానికి వప్పుకున్నాను

ఆ అమ్మాయి వెళ్ళిపోయింది నేను ఆలోచన ల్లోంచి తేరుకునేలోపున, సుబ్బారాయుడు మురిసి పోతూ నా దగ్గర కొచ్చాడు

ఆరాత్రి రిహార్సల్సు సీరియస్‌గా ప్రారం భించాం మిగతా నాటకాలన్నింటినీ దెబ్బ కొట్టా లని మా వూహ

" ఈ దీనుడ్ని కనికరించి కరు ణతో నా ప్రేమను స్వీకరించు" అన్నాక—

"ఒరేయ్—కృష్ణ వీడ్ని చూస్తూ చూస్తూ అందమైన మొహం అని ఎలా అన్రా ?" అంటూ దీనంగా మొహంపెట్టాడు మధు

"ఎప్పుడూ యిదే గోల్రా ? వాడి మొహం వంక చూడక దీపం వంక చూస్తూ అనేసెయ్" అని సలహా యిచ్చా

"ఒరే డైరక్టరూ నన్ను దీపంతో పోలుస్తావ్రా—" ఆంజనేయులు గొడవపెట్టాడు

"నీకే మంచిదికదరా దీపంలాగా జిగ్గున వెలిగి పోతోందన్నారు డైరక్టరుగారు — నీ నిగ్రో మొహాన్ని ఇంతకన్నా నీకింకేం కావాలి ?"— శ్రీధర్

"ఇటువంటి చిన్న చిన్న గొడవలొద్దని ఎన్ని సార్లు చెప్పాలిరా మీకు—" నామాట వినిపించు కున్నారంతా

"ఊఁ ఏదీ—మధూ!! మళ్ళీ అను—"

"ఏదీ—ఆ డైలాగే ! ! నే చచ్చినా అనను రిహార్సల్సులో యిక ఆ డైలాగొద్దు స్టేజిమీద అంటాలే—"

"ఒరే మధూ! నోరుమూసుకు అనరా ! ఎదురు చెప్పావంటే తంతా !" అన్నాను లేనికోపం తెచ్చు కుంటూ.

"అంటానుగానీ — యిటువంటి డైలాగు యిక్కడ అనవసరం అనిపిస్తోందిరా అసలు సీనే బాగా లేదనుకో నేను విలన్నో హీరోనో సైడ్ హీరోనో అర్థం గాకుండా ఎలా ఏక్టు చేసే దిరా ?" అనడిగాడు మధు నెత్తిన కొట్టు కుంటూ

నేనేదో చెప్పాను వాడు తలూపాడు సంతృప్తిగా మొత్తానికి యిలాగే చిన్న చిన్న గొడ వల్తో రిహార్సల్సు పూర్తయినాయి రేపు డ్రామా అనగా హడావిడిగా పరిగెత్తుకొచ్చాడు శ్రీధర్ కంగారుగా చెప్పాడిలా

"ఒరేయ్ ఉన్నట్టుండి అకస్మాత్తుగా మధు గాడి గొంతు గాడిద గొంతులా తయారైందిరా— ఇప్పుడెట్లా ?"

నేను ఆశ్చర్యపోయాను "రాత్రి బాగానేవుంది కదరా గొంతు ?"

"అవున్రా కాని—ఆ అప్పన్నగాడులేడూ— వాడు మధూను పొద్దున హొటలుకు తీసు కెళ్ళాట్ట. తెగ తినిపించాట్ట దాంతో వాడి గొంతు కాస్తా పూడుకుపోయింది—"

"అయితే—ఫర్వాలేదులే దానిదేముంది—తిన్నది అరగ్గానే మామూలుగా వచ్చేస్తుంది గొంతు" అని చెప్పా వాడు నిజమే కామోసు అనుకున్నా డల్లేవుంది—వెళ్ళిపోయాడు

* * *

మర్నాడు

గ్రీన్ రూంలో చాలా హడావిడిగా వుంది ఎవరిడ్రెస్సు వాళ్ళు తెచ్చుకోవాలని నేను ముందే చెప్పినా ఆంజనేయులు ఏడుపు మొహం పెట్టుకునొచ్చాడు చీర దొరికిందిగానీ, జాకెట్టు దొరకలేదన్నాడు వెంటనే కాలేజీలోకల్లా 'లావెస్టు' అమ్మాయి నిర్మల దగ్గరకు పరిగెత్తుకెళ్ళి—

ఓ ఉపన్యాసకుడు నిలపకుండా రెండు గంటలనుండి ఉపన్య సిస్తున్నాడు. ఒకడు సోడా బాటిల్‌ను ఉపన్యాసకుడి దగ్గరకు తీసుకపోయి "సార్" అన్నాడు. ఉపన్యసిస్తున్న ఆ పెద్దమనిషి తన ఉపన్యాసాన్ని ఆపిన వారెవరో అనుకుంటూ వెనక్కు తిరిగాడు "చాలా సేపు ఉపన్యసించారు ఈసోడా తీసు కోండి" అన్నాడతను. ఉపన్యాస కుడు కొంచెం నవ్వి "క్షమించండి నాకునాల్గుగంటల సేపు ఉపన్య సించిన తరువాత కాని దాహ మెయ్యదు" అంటూ తన ఉపన్యాసాన్ని మళ్ళీ మొదలు పెట్టాడు.

గాడిచర్ల నాగరాజరావు (తిరుపతి)

నేను డ్రమటిక్ అసోసియేషన్ తరఫున పని చేస్తున్నాను కనుక—ఆ అమ్మాయి జాకెట్లలో కల్లా ఓ పెద్ద సైజుది—అర్థించాను ఆ అమ్మాయి చాలా మంచిది వెంటనే యింటికి కబురు పంపించి— ఒక వెల్వెటు జాకెట్టు మాకు తెప్పి చి యిచ్చింది

మావాడు—ఆంజనేయులు మురిసిపోతూ ఆ జాకెట్టు తొడుక్కున్నాడు కాని—జబ్బల దగ్గిర మాత్రం కొంచెం యిరుకుగావుంది చెయ్యి పైకెత్తొద్దని వెయ్యిసార్లు అయినా చెప్పుంటాను వాడు ఒకరిమాట వినేరకం అయితే—వాడికి ఆ పేరెందుకు పెడతారు !

బెల్లు మ్రోగింది

ఇంతలోకి హడవిడిగా పరిగెత్తుకొచ్చాడు సుబ్బ రాయుడు చిన్న రాకెన్‌రోల్ డ్యాన్సులాటిది వోటి చేసేసి అన్నాడిలా

"ఒరే కిట్టూ — యింకేముందిరా — ఆ అమ్మాయి వచ్చింది ! అరుణ ఎర్రని చీరకట్టు కుని ఎంత ముచ్చటగా వుందనుకున్నావ్ నా పాత్రను చూడు—దంచేస్తాను బ్రహ్మాండంగా పాడే స్తాను చూస్కో యిక—"

అన్నాడేగాని స్టేజిమీద వణుకుతాడేమోనని భయం వేసింది

తెర ఎత్తగానే—

సుబ్బారాయుడ్ని రంగంమీదకు త్రోశాం

నిద్ర నటిస్తున్న మధూ దగ్గరగా వెళ్ళాడు. ఆడియన్సంతా సస్పెన్సులో మునిగిచచ్చినంత పని చేశారు వాడు ఎంత సేపటికి పాట మొదలెట్టడే! దిక్కులు చూడటం ప్రారంభించాడు కాళ్ళు వణుకుతున్నాయేమో — కుర్చీలో కూలవడ్డాడు

ఇలా ఆలస్యంచేస్తే ఆ మధూ నిజంగానే నిద్ర పోయేట్టున్నాడు కొంచెం గట్టిగానే ప్రాంప్టు చేశాను "పాడరా — ఒరే సుబ్బిగా —" అన్న నా మాటలు మైక్‌లో వినపడ్డాయి

ఇంకేం—జనంలో ఒకటేగోల. నవ్వులూ పెడ బొబ్బలూనూ

వాడికి పౌరుషం వచ్చింది నోరు విప్పబోయేం తలో నిద్రనటిస్తున్న మధు మెలకువ వచ్చి నట్లు నటించి లేచి కూర్చున్నాడు 'ఏమిట్రా యిలా వచ్చావ్' అనడిగాడు వాడి గొంతు బాగానే వుంది కొంచెం గరగరమంటున్నా

ముత్యంలాంటిపాట పోయినందుకు సుబ్బా రాయుడు తెగ బాధపడ్డాడు ఆ ఫీలింగ్సు అన్నీ ఎందుకో ప్రజలకర్థం కాలేదు

"ఒరే—మధూ పడుకోరా—పాట పాడ తానూ' అనేశాడు సుబ్బా

నా కడుపులో త్రిప్పింది ఆడియన్సు చప్పట్లు మొదలెట్టారు

మా వాడికి మరింత కంగారు హెచ్చింది

మధూను బలవంతాన పడుకోబెట్టి పాట మొదలెట్టాడు

"నిదరించవోయి ఎదిరించేవేళ—

ఎదురించకోయి నిదిరించేవేళ—. . "

కమ్మగానే పాడాడు కాని .

ప్రజల్లో సముద్రపు ఘోష బయల్దేరింది. కేకలూ పిల్లి అరుపులూ ఎక్కువైనాయి ఛా ఛా పాటను ఖూనీ చేసేసాడు తప్పంతా నాదే— లేకపోతే ఆ వెధవకు పాట పాడమని సలహా యివ్వడమేమిటి ?

ఇహ లాభంలేదనుకుని 'తెర . తెర' అరి చాను

తెరలాగేవాడు—చిన్న కుర్రాడు—ఎంత ప్రయ త్నించినా తెర పడలేదు ప్రాణంలేని త్రాళ్ళు కూడా మా కెదురు తిరిగాయి సమయస్ఫూర్తిగా వర్తించి ఆ కుర్రాడు మమ్మల్ని రక్షించాడు తెరను పట్టుకుని అవతలివైపుకు స్టేజిమీదుగానే పరిగెట్టాడు ఆ కుర్రాడ్ని అభినందించి నేను స్టేజిమీదకు గెంతేప్పటికీ—

మధూ సుబ్బరాయుడులు కొట్టుకుంటున్నారు.

వారి దెబ్బలాటంతా మైక్‌లోంచి పైకి వెళ్తోంది—'మైక్ఆఫ్' అంటూ గట్టిగా అరిచాను కోపంగా నా స్నేహితుడు డిక్సన్‌ను మైక్ సెట్టు దగ్గర అట్టే పెట్టాను యిటువంటి అవసర సమయాల్లో సమయోచితంగా వ్యవహరించడానికి గానూ

వాళ్ళనిద్దర్నీ ఒక పావుగంటలో సర్దుబాటు చేసి, మళ్ళీ తెరఎత్తాం ఇలా తెర ఎత్తామో లేదో అలా గోల బయల్దేరింది—ఆడియన్సులో అయినా బెదరకుండా—తప్పు తెలుసుకుని—ఆడ పిల్లలు కూర్చున్న స్థలంకేసేచూస్తూ, సుబ్బ రాయుడు అరుణాదేవికోసం ఆ పాటను పూర్తిగా పాడా ననిపించాడు అలా అనిపించినా చాలు—నాటకమంతా పోర్షన్లు రాక ఎన్ని నాటకాలు చెడిపో లేదూ—నాకు నేను సంబరపడ్డాను యిలా అను కుని

మొదటి సీను జయప్రదంగా ముగిసింది పాట అయినాక ఆడియన్సు మరి గొడవ చెయ్య లేదు రెండో సీనులో పాత్రలందరూ ధైర్యంగా ఏక్టు చేశారు

మూడో సీను కూడా ఏ గొడవా లేకుండా జరిగిపోతోందనుకున్నా

ఆంజనేయులు ఉషారాణిగా రంగస్థల ప్రవేశం కానిచ్చాడు జాగ్రత్తగా ఏ ప్రమాదమూ లేకుండా మెట్లు దిగాడు స్టేజిమీద అప్పటికే నిలిచివున్న మధూ దగ్గరిసా నడిచాడు అతి వయ్యారంగా అమ్మాయిలు సిగ్గుపడేట్లు తన పాత్రకు నూటికి మూరుపాళ్ళు జీవం పోశాడు ఆంజనేయులు

అమ్మాయిలంతా ముక్కున వేలేసుకున్నారు.

మధు కళ్ళు మూసుకుని, దీపం వైపుకు తిరిగి—మొదటి డైలాగును ఎలాగైతేనేం అనే శాడు వాడు ఎన్నో ఫీలింగ్సులో అన్నాడేమో ఆడి యన్సు సంతోషం పట్టలేక ఈలలూ, కేకలూ మొదలెట్టారు—యిలా అని నేననుకున్నాలెండి

బుర్రమీదకు పువ్వులు సర్దుకుంటానికిగాను అప్రయత్నంగా అంజి చెయ్యి ఎత్తాడు కుడి చేతి జబ్బ ఉబ్బి—ఉట్లు తెగిపోయి జాకెట్టు చిరి గిందట—

శ్రీధర్ యిలా అని తెర వెనుకనున్న నాతో చెప్పాడు

నేను కూడా చూశాను

వాడు చిరిగిన భుజాన్ని తెలివిగా చీర చాటున దాచుకున్నాడు

సీను పూర్తైనాక తెర వెనుక 'జాకెట్టు చిరిగింది ఆ లమ్మాయికి ఏమని చెప్పుకోవాలా' అని నేనేడుస్తూంటే తలో మాటా అన్నారు

"అసలు ఈ గున్న ఏనుగుకి హిరోయిన్ పాత్రేమిటిరా ?"

"ఒకవేళ యిచ్చారే అనుకో—అంత మంచి పేరుతోనా ?"

"ఉషారాణిట—వెధవకు ఏ వెంకాయమ్మో అని పిలవాల్సింది—"

"పైగా—అంత లావుగా వుండి—ఇందాక వేలు పెడితే అంతేదాకా పొట్టపగిలేట్లు తిన్నాడు వో

## మా నాటకం

వారం రోజులపాటు తిండ మానేసినా— వీడికి సరిపోయే జాకెట్టు ఎక్కడా దొరకబోదు అంత తిన్నాడు గనుకనే మేకప్‌కు ఆలస్యంగా వచ్చి—కండ అంతగా వుబ్బింది—"

వాళ్ళనందర్నీ ఊరుకోబెట్టి మేకప్‌మేన్‌ను బతిమాలి పాత రవిక వోటి వాడి కిప్పించాను వాడు దాన్ని చూస్తూనే 'చీ—క్లబ్ డాన్సర్ ఎక్కడైనా ఇంత చవకబారు రవిక తొడు క్కుంటుందా' అన్నాడు

"పోనీ—బాడీతోనే ఏక్టు చేసెయ్—" సలహా యిచ్చాడు అప్పన్న

అందరం గొల్లున నవ్వాం వాడింక చేసేదేమీ లేక చచ్చినట్టు చెప్పినట్లల్లా విన్నాడు ఆ చీటీ గుడ్డ రవికనే ఎంతో అప్యాయంగా తొడుక్కున్నాడు

చాలా వధులైంది—స్టేజిమీద వాడు కసరత్తు చేసినా చిరిగిపోదు

నాలుగో సీను

మధూ ఉషారాణిని ప్రేమిస్తున్నట్లుగా చెప్పు కున్నాడు ఉషారాణికి కోపంవచ్చి— 'పొరబాటు పడుతున్నావు నేను ఒకరి కిచ్చేసిన హృదయాన్ని మళ్ళీ నీకెట్లా యివ్వగలను ! నేను సుబ్బా రాయుడ్ని మాత్రమే ప్రేమిస్తున్నాను—' అనే సింది చటుక్కున నాలిక కొరుక్కుంది హిరో యిన్

ఆడియన్స్‌లో మరోసారి నవ్వులూ—పకపక లూనూ

"నేను సునీల్‌ను మాత్రమే ప్రేమించగలను నీకు నా హృదయంలో స్థానం లేదు వెళ్ళిపో రాజా రావ్ ?—" అన్నాడు తప్పుదిద్దుకుంటూ, ఆంజ నేయులు

మధు మరికొంచెం ముందుకు జరిగి ఆంజ నేయులి చేతులు పట్టుకున్నాడు

"రాణి ! యిలా అంటే నేనేమైపోవాలి? సర్వ స్వమూ నీవే అనుకున్న ఈ దీనుడి మొర ఆల కించి కన్నీటితో ఆహ్వానించవా ? నీకోసం నా హృదయం వగిలిపోతూ ఏడుస్తోంది నువ్వు తృణీక రించావా నేను చచ్చిపోతాను—"

వాడ్ని కావిలించుకోబోయాడు 'హాచ్' అంటూ ఎవరో తుమ్మారు

ఆంజనేయులు వెంటనే దూరంగా నడిచాడు. 'చీ—నన్నొదులు' అన్నాడు మధు లోపల ఉబుకు తున్న కోపాన్ని ఆపుకుంటూ ఉద్రేకంతో అన్నా డిలా

"రాణి నీవులేని ఈ జీవితం వృథా నువ్వు నన్ను కాదనడానికి వీల్లేదు యివ్వటికే నీకోసం బోల్డు ఖర్చుపడ్డాను—"

అని వాడ్ని మళ్ళీ కావిలించుకోబోయాడు పాత రవికను కనిపించకుండా సిల్కు చీరలో కప్పు కున్నాడా యిరి—ఆంజనేయులు త్వరగా చేతిని యువతలకు తీయలేకపోయాడు గట్టిగా ప్రయ త్నించేటప్పటికి—చెయ్యి చాలా స్పీడుగా యువతల కొచ్చింది

మధు లెంప పట్టుకుని మొహం కందగడ్డలా చేసుకున్నాడు దెబ్బ బాగా తగిలింది ఆంజనేయులు నెమ్మదిగా 'సారీ' అన్నాడు మధుకు పూర్వప్ప కసి జ్ఞాపకానికొచ్చింది

"మీ ఆడవాళ్ళంతా యింతే మేం దూరంగా వున్నంతకాలం మీరూ దూరంగానే వుంటారు. దగ్గరకొచ్చి హృదయాన్ని విప్పి చెప్పుకుంటే తృణీక రిస్తారు ఛీ—" అంటూ మధు చాచి అంజిగాడి లెంప వగలకొట్టాడు

తనకసి తీరిందనుకున్నట్లుగా హాయిగా దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు మధు ఆంజనేయులు—ఉషారాణి వేషంతో—వెనక్కు విరుచుకుపడ్డాడు. ఐదు నిమిషాలు గడిచినా లేవలేదు

కళ్ళు కూడా తేలేసినట్టు కన్పించి నేను కంగారు పడ్డాను

"నేచురల్—భలేభలే ! అనరిచాడు ఎవడో నేను 'కర్టెన్ కర్టెన్' అని అరవాల్సొచ్చింది

తెరనులాగే కుర్రాడు మురళీ విస్తుపోయి చూస్తూ, తెరలాగుకు రావడం మరిచేపోయాడు

పడిపోయిన ఆంజనేయుల్ను చూస్తూ ఏం చేయాలో తోచక మధూ అలా నిల్చుండిపోయాడు. ఆడియన్సులో గగ్గోలు బయలు దేరింది

స్టేజిమీద జరుగుతున్నది నటనో—ప్రమా దమో తెలుసుకోలేని పరిస్థితి ఏర్పడింది ఇంత వరకూ జరిగిందంతా గమనించిన కొంతమంది—నిద్ర పోకుండా వెళ్ళిపోకుండా వున్న వోపిక గల వాళ్ళు—అది ప్రమాదమే ననుకున్నారు

మురళీ అయినా పరధ్యాన్నంలోంచి తేరు కున్నాడుగానీ—స్టేజి మీదున్న మధు ఆ స్థితి లోంచి తేరుకోలేకపోయాడు

మురళీ తెర లాక్కొచ్చాడు అందరం ఇస్టేజి మీదకు పరిగెత్తాం శ్రీధర్ గ్లాసుతో నీళ్ళు తీసుకొచ్చి అంజిగాడి మొహాన చల్లాడు వాడు హఠాత్తుగా లేచికూర్చున్నాడు—'ఒరేయ్ చీర

(51–వ పేజీ చూడండి)

---

పాఠకుడు - ఏ చిత్రంలో మీకు నచ్చిన రసవత్తర ఘట్ట మేదో తెలుపగలరా?

నటుడు :- వివాహ సందర్భంలో ఒక సన్నివేశంలో నాయికతో కూడి పంచభక్ష పరమాన్నాలు ఆరగించే ఘట్టం నిజంగా నాకు నచ్చింది. అటువంటి ఘట్టాలంటే నాకు మహా ప్రీతి.

సుందరం (గుంతకల్లు)

---

# మనమూ—మనదేహస్థితి

(14-వ పేజీ తరువాయి)

ఇతర అవయవములు వ్యాధిగ్రస్తములయినప్పుడు ప్రాణాపాయం జరగవచ్చును. అందుచేత ఎవరయినా గొంతు నొప్పి అని చెప్పగానే నాలుక పరీక్షించి అనుమానంకలగగానే వెంటనే వైద్య సహాయం పొందాలి

సిఫిలిస్ (సవామేహం)కు ఫలితంగా గొంతుక, దానిలోవున్నఅవయవములుఇన్‌ఫ్లేంఅయి గొంతునొప్పి ఏర్పడవచ్చును ముందు జాత్యాంగం (Sex Organ) మీద పుండు లేస్తుంది గజ్జల్లో బిళ్ళలు కడతవి ఆతర్వాత సాధారణంగా 5 వారములనుండి 12 వారముల లోపుగా గొంతుక అంగిలిలోవున్న మ్యూకస్ మెంబ్రేను ఇన్‌ఫ్లేం కావచ్చును నొప్పి, గొంతుక ఎండిపోయినట్లువుండడం, మింగుతున్నప్పుడు అధికంగా బాధ ఏర్పడతవి ఈ లక్షణములు కొన్ని వారములపాటు వుండవచ్చును మామూలు పుక్కిలింతలతోనో, పల్ఫా నిలమైడ్—పెన్సిలిన్ మాత్రలతోనూ తగ్గినట్లు, కంఠగతమైన సవామేహంలో తగ్గదు వెంటనే రక్తపరీక్ష చేయించుకుని చికిత్స ప్రారంభిస్తే ఆ వ్యాధి నాలుగవదశలో కలిగే దారుణఫలితాలు ఏర్పడకుండా కాపాడుకోవచ్చును. ఇటుకరాయి రంగుగల మచ్చలు అంగిలిలోనూ, టాన్సిల్‌మీదా, కొంత నాలుకమీదా ఏర్పడతవి. వీటి విశేషమేమిటంటే యీ మచ్చలన్నీ ఒకే సైజూ ఆకారమూ కలిగి, ఒకదానిని ఒకటి పోలివుంటవి ఇవి కొండ నాలుక ముందు విశేషంగా వుంటవి ఇవి కాక కొన్ని ప్రదేశములలో తెల్లని మచ్చలు (Mucus Patches) వివిధ వైశాల్యములతో ఏర్పడవచ్చును నాలుగైదు పంజాకురుపులు కలిసినప్పుడు పెద్ద తెల్లని పుండు ఏర్పడ్డట్లుగా యివి వుండవచ్చును ఈ పుళ్ళలో నుంచి వచ్చే వుమ్మినీటిలో సిఫిలిస్‌కు కారణమైన క్రిములు వుంటవి ఈ స్థితిలోవున్నవారి ఉమ్మినీరు, చుంబనాది కార్యకలాపాల్లో ఆరోగ్యవంతుల నోటిలోకి పోయినప్పుడు అక్కడ ఆ వ్యాధి ఏర్పడి నోటిలోనో, పెదవులమీదనో సవామేహవ్రణము ఏర్పడవచ్చును

సిఫిలిస్ అంకురించినతరవాత కొన్ని మాసాలలో యీస్థితి యేర్పడితే, సంవత్సరాల తరవాత ఆ వ్యాధి ముదిరి, నాలుకమీద, చెక్కిళ్ళ లోపల, అంగిలిలోనూ గడ్డలుకట్టి, అవి జీర్ణించి లోతైన పుళ్ళుగా యేర్పడతవి పై అంగిలిలో రంధ్రం ఏర్పడి, నాశికారంధ్రములకూ, నోటికీ మధ్య ద్వారం యేర్పడుతుంది ఈ స్థితిని మనవారు బొక్కనాపి రోగము అంటారు ఈ పుళ్ళు మానడమంటూవుంటే నక్షత్రాకారంగల మచ్చలు యేర్పడతవి

['గొంతునొప్పి: కొన్ని రోగములు' వ్యాసంలో శేషభాగం పైవారం ప్రచురిస్తాము]

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది!




బి 3703 కేస్‌మెంట్ క్లాత్ అన్నిటికి పనికొచ్చేది అన్నిటా అతివచ్చేదీను పిల్లల స్కూలు యూనిఫారాలకి ఇళ్ళలో సోఫా కుషన్‌లమీద కవర్లకి, తెరలూ వగైరాలకి ఉపయోగిస్తుంది. కంటికి నదరుగా ఉండే రకరకాల రంగులలో దొరుకుతుంది.

బెంగుళూరు ఉలెన్, కాటన్ & సిల్కు మిల్స్ కంపెనీ లిమిటెడ్ అగ్రహారం రోడ్, బెంగుళూరు-2
(బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్ వారి శాఖ)

# మా నాటకం

(48-వ పేజీ తిరువాయి)

తడిసిపోతోందిరా' అంటూ 'నిజంగా మూర్ఛ పోలేదురా' అంటూ నోరు వెళ్ళబెట్టాడు శ్రీధర్

"నాకు మూర్ఛా— మీ అందరికీ మూర్ఛ రావాలి వెధవల్తో నాటకం వేయడానికి—అందులోనూ ఆడవేషం వేయడానికి వప్పుకున్న నాది బుద్ధి తక్కువ — మిమ్మల్నేం లాభం? — ఇంత గట్టిగా కొడతాడా—వెధవ పీనుగ—ఏడీ వాడు— వాడ్ని కరకర నమిలేస్తాను—ఏడీ" అంటూ మధు కోసం వెతకటం మొదలెట్టాడు ఘటోత్కచుడి ఫోజులో మధు పారిపోయి గ్రీన్ రూంలో దాక్కున్నాడు చీర కాస్త విప్పి అక్కడ పారేసి, అంటి గ్రీన్‌రూంకేసి పరిగెత్తబోయాడు పూనకం వచ్చినట్లు

'ఒరేయ్ ప్రిన్సిపాలురా' అంటూ భయం పెట్టి వాడ్ని లాంగదీసుకున్నాను కాని, ఉషారాణి కోపం పూర్తిగా తగ్గిపోలేదు దాంతో నేను స్టేజీమీదకు గెంతి—మైక్‌లో యిలా చెప్పాను

"సోదర సోదరీమణులారా!

కొన్ని అనివార్య పరిస్థితులు ముంచుకొచ్చినందువలన, ఈ నాలుగో సీను యింతటితో ముగిస్తున్నాం కథకేమీ దెబ్బ తగలదులెండి—ఉషారాణి లెంపదెబ్బతో పడిపోయింది అందుకు విచారిస్తూ రాజారావు వెళ్ళిపోతాడు ఇంతే కొద్ది నిమిషాల్లో ఆఖరిసీను ప్రారంభిస్తాం—ఆలస్యానికి క్షమించండి—" అనేసి యివతల కొచ్చానో లేదో సుబ్బరాయుడు గుండె బాదుకుంటూ నా దగ్గరకు పరిగెత్తుకొచ్చాడు

"ఇదేమిట్రా—నా అయిదో సీను లేకుండానే అయ్యబాబోయ్— మీరంతా కలిసి నన్ను నా పోర్షనంతా దీంట్లోనే కదరావుంది—నా కొంప ముంచేట్లు వున్నావే—" అన్నాడు నేను నిర్ఘాంతపోయాను అవును నేను తప్పు చెప్పాను ఏం చేయాలి యిప్పుడు?

"మరి— ఆ అంటిగాడు యిక స్టేజీ ఎక్కనంటున్నాడు కదరా—మరి ఎట్లా వేస్తాం అయిదో సీను?"

"ఒరేయ్ కృష్ణా వాడిని నేను బతిమాలుకుంటాన్లేరా మైక్‌లో పొరపాటయిందని చెప్పు పద వెళ్ళు—" అని నన్ను పురమాయించాడు

ఈ నాటకమంతా వాడికోసమేగా — అందుకని నేను అభిమానం చంపుకొని మెల్లీ మైక్ దగ్గర కెళ్ళాను

"తప్పయిపోయింది క్షమించం"డంటూ చెప్పుకున్నాను మైక్‌లో

స్టేజి ఏర్పాట్లు పూర్తి కానిచ్చి, అలా తెర వెనుకవెళ్ళి చూసేప్పటికీ—రోమియో జూలియట్ దగ్గర మోకరించినట్లు—సుబ్బా అంజనేయుల్ని బతిమాలుకుంటున్నాడు వాడు బీడీ కాలుస్తూ ఆ పొగంతా సుబ్బారావు మొహంలోకి వూదుతూ వప్పుకోనంటున్నాడు

"ఒరేయ్—వేసేది హీరోయిన్ వేషమా ఈ బీడీ ఏమిట్రా?" అని కసురుకున్నాను.

# మా నాటకం

"పోరా — కిట్టూ! ఆ మధుగాడ్ని రప్పించి క్షమాపణ కోరుకునేవరకూ నేను స్టేజి ఎక్కను" అంటూ మొండికేశాడు

అమ్మయ్యా — ఒక మెట్టు క్రిందికి దిగొచ్చా డనుకుని, సంతోషిస్తూ గ్రీన్ రూంలో కెళ్ళా మధూను బ్రతిమాలుకున్నా వాడికి ప్రైజు వస్తుందని ఆశ చూపించా వాడు — ఎన్నో చెప్పాక వప్పుకుని యివతల కొచ్చాడు

సుబ్బారాయుడుకోసం మధు అంజిగాడ్ని క్షమించమని కోరుకున్నాడు అప్పటికే అరగంట ఆలస్యం అయింది

ఐదో సీను మాంచి రసవత్తరంగా సాగి పోయింది

తెరపడగానే సుబ్బారాయుడు నా దగ్గరకు పరిగెత్తుకొచ్చాడు 'ఒరేయ్ — వాడి బీడీ కంపు భరించలేకుండా వున్నారా — ఓ కిళ్ళీ వేసుకోమని చెప్పరా — కిళ్ళీ డబ్బులు నే నిచ్చుకుంటాను'— అన్నాడు

'ఛా విచారంలో మునిగివున్న ఉషారాణి కిళ్ళీ వేసుకుంటే యిక నర్సే వద్దు వద్దు—" వాడి సలహాను తిరస్కరించాను

ఆరోసీను ప్రారంభించాం నాటకం పూర్తయి పోతోందనే సంతోషం నన్ను వూపేసింది ప్రాంప్టింగ్ మరిచేపోయా

అప్పన్న యిన్‌స్పెక్టర్ వేషంలో స్టేజిమీద కెళ్ళాడు

"రాజారావుగారూ! మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను ఎందుకోసమో తెలుసునా?" అన్నాడు

'తెలుసు ఉషారాణి శీలం పగలకొట్టినందుకు!' అంటూ కెవ్వున నవ్వాడో విద్యార్థి ప్రేక్షకుడు ఆడియన్స్‌లో ఒకటే నవ్వు

నేనెంత చెప్పినా వినక, ఆడియన్స్‌కేసి చూసాడు అప్పన్న అంతే — మళ్ళీ వాడినోట మాటొస్తే వొట్టు ముందుకూ వెనక్కూ వూగుతాడేగాని, డైలాగు చెప్పడు విసుగుపుట్టి మధు అడిగేశాడు "ఎందు"కంటూ "నేనేం తప్పు చేశా"నని ప్రశ్నించాడు

ఇంతలోనే ఎవరో — ముందు వరసలో కూర్చున్న విద్యార్థి స్టేజిమీదకు గబుక్కున గెంతాడు అప్పన్న దగ్గరకు నడిచాడు

"ఓరి నువ్వట్రా — అప్పన్నా, ఎవరో అనుకున్నానుసుమీ" అన్నాడా నూతన పాత్ర!! ఆడియన్స్‌లో అపలేనంత ఆశ్చర్యమూ—నవ్వూ—

ఆ కుర్రాడి నెలాగైతేనేం క్రిందకులాగేసాం

ఇన్స్‌పెక్టరు అప్పన్న బెదిరిపోయాడు వాడి దసలే పిరికి గుండె గబగబా అనేశాడు — పాఠం వప్పజెప్పినట్లుగా

"మిస్టర్ రాజారావ్! నేతాజీ ఉద్యమంలో చేరి దేశద్రోహం చేస్తున్నందుకు నిన్ను అరెస్టు చేస్తున్నాను నువ్వు చెప్పుకునేదంతా ఈ కాన్‌స్టేబుల్‌తో చెప్పేసి — పోలీసు స్టేషన్‌కు రా నే వెళ్తున్నాను—" అనేసి, స్టేజి దిగి తిన్నగా వెనక్కు వచ్చేశాడు

నాకు కోపం ఆగలేదు అయినా ఏమీ చేయ లేకపోయాను తల పట్టుకుని కుర్చీలో కూర్చుండి పోయాను వాళ్ళు తిట్టేటని శ్రీధర్‌కు అప్పుచెప్పి

ఇన్స్‌పెక్టర్ వెళ్ళిపోయినా కూడా—మధు ఏమీ మొహమాటపడలేదు రెండు పేజీల డైలాగు మొదలెట్టాడు

కాన్స్‌టబుల్ వేషధారి కంట తడిపెట్టాడు ఆ బోరు భరించలేక అంతా అయినాక — 'ఇక నైనా వస్తారా" అన్నాడు

మధు—"ఇంకొక్కమాట చెప్పనివ్వు నాకు ఉరిశిక్ష విధించినా ఫర్వాలేదు నా ఆత్మ కూడా దేశం కోసమే రెపరెపలాడుతుంది 'దేశంకోసం' అంటూ పకపకా నవ్వుకుంటూ, ఎంతో బాగా నటించాననుకుని — ప్రైజు తనకేననే దీమాతో ఛాతీ విరుచుకుంటూ నిష్క్రమించాడు

సుబ్బరాయుడు ఆంజనేయులో ప్రవేశించాడు రంగంమీదకు ఇద్దరూ చేతులు కలుపుకున్నారు ఆనందంగా నవ్వారు — కలిసి మేలుకొలుపుపాట పాడారు మురళీ తెరలాగుతూండగా— "వట్టిచెత్త" — "బోరు"—"ఛీ—ఛీ"— అనే విమర్శలు వినిపించాయి ప్రేక్షకుల్లోంచి

శ్రీధర్ నా ప్రక్కన జేరాడు "ఏమిట్రా—ఈ మధుగాడు యిట్లా చేశాడు? ప్రైజుకోసం కాక పోతే—అంత బాగా ఎందుకు నటిస్తాడు? సుబ్బ రాయుడికి నమ్మకద్రోహం చేసాడు పాపం— ప్రైజు రాకపోతే సుబ్బారాయుడు ఎంతగా ఏడుస్తాడో—" అన్నాడు నేను కుర్చీలోంచి కదల్లేదు జడ్జీ స్టేజిమీద కొచ్చారు ఇలా చెప్పాడు మేమంతా చెవులు నిక్కబొడిచుకుని విన్నాం—

"ఈ నాటకం చూస్తే—ఇది సాంఘిక నాటకమో—చరిత్రాత్మకమో — కేవలం హాస్యమో— ఏమో తెలియదు ఇది ఎలా ఉందో విమర్శ చేయడంకాదు—నావని

ప్రైజు—

వక్రమంగా పనిజేసి, తెరను లాగిన కుర్రాడు మురళీ కిస్తున్నాం"

అంటూ బహుమతికప్పును మురళీ కందించారు.

మా వాళ్ళ మొహాల్ను — నన్ను కూడా వారితోనే జతపరిచి — కత్తివాటుకు నెత్తురుచుక్క లేకుండా పోయింది దిగాలుపడి కూర్చున్నారు జనం నవ్వుకుంటూ — గేలిచేస్తూ వెళ్ళిపోతున్నారు.

అప్పన్న నెమ్మదిగా సుబ్బరాయుడి దగ్గరకు నడిచాడు

"ఒరేయ్—నిన్నోసారి కలుసుకోవాలనుకుంటోం దిరా—అరుణాదేవి వరండాలో నిల్చునుంది—"

సుబ్బా ఎగిరి గంతేసాడు గబగబా వరండాలోకి పరిగెత్తాడు ఆ అమ్మాయి చిరునవ్వుతో వీడి కోసం నిరీక్షిస్తోంది

"మిస్టర్ రాయుడూ! మీరు బాగా నటించారండి చాలా బాగా పాడారు—" అన్నది

అది హేళనాత్మకమో—సానుభూతి చూపడమో తెలియక తలవంచుకున్నాడు సుబ్బారాయుడు

"అనుమానం లేదండి మీరు నటనలో సిద్ధహస్తులండి నిజం—నా కళ్ళల్లోకి చూడండి నే నబద్ధం చెప్పటం లేదని మీకే తెలుస్తుంది—" అన్న దామె

నాకు ఆమె ధోరణేమీ అర్థంకాలేదు వాడు ఉక్కిరి బిక్కిరిఅయి చస్తున్నాడు ఆమె మొహం లోకి చూసి—"నిజమాండీ" అనడిగాడు ఆశ్చర్యపోతూ ఆమె తల "అవున"న్నట్లుగా త్రిప్పింది సిగ్గుతో తలవంచుకొంది. చిలిపిగా చూపిస్తూ

వాడు ధైర్యం చేశాడు అభాట్ముగా ఆమె చేతుల్ని పట్టుకున్నాడు వరండా అంతా నిర్మా నుష్యంగా వుందనుకుని—నాటకంలో అంజిగాడ్ని పట్టుకున్నట్టు—ఆమె ఎటో చూసింది—అతని కళ్ళలోకి చూడలేక అతను దగ్గరకు లాక్కుం టున్నా ఎదురుచెప్పలేకపోయింది

నేను విస్తుపోయాను "ఇంతగా ప్రేమించు కున్నాకనే ఇలా నాటకం ఆడాడన్నమాట—" అంటున్నాడు శ్రీధర్ నా చెవితో ఇంకా ఏదో చెప్పబోయి నోరు మూసుకున్నాడు కుడిచేత్తో

ఆ అమ్మాయి ఆకస్మాత్తుగా హడావిడిగా సుబ్బా రాయుడి లెంప పగలగొట్టింది "అభినందించడాని కొస్తే—యిలా చేస్తారా ?" అనేసి చకచకా వెళ్ళిపోయింది—గేటుకేసి.

గదిలోమధ్యగా కూర్చునున్నాడు సుబ్బారాయ్డు

"నాటకమూ ఫెయిల్ అయింది—నీ ప్రేమా ఫెయిల్ అయింది ఛా—నేనెక్కడా ఇంత డబుల్ ట్రాజెడీని చూడలేదు ఎలా భరిస్తున్నావురా ఆత్మహత్య చేసుకోక ?" అనడిగాడు అప్పన్న నిశ్శబ్దాన్ని పగలగొడ్తూ నాకు కోపం ఆగిందికాదు

"మీరంతా కలిసి వీడి నాటకాన్ని—తద్వారా వీడి జీవితాన్ని నాశనం చేసిందికాక—ఇంకా బోడి సలహా యిస్తున్నారు ! వాడికేం ఖర్మ—చావడం—ఈ అమ్మాయి కాకపోతే మరో అమ్మాయి ఏరా సుబ్బా ? అంతేనా ?"

ఇంతలో వీధి తలుపును తట్టారెవరో

"ఒరేయ్—యింటావిడగామోసు సందేహం వెలి బుచ్చాడు శ్రీధర్ అద్దె యివ్వలేదింకా వెళ్ళగొట్టడానికొచ్చిందేమో అనుకున్నా సుబ్బ జేబు లోని పర్సుతీసి చేత్తో పట్టుకున్నాడు వాడేమీ మాట్లాడలేకపోతున్నాడు—విగ్రహంలాకూర్చున్నాడు

శ్రీధర్ ధైర్యంచేసి తలుపుతీశాడు—ఐంకుతూనే ఆ అమ్మాయి —

అరుణాదేవి ! తలవంచుకు నిల్చుంది.

"సుబ్బారాయుడుగారు లేరా ?"

విగ్రహానికి ప్రాణం వచ్చింది గబగబా పరి గెత్తబోయి, ఏదో ఆలోచించుకుని మళ్ళీ కుర్చీలో కూర్చుండిపోయాడు ఆ అమ్మాయే లోపల కొచ్చింది కళ్ళంబడి నీళ్ళు పెట్టుకుంది బొట బొటాకన్నీరు కారుతూండగాయిలాచెప్పడంప్రారంభిం చిందిసుబ్బారాయుడితో—మేముదూరంగావెళ్ళిపోగానే

"సుబ్బారాయుడుగారూ ! నన్ను క్షమించండి ఆ పరిస్థితుల్లో అలా చెయ్యాల్సొచ్చింది

"మీరు నా చేతులు పట్టుకోవడం మా నాన్న గారు చూశారు అందుకని మిమ్మల్ని కొట్టాల్సొ చ్చింది —ఆయన ఏమనుకుంటాడోననే భయంతో చెయ్యరాని తప్పు చేశాను—నన్ను క్షమించండి—

ఇవ్వాళ ఉదయమే—అందుకు నన్ను మంద లించి, మీకు నా క్షమాపణ చెప్పుకోమన్నారు మా నాన్నగారు మిమ్మల్ని తనకు పరిచయం చెయ్య మన్నారు కూడా —"

మేమంతా ఒకరి మొహాలొకరం చూసుకుంటూ నిల్చుండిపోయాం మావాడు మా దగ్గర కొచ్చాడు

"థాంక్సు మై డియర్ ఫ్రెండ్సు మీ సహా యానికి ఎలా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలియ కుండా వుంది ఇప్పుడేవస్తా—అరుణ తనతో రమ్మంటోంది—" అని చెప్పాడు

ఆమె కూడా "నమస్తే" అంది మా అంద రికీ ఇద్దరూ చకచకా వీధిలోకి వెళ్ళిపోయారు

మేం హాయిగా నిట్టూర్పులు విడిచాం ఆగది వేడెక్కేట్టు

మరో నాలుగు నెలలకల్లా సుబ్బారాయడూ—మా బ్రహ్మచారుల మహాసంఘ సభ్యత్వానికి రాజీ నామా యిచ్చాడు

మా సుబ్బారాయుడి పెళ్ళి అరుణాదేవితో అత్యంత వైభవంగా జరిగింది ★





(15వ పేజీ తరువాయి)

అంతలో ఏమి అనుకొన్నదో "మీరు ఆగుడు. నేనే రామునకును, కృష్ణునకును బట్టలు తెచ్చి యిచ్చెదను" అన్నది.

ఆమె ఆ వస్త్రములతో రాగా రామకృష్ణులకు ఆశ్చర్యమైనది. ఇది ఆశ్రమ ధర్మమా! ఆశ్రమున తాము బ్రహ్మచారులరై ఉండవలెను. శ్రద్ధతో ఉండవలెను. గురువునకు శుశ్రూష చేయవలెను. ఆ గురువులలో విద్యాగురువు భార్యయును గురువు. ఆమె తమయందు ఇట్టి ఆదరమునుచూపుచున్నది.

శ్రీ కృష్ణదేవుడు అనినాడు: "తల్లీ! ఇది మేము చేసుకొనవలసిన పని. మీరు చేయవలసినది కాదు. మేము శిష్యులమును, మీరు గురువులును."

"బిడ్డా!"

"తల్లీ! మీరు అలాగున అనగా మా యశోద జ్ఞాపకమునకు వచ్చుచున్నది."

"అటులనా! తండ్రీ! నేను యశోదను ఎట్లు అగుదును. ఆమెను గూర్చి మీ గురువులు చెప్పగా విన్నాను. ఆమెను ఎట్లు అగుదును."

ఆమెకన్నులలో ఆనందభాష్పములు నిల్చినవి. ఆమె మరియు నన్నది: "తండ్రీ! ఈదినమునకు నాముద్దు చెల్లించు. రేపటి నుండియు శిష్యరీతమును నెరపుదువు గాని."

శ్రీకృష్ణదేవుడును, బలరాముడు ఆమె తెచ్చిన వస్త్రములను ధరించినారు. ఆమెయు ఆ ఒక్క దినములో పీతాంబరములను, నీలాంబరములను ఎట్టులు సమకూర్చిపెట్టినదో! వారు ఆ వస్త్రములను ధరించగా, ఆమె సంతోషించినది.

సాందీపని అగ్నికార్యమును పూర్తిచేసుకొనినాడు. శిష్యులచేతను అగ్నికార్యమును చేయించినాడు. అందరును ఆయన చెప్పు పాఠమును వినుటకు సిద్ధముగా కూరుచుండినారు. అంతలో నతడు ముందు ఉచ్చైస్స్వరమున ఇట్లు అనినాడు:

"ఓం, సహనావవతు
సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినా వధీతమస్తు
మావిద్విషావహై."

శ్రీకృష్ణదేవుడు వెంటనే ఇట్లు అనినాడు

ఓం: శం నో మిత్రశ్శం వరుణః
శం నో భవత్వర్యమా
శం న ఇంద్రో బృహస్పతిః
శం నో విష్ణు రురుక్రమః
నమో బ్రహ్మణే
నమస్తే వాయో
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మవదిష్యామి
ఋతం వదిష్యామి
సత్యం వదిష్యామి
తన్మామవతు
తద్వక్తార మవతు
అవతుమాం
అవతు వక్తారం
ఓం శాంతిః శాంతిః శాంతిః

[illegible] ★

# మనము-మన రాష్ట్రం

(12-వ పేజీ తరువాయి)

ష్టానవర్గం దృష్టికి తెచ్చి, మందలింపజేయడం ముఖ్యమంత్రి కనీసధర్మం బహుశః ఆయన తీసుకోదలచిన చర్యకూడా అదేనేమో

* * *

భగవంతుణ్ణి ప్రార్థించేవారు, తాము ఫలానా అని తెలుసుకోడం హైందవమత సంప్రదాయం అందుకే సంధ్యావందనం చేసేటప్పుడు "జంబూద్వీపే, భరతవర్షే, మేరోః దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ఈశాన్య (లేదా మరో దిక్కు) ప్రదేశే, కృష్ణా గోదావరీ (లేదా మరో నది) మధ్య దేశే" అంటూ ఈ విశాల ప్రపంచంలో తానెక్కడ ఉందీ తెలుపుకొంటాడు తరువాత ప్రవరలో తన శాఖ, ఋషి సంప్రదాయం, గోత్రం, పేరు వగైరా చెప్పి అహంభో అభివాదయే అంటాడు

ఈ అనంతకోటి సృష్టిలో భక్తుణ్ణి, భగవంతుడు గుర్తించలేడనో ఏమోగాని ఇదొక ఆచారంగా ఏర్పాటైంది అయితే ఈమధ్య కొందరు వి ఐ పి లు (అంటే వెరీ ఇంపార్టెంట్ పర్సన్స్ అనగా అతి ముఖ్యమైన వ్యక్తులు) దేవాలయాలకు వెళ్లినప్పుడు అర్చకులు గోత్ర నామాదులు అడుగుతుంటే బాధపడుతూ, అలా అడగటం తమని అవమానపరచినట్లు భావిస్తున్నారట. అందుకని అర్చకు లలా గోత్రనామాదులు అడగరాదని, కావాలంటే ఇతరత్రా ముందుగా ఆరాతీసి తమక్కోవాలని హిందూ దేవాదాయశాఖ ఈమధ్య ఒక తాఖీదు జారీచేసి, ఈ తాఖీదునుపాటించకపోతే దేవాలయ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లపైన, అర్చకులపైన చర్య తీసుకోబడుతుందని హెచ్చరించారట ఇది సంప్రదాయ మెరిగి చేసిన ఉత్తరువేనా? కాదు కేవలం వి ఐ పి లకు భయపడి చేసినట్టిది కాకపోతే, స్వయంగా ఆరాధించేటప్పుడే, తను ఫలానా అంటూ చెప్పుకోవడం ఆచార మైనప్పుడు ఇంకొకరి తరపున అర్చనచేసే అర్చకుడు గోత్రనామాలు అడగటంలో తప్పేమిటో, అందులో ఒకరిని అవమానించడమన్న ప్రసక్తి ఏమిటో, తాఖీదు జారీచేసిన హిందూ దేవాదాయశాఖకే తెలియాలిగాని అన్యులకు అగ్రాహ్యం పైగా గోత్రాదులను ముందుగా ఆరాతీసుకోవాలనడం, అర్థంలేనిమాట వి. ఐ పి ల అనుయాయుల చుట్టూ తిరిగి తెలుసుకోడం అర్చకులపని కాదు దేవాదాయమంత్రి శ్రీ చంద్రమౌళి ఈ తాఖీదును విమర్శిస్తూ, వీలైనంతవరకూ, వి. ఐ పి ల గోత్రాలడుగవద్దని అర్చకులకు సలహా యిచ్చారు ఇది ఛీప్పైన సలహాయే గాని, ఒకరి తరపున అర్చనచేసేవ్యక్తి, ఎవరి తరఫున చేస్తున్నదీ చెప్పకపోవడం అర్చకుడు తన ధర్మాన్ని తాను నిర్వర్తించినట్లు కాదు

ఇంతకూ అసలు రహస్యం ఈ వి ఐ పి లనబడేవారు పూర్ణకుంభాలతో, దైవోచితమర్యాదలతో స్వాగతం పొందడానికే ఆలయాలకు వెడుతున్నారు కాని అర్చనకోసం కాదు వీరిలో చాలా మందికి తమ గోత్రాలేమిటో తెలియకపోవడం ఆశ్చర్యంకాదు నలుగురిలో అర్చకుడు మీ గోత్రమేమిటని అడిగితే, తమకు తెలియని విషయాన్ని అడుగుతున్నాడని అవమానంగా భావించడం అందుకే ★

## శ క యి మో గ ం

(9–వ పేజీ తరువాయి)

బరువుగా అడుగు బయటికి వేశాడు ... రోడ్డు కిరుప్రక్కల వెడల్పాటి కాలిబాటలు, వాటికి సంరక్షకుల్లా ఎత్తుగా నిలిచిన కానుగ చెట్లు, అవి చల్లిన ఎర్రటి పువ్వులు అల్లిన తివాసీలు, ఎర్ర అంచు నల్లచీరెలాటి తారురోడ్లు ...ముద్దాలికించే పొద్దుటి గాలి

'ఎంత అందమయిన వూరు ఈ బెంగుళూరు!'

ఎవరో యిద్దరు యువతులు కబుర్లు చెప్పుకుంటూ, కూరలు కాబోలు తెచ్చుకుంటున్నారు ఏ పది నిముషాలకో వో కారు తప్ప మరో శబ్దం లేదు కుడిప్రక్క ఇలా 'డౌన్' దిగి వెళ్లితే 'నేషనల్ కాలేజి' వస్తుందిట ఎడమప్రక్క తిరిగి వడిస్తే బసవన్నగుడిట—ఈ రోడ్ల ఎత్తులు, పులుపులూ చూస్తూంటే హైదరాబాదులా ఉంది అనుకున్నాడు మురళీధర్ అతడి కళ్లు వెదికాయి

లేను గుర్రంలాటి పడుచొక్కతె వెళ్లిపోతున్నది పంచకల్యాణిలాటి సైకిలుని సునాయాసంగా, అతి విలాసంగా తొక్కేనుకు వెళ్లిపోతున్నది—ఆ సైకిలుమీదే ఆమె వెనకాలే కూచుని మహారాజులా పోతున్నా డొక అదృష్టవంతుడు —ఇట్టే వో తియ్యటి కలలా సాగిపోయింది సైకిలు మీది ఆ యువ్వనం

"హుం వోయీ మురళీధరా హుం సైకిలు తొక్కడం రానంతకాలం, నువ్వుండీ ఎంత .. లేక ఎంత ? ఎంత హుం—ఎంత ?" అన్నాడు మురళి

"ఎంతో కాదుసార్—వందా ఖరవయ్యే ! పాండిచేరి నుండి తెప్పించాను—" అన్నాడు అప్పుడే మురళిప్రక్కన చేరిన మరో పెళ్లమనిషి, ఈ ప్రపంచంలో సగంమందికి పైగా జనాభాకు తన సిస్టువాచీ విషయంతప్ప మరోధ్యాస ఉండదని ఆయన అచంచలవిశ్వాసం

*    *    *

"హు హే . హుహుహు శేఖ శేఖరం .. వదిలేయకు "

"లేదులేవోయ్ వ ద ల ను లే ఆ ఆ జాగ్రత్త బాలెన్స్ చూచుకో ఆ అదీ భేష్ ఇంకేం ఇవాళ సాయంకాలానికల్లా "

కిందికి వాలిపోతూ పోతూ ఘొల్లుమంది సైకిలు దానికీ భూమికీ మధ్య పడుకోవలసి వచ్చింది మురళి

"బాలెన్సో రామచంద్రా అని చెపుతూనే ఉన్నాను కదోయ్ "

"అది కాదురా శేఖరం మరి ఆ ముందు చక్రమేమో!"

"నీ మొహం సైకిలుమీద కూచున్న నీ దృష్టి ముందుచక్రంమీద ఉండకూడదోయ్ చవలాయ్ కాస్త దూరంగా, నువ్వు వెళ్తున్న రోడ్‌మీద ఉండాలి "

"ఇది రోడ్డు కాదుగా !" అన్నాడు పచ్చయప్ప మైదానంమీద నిల్చున్న సైకిలు విద్యార్థి మురళి

"పెడితాపులే—లోటిటుస్తా మువ్వాళ .... ఈ సైకిలుమీదికి అఘోరించు నీకోసం ఖ్వాళ సెలవుపెట్టి కూచున్నానని తెలుసుగా సాయంకాలం అయిదింటిలోపుగా నీ కిది రాకపోతే నేనిటుపైపు మొహం కూడా చూపించను " అన్నాడు శేఖరం

"ఒరేయ్—ఒరేయ్ .... నువ్వలా అంటే ఎలా చెప్పు .. మా నాళ్ళుకదూ ... మా ద్రోణుడివి కదూ .... నాకు సైక్లింగు వచ్చింతర్వాతేం, విన్నేం, ఇంచక్కా—వెనక కూచోపెట్టుకుని తీసుకుని వెళ్తానుగా—"

"ఎక్కడికి, పోలీసు స్టేషనుకా ?" అన్నాడు శేఖరం పడిపోయిన సైకిలుని నిల్పోపెడుతూ

ఆ సైకిలుని వో చెట్టు పక్కగా నిల్పోపెట్టి దాని వెనకభాగాన్ని గట్టిగా పట్టుకుని నిల్చున్న శేఖర్ మీద ఒక చేయి వేసి ఇంకో చేతిలోని సైకిలుమీద ఆనించి, నిచ్చెన ఎక్కినట్లు అడ్డంగాపడి సైకిలునెక్కి సీటుమీద కూలబడ్డాడు మురళి

మళ్లీ మొదలైంది యుగళగీతం

"ఆ అఆ ఉయ్ వదలకు వదలకు , బాబోయ్ ఏయ్ కళ్లు తిరుగు ఈ పడిపో "—మురళి డైలాగులు

" ఆ అదీ భేష్ చూపు ముందుకుండాలి గూడ్ అదీ అలా రైట్ ఐసా ఐస్సా పెడల్ తొక్కడం మానెయ్యకూ ఊ కానీ అంతే అలాగే " ఇవి అధ్యాపకుడి అభిభాషణలు

మైదానంమీద వణుకుతున్న సైకిలు— సైకిలుమీద కూచుని వణికెడివాడూ, వణికించెడివాడూ అయిన మురళి—ఈ రెండు వణుకుల్నీ అణకువలోకి తెస్తూ సైకిలు వెనుకగా దానిని పట్టుకుని వస్తున్న శేఖరం—ఇదీ వరస ఇదీ తపస్సు

మిట్టమధ్యాహ్నం రెండు గంటలవేళ

సైకిలుని తోసుకుంటూ పరుగెత్తడం, పెడల్ మీద ఒక పాదం ఉంచి ఇంకో పాదంతో నేలని తన్నుతూ వెళ్లడం, క్రాస్ పెడలింగ్, సైకిలు ఎక్కడం, 'దిగడం—వగైరా పెద్దబాలశిక్ష పాఠాలన్నీ వదిలేసి తిన్నగా సైక్లింగులో మెట్రిక్‌కు వెళ్లిపోయాడు మురళి

ఆపాటికి మూడు గంటలసే పయింది పాఠం మొదలుపెట్టి సైకిలుమీద మురళి, సైకిలుని పట్టుకొని శేఖరం

'బ్యాలెన్స్' అనే ఆ ఆదిమధ్యాంతరహితగుణం, ఆ నిరాకార చైతన్యం, కాస్త మురళికి అలవడినట్లుండినసందర్భంలో అతడు తొక్కుతున్న సైకిలుని వెనక పట్టుకోవడం మానేసి నిల్చున్నాడు శేఖరం సైకిలు వెళ్తూనే ఉంది

ధీమాగా, నా అంతటివాడు లేడే అని సైకిలు తొక్కుతున్న మురళికి హఠాత్తుగా తాను టోక్యోలో ఉన్నట్లు అన్పించింది—అంటే, భూకంపం మధ్య ఇరుక్కున్న ట్లనిపించింది

"శ శే ఖ ర మ్ మాట్లా డ"

గుండె గోధుమపిండి అయి గాలికి ఎగిరిపోయిన క్షణాన్నే—తన పెద్ద దిక్కు శేఖరాన్ని భూదేవి మింగే



మీ అమ్మకు తెలియదా?

వుడ్‌వార్డ్స్

'గ్రైప్ వాటర్'

ప్రతి శిశువుకూ
ప్రధమ చికిత్స






తెలివైన తల్లులు
50 ఏళ్ల నుంచి వాడుచున్నారు

అధికారయుత ఏజెంట్లు: కోమర్ మేన్యుఫేక్చరింగ్ కెమిస్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి, ఎమ్. జి. సహాని అండ్ కో., (కలకత్తా) ప్రైవేట్ లిమిటెడ్ కలకత్తా; టి.టి. క్రిష్ణమాచారి అండ్ కో., మద్రాస్, ఎమ్. జి. సహాని అండ్ కో., (ఢిల్లీ) ప్రైవేట్ లిమిటెడ్, ఢిల్లీ.

---



మీ చర్మ సౌందర్యము
అధికరించుటకు...

సంపూర్ణ పరిమళముతో కూడియున్నది

బృందావన్
టాయిలెట్ సోపు




పంకజ్ సోప్స్ & ఆయిల్ మిల్స్, కొచ్చిన్.

ఆంధ్ర డిస్ట్రిబ్యూటర్లు:
కె. వి. నారాయణరావు అండ్ సన్సు, పి. బి. నెం. 16 విజయవాడ-1

ందేమో ననిపించిన క్షణానే—అది తెలుసుకుంటా డువి తిరిగిచూచి పది గజాల వెనక కనపడిన శేఖర్‌తో "శేఖర్ నీ " అనబోయిన క్షణానే—సరిగ్గా ఆ క్షణానే—మురళీధరుడి సైకిలు కర్కశంగా ఒక దుర్మార్గపు చెట్టు అప్పటికప్పుడు మొలిచి పెద్ద దయి కూచుంది!

పరుగెత్తుకొచ్చాడు శేఖరం

"హుం నీ తెలివి మండిపోనూ సైకిలు తొక్కుతూ తొక్కుతూ వెనక్కి చూడమన్నా డోయ్ ఎవరైనా! ముందు చూసి తొక్కితేనే 'పైసా' గోపురంలా వాలిపోతుంటావే, అలాటప్పుడు వెనక్కు చూస్తూ తొక్కుతావేం—పెద్ద రెగ్ హారిస్‌లా ?"

"వా డెవ్వడు ?" అన్నాడు—చెక్కుచెక్కిన తన సైకిలుని అప్పుడే క్రిందకు దింపుకుని, దాని చక్రాలలోనూ వాటిల్లోనూ ఇరుక్కుపోయిన తన పాంచ భౌతికకాయం చాలాకు చిన్నచిన్న భాగా లను బయటకు తీసి, ఇంతిగిన్నె కీలూ వగైరా స్వస్థానాల్లో ఉన్నాయా అని చూసుకుంటున్న మురళీధరుడు

"హాహా ... తెలీదూ వెర్రి రెగ్ హారిస్ తెలీదూ—వెధవ !! తెంపలు వేసుకో!" అని వో క్షణకాలం భారీఎత్తున నవ్వేసి—"రెగ్ హారిస్ అంటే ప్రపంచ సైకిలు ఛాంపియన్ ఆ ఏమనుకున్నావో ఆయన ఆటోగ్రాఫ్ ఉంది నా దగ్గర" అని రొమ్ము విరిచాడు శేఖరం

తొడలు రెండూ పీడకల్లా అయిపోగా నిల్చో బోయి నిల్చోలేకపోయిన మురళికి ఆటోగ్రాఫులూ, ఫోటోగ్రాఫులూ వినబడ్లేదు.

అయిదు గంటల సైకిలు అభ్యాసంలో— ఒంట్లోనికి మూడు చిరుగులు, మడికాలి బెణుకు, పెదవు మడమదగ్గర పెద్ద గాయం, ఎగశ్వాస వచ్చాయి మురళికి

చిన్న గీతలాటి గాయం, మరియు పంట్లాం మీద నాలుగు కందెన గీతలు—ఇవి శేఖరం పుచ్చు కున్న గురుదక్షిణ.

* * *

ఇంతలో—మురళికి, క్లర్క్ ఎక్స్పెక్టర్— జనరల్ కార్యాలయంలో ఓ ఉద్యోగం వచ్చి పడింది రోజూ ఆఫీసుకి బస్సుమీద వెళ్లి వస్తుండే వాడు 'అహో ! నాకే గనుక సైకిలు తొక్కడం వచ్చిఉంటే ఈ వెధవ బస్సులకోసం పడిగాపులు గాయడ తప్పగా, కళ్ళు మూసుకుని, ఈల వేసు కుంటూ ఇంటినుండి—ఆఫీసు నుండి—ఇంటికి సైకి లేద్దును గదా'—అని మనస చింతించి తన కోరి కకు కొత్త ప్రాణవాయువు పోయించాడు గుమాస్తా మురళీధర్

ఓ శనివారం సాయంకాలం మురళి శెంచన్‌గా అయిదింటికి ఆఫీసునుండి బయలుదేరుతుండగా ఆఫీస్ మేనేజర్ వెంకట్రమణయ్యగారు పిలిచారు వెళ్లి నిల్చున్నాడు మురళి

"అయిదు కొట్టే కొట్టగానే ఏమిటా తొందర?

"అబ్బే ఇహి హిహి "

"రేపు ఆదివారం "

"అవునవును ... మరే .. ఆదివారం ... ఎస్ సార్ ... "

# శకట యోగం

"నీకు 'టరన్ డ్యూటీ' వేయిస్తున్నాను "

"ఏం వేస్తున్నారు సార్ నాకు ?" ప్రశ్న మొహంతో అడిగాడు మురళి

"నీకు 'టరన్ డ్యూటీ' వేస్తున్నాను" అన్నారు వెంకట్రమణయ్య

"హాహా !" అన్నాడు మురళి

"థాంక్స్—" అని నాలు గడుగులు వేసి గిరు క్కున మురళి వెనక్కొచ్చి అడిగాడు కొంగ్రొత్త గుమాస్తా—"సార్ ! డ్యూటీ అంటే తెలుసు కానీ, 'టరన్ డ్యూటీ' అంటే ?"

"వ్వాట్ !! ఇది తెలీదూ ? రేపు ఆదివారం ఆఫీసుకు ఎవ్వరూ రారు నువ్వొక్కడివే రావాలి ఇదిగో డూప్లికేట్ తాళాలు రేపు ఏవయినా టెలిగ్రాములు వగైరా అర్జంటు కాగితాలు వస్తే అందుకోవాలి వాటిని నాకో, దొరవారికో పంపాలి మరీ అర్జంటు కాగితాలు వస్తే ఫోన్‌మీద కబురు



రోగి:—డాక్టరు గారూ! దయతో నన్ను జూచి, నా రోగమును మాన్పిన మీకు చాలా ఋణపడి వున్నాను. ఈజన్మలో కాకపోయినా, పై జన్మలో మీ ఋణం తీర్చుకొంటాను

పై జన్మలో ఎలా తీర్చుకొంటావ్?

రోగి:—నేను డాక్టరుగా పుట్టి

— పాలకుస (కాళహస్తి)



చెయ్యాలి వచిత్తన్నా ముందే రావాలి అయిదు తర్వాత వెళ్ళాలి ఆ .. " అని ఘనత వహించిన తమ తలబిగాకు తీసి టేబిల్‌మీద కూచోబెట్టి పిలకను వదులుచేసి ఝాడించారు మేనేజరుగారు

ఇంటికి పారిపోయాడు మురళి—

—మరునటిరోజు పొద్దున ఆఫీసుకు వచ్చాడు ఆఫీసంతటికీ తానే ఏకఛత్రాధిపతి— ! మనసు ఎగిరి గంతేసింది

కాసేపు టేబిల్‌మీదికి కాళ్ళుపెట్టి తన కుర్చీలో చేరగిలబడి కూర్చుని—"ఏంవోయ్ మేనేజర్ ఇటురా !—" అన్నాడు వెంకట్రమణయ్యగారి కుర్చీ చూసి

గబుక్కున లేచి, హాల్లోని నాలుగు ఫేన్‌లనూ తిప్పేసి, తన జుత్తూ, కాగితాలూ, ఎగిరి పోతుండగా టేబిల్‌మీద నిల్చుని— "సోదర సోదరీ మణులారా—కళంటే ఏవిటి ? నాకూ తెలీదు, గాని మా నాగరాజు " అని ఏడు నిముషాలు లెక్చరిచ్చాడు

టేబిల్‌మీది నుండి గెంతుతూ వెళ్ళి మేనేజర్ గారి మెత్తటి కుర్చీలో కూచుని, టేబిల్‌మీద కనపడ్డ తెల్లకాగితం మీదల్లా — 'నాట్ గుడ్' 'పూర్ డ్రాఫ్ట్'—'వారన్డ్'—వగైరా రిమార్కులు ఎర్రసిరాతో రాసి పారేశాడు కుర్చీ వెనక్కు తీవిగా వాలి—తన హెడ్ క్లర్కు కూర్చుండే వైపు తిరిగి — "మిస్టర్ రామ్మూర్తీ!—నీ సెకన్ ఉత్తరాలన్నీ 'సిల్లీ' గా ఉంటున్నాయి కాస్త 'ఇంప్రూవ్' చెయ్యాలి — లేకపోతే వరాసగా నాలు గాదివారాలు 'టరన్ డ్యూటీ' వేయించేస్తాను " అన్నాడు — అని ఇటూ అటూ పరికిస్తుండగా, ఆ హాల్లో ఒక మూలగా సాధు జంతువులా నిల్చుని, ఉన్న ఆఫీసు సైకిలు కనబడింది !

ఔరా ! తన అదృష్టం సైకిలురూపంలో ఆమూల నిల్చునిఉండగా ఈ వెధవ మేనేజ రుద్యోగ మేం ఖర్మ ?

—అయిదో నిముషం మురళీధరుడూ సైకిలూ ఆఫీసు బయట—విక్టోరియా క్రిసెంట్ రోడ్డు మీద ఉన్నారు

ఈ విక్టోరియా క్రిసెంటు రోడ్డు ఇంగ్లీషు అక్షరం 'యు' లాగా ఉంటుంది దీని రెండు కొసలూ ఒకే రోడ్డుమీద ఉంటాయి అంటే ఈ క్రిసెంటు రోడ్డు ఒక చివర బయలుదేరి వెళ్లి అవతలి చివరను సమీపించేసరికి మొదట బయలు దేరిన రోడ్డునే చేరవలసి వస్తుంది ఈ రోడ్డు యొక్క 'యు' — మడతలో ఒక అమ్మాయిల కాలేజీ ఉందన్నది మురళి గమనించని విషయం— ?

అసలే లాయర్లూ, మేయర్లూ మెసలే ఆ రోడ్డుమీద కార్లూ, నౌకర్లూ తప్ప మరేమీ నడవ్వు అందులోనూ ఆదివారమేమో, ఆ వైశాల్యం వైశాల్యమంతా మురళీధరుడి సైకిలుకే కేటా యించేశారు

నెమ్మదిగా, సైకిలు వొక బంగళా పిట్టగోడ ప్రక్కగా నిల్చోపెట్టి, తాను ఆ గోడనెక్కి, సైకిలు అవతలికో కాలు వేసి సీటుమీద కూచుని, హేండిల్ బార్‌ని రెండు చేతులతోనూ పట్టుకుని, గోడ మీది మరో పాదంతో ఒక్క తన్ను తన్నగా — మురళి సైకిలు హిందీ పాటలా బయలుదేరింది

"ఆహా ! ఏమీ ఈ ఈ సుదీ .... ఈ వ మీ ఈ ఈ నాదూ .. పూర్వా నీ హోయి — ఏం హోయి టరన్ డ్యూటీ అంటే ఏవిటో అని భయపడ్డాను .. హుం వచ్చే ఆదివారంనుండీ నేనే అడిగి వేయించుకుంటాను టరన్ డ్యూటీ ఓహోహోహో ఏం సైకిలండీ ఇదోహొ సైకిలా అని ! ఈ నున్నటి తారురోడ్డుమీద ఈ ప్రభుత్వంవారి సైకిలు కేవలం వెన్నలోకి కత్తి దిగినట్టు మెత్తగా వెళ్లిపోతూంది ఏం జీవితం ఇదీ ! ఇలా ఇలా సైకిలు తొక్కేసుకుంటూ వెళ్లి వెళ్లి ఎస్కిమో లను పలకరించి రావచ్చే '

—అని పరిపరి విధముల పరిభ్రమించింది పడుచువాడి ఎద ఆపాటికి అతడి సైకిలు ఆ క్రిసెంటు రోడ్డుమీద ఆరుసార్లు పరిభ్రమించింది

పరిసరాలను పట్టించుకోకుండా అతడు అమ్మా యిల కాలేజిని అయిదోసారి చుడుతుండగా—

"ఆహా ఏమీ సందేహంలేదు సర్వ లక్షణ సమ్మిళమైన తోమియాపే—!" అంది కాలేజి

కాంపౌండ్‌లోపల చూచునిపుణ్ణి బి ఏ విద్యార్థిని కుమారి డేనియల్ మణి

"ఛా, పాపం ! ఆ అబ్బాయి మొహం చూడవే అయిస్‌క్రీమ్ కొనుక్కున్న కుర్రాడిలా ఉంది ఆ సైకిలు తొక్కుతున్నందుకే మురిసిపోతున్నాడు అల్పసంతోషి" అన్నది హాస్టల్ వాసిని ఆదిలక్ష్మి

—మురళి ఆ రోడ్ వెంబడి తదేకదీక్షతో ఏదో ప్రదక్షిణం చేస్తుండగా, అతడి ఆఫీసులోకి వో తపాల బంట్రోతు వెళ్ళి, 'టరన్ — డ్యూటీ' గుమాస్తా లేకుండడం గమనించాడు అలా గమనించి వెనక్కు మళ్ళిన ఆ తపాల బంట్రోతు ఎర్ర సైకిలు ఆఫీసు కాంపౌండును దాటి క్రిసెంట రోడ్డు మీదికి వచ్చిన క్షణాన్నే—

మురళి తన ఎనిమిదో ప్రదక్షిణాన్ని అతి వేగంగా అప్పుడే ముగించి, ఆఫీసు గుమ్మాన్ని సమీపించబోయే క్షణాన్నే—

వో కోకిల నవ్వినట్టు విన్పించగా, మెడ తిప్పి, ఆదిలక్ష్మి, డేనియల్ మణుల రూపాలను లీలా మాత్రంగా గ్రహించబోతుండగా, ఇటు టింగు మన్న బెల్ మోత వినిపించినందున ఇటుతిరిగి తనమీదికొస్తున్న తపాలా బంట్రోతు లాటి శాల్తీ కన్పించగా — మామూలుగా సైకిలునుండి దిగడం రానందున ఎడమప్రక్కచేతి బ్రేకుని నొక్కుదా మను కుంటూనే కుడిప్రక్కదానిని కాయశక్తులా ఒత్తి, తత్ఫలితంగా సైకిలు వెనక చక్రం పైకి లేవగా, లిప్తమాత్రం 'స్పిన్'లో తేలి అమాంతంగా క్రింద కూలాడు మురళీధరుడు

అతడి సైకిలు తపాలాయన దానిమీద పడగా ఆయన అతిజాగ్రత్తగా తప్పించుకుని వెళ్ళి పోయాడు పోతూపోతూ అన్నాడు " ఎన్నయ్యా .. మూళె ఇల్లే ?"

"అవునే లక్ష్మి ఆ అబ్బాయి మనకోసం తిరగలేదు " అని నొచ్చుకుంది డేనియల్ మణి

—మరుసటిరోజు పొద్దున మేనేజర్ వెంకట్రమణయ్యగారు తమ కళ్ళజోడు మీదుగా చూస్తూ అన్నారు "మొదటిది — నిన్న ఆఫీసుకి అర్జెంటు టెలిగ్రాములు నాలుగు వచ్చాయి నువ్వు ఒక్క దానినీ పుచ్చుకోలేదు ఇదిగో 'ఛార్జిషీటు' రెండోది — ఆఫీసుసైకిలు ముందుచక్రం పూచలు ఆరు మడతపడ్డాయి హేండిల్‌బార్ పగిలిఉంది వెనక మడ్‌గార్డ్ అప్పడంలా అయింది వీటన్నిటికీ కలిపి బిల్లు పధ్నాలుగు రూపాయలు — ఇదుగో పుచ్చుకో 'ఛార్జిషీటు'కు జవాబూ, ఈ బిల్లుకు 'పేమెంటూ' మూడు రోజుల్లోగా రావాలి " ఆ వచ్చితీరాలి ఆ నౌ— యూ— కెన్—గో !"

'ఏం ఏ !' అనుకున్నాను మురళి

*  *  *

—మరో రెండు వారాల తర్వాత

ఒకానొక సెలవురోజు మధ్యాహ్నం మూడింటికి గోవిందప్పనాయని వీధిలోని ఒక అద్దె సైకిలు షాపువాడికి మురళీధర్ తన గోత్రమూ, పుట్టు మచ్చలూ చెప్పి, నిశాని వెయ్యడం మినహా అనేక హామీలిచ్చి వో అద్దె సైకిలును — డైనమో దీపం ఉన్నదానిని పుచ్చుకున్నాడు

సైకిలు దిగడ మంటాతే ఇంకా రాదు కాని — షాపువాడు అదిరి చచ్చేటంత స్టయిలులో సైకి లెక్కి కూర్చున్నాడు మురళి తొక్కసాగాడు.

# శకటయోగం

ఓ నాలుగువందల గజాల తర్వాత ఎవడో అడ్డొస్తున్నట్టు అనిపించగా బెల్ మోగించబోతే వినబడలేదు వెతగ్గా వెతగ్గా అది హేండిల్‌బార్ మీద కాక క్రేస్‌బార్ మీద అఘోరించినట్టు తేలింది ఇంతలో బాలెన్స్ గల్లంతయి సైకిలూ తానూ కిందపడ్డంతపనవగా ఆ ప్రయత్నం మానుకున్నాడు

అప్పటికి తాతాముత్తయ్యవీధిలోకి వచ్చాడు మురళి అక్కడినుండి బ్రాడ్‌వే దాకా వీధి ఏటవాలుగా కింది జారుగా ఉండడంవల్ల సైకిలు జామ్మంటూ వెళ్ళిపోతూంది అడ్డంగా వచ్చిన వ్యక్తులూ, వాహనాలూ గతంలోకి వెళ్ళిపోతూంటే తనో మహాపురుషు డనిపించింది సైకిలు వేగానికి ఎదురుగా వీచే గాలి ముంగురులు జాల్తూ రేగుతుండగా అలా పోతూంటే ఏ మానందం ఏమానందం !

హఠాత్తుగా వచ్చింది — విజయవాడ జంక్షన్ లాటి ఆచారప్పవీధి ఆచోట మురళి అత్యద్భు

---

భర్త (మేడమీద ఉన్న భార్యతో):-ఏమేవ్! ఇక ఆఖరు సారి పిలుస్తున్నా క్రిందికి వస్తావా? రావా?

భార్య. అబ్బ! మీరు కాస్త ఉండి చెబుతూంటా, గంటనుంచీ ఒక టే అరుస్తున్నా, ఒక్క నిముషంలో క్రిందికి వస్తానండోయ్ అని!!

పాలంకి వెంకటేశ్వర్లు (బొంబాయి)

---

తంగా రెండు ఎడ్ల బండ్లమధ్య సర్కసు చేసి, ఒక బియ్యపు బస్తాల లారీలోకి వెళ్ళిపోబోయి, పోవడాని కిష్టంలేక తప్పించుకుని 'అమ్మయ్య' అనుకుని రెట్టింపు శక్తితో తొక్కాడు, సైకిలుని బ్రాడ్‌వే సమీపిస్తూంది మురళి గుండె చప్పుడు ఎక్కువయింది

ఇంతలో వో అడ్డపంచ రాక్షసుడు చెట్టు కొమ్మల్లాంటి చేతులు రెండూ బార చాపుకుని వీధి మధ్య నిల్చుని ఆవలిస్తున్నాడు

ఆ కీచకుడిని గమనించి బెల్ మోగించబోయి, 'బాలెన్స్' విషయం గుర్తుకొచ్చి "హోయ్ హోయ్!" అన్నాడు మురళి 'హోయ్' జరగలేదు ఇంతలోకి సైకిలు కాస్తా రంయ్‌మని రాములవారి బాణంలా ఆ రాక్షసుడి ఎడమచేతిని తాకి దూసుకునివెళ్ళి పోయింది అతడి చేతిలోని తాళాలగుత్తి ఎగిరి వీధి ప్రక్కను కాలవలో పడింది

"అడేయ్ ముట్టాళ్ ఎక్కడికి పోడుస్తువు నిల్ ! నిల్‌రా సోంబేరి " అని ఆ మారీచుడు మొదలెట్టినట్టు అన్పించగానే—బ్రాడ్‌వేలో పడి కుడి ప్రక్కకు తిరిగిఅదేపోతగా పోనిచ్చాడుమురళి.

పోనీ, ఎక్కడయినా ఆగుదామంటే దిగడం తెలియదాయెను. నెమ్మదిగా ఏ షాపు గుమ్మమో, ఫుట్‌పాతో చూసుకుని పైకి పోనించి దిగాలి. కాని వెనుక నుండి, ప్రక్క నుండి, అన్ని దిక్కుల నుండి కారులు, రిక్షాలు, గేదెలు, బస్సులు వచ్చేస్తున్నాయి శ్రీరాములునాయుడు పార్కు దాటి పోయింది అంతా పద్మవ్యూహంలా ఉంది కళ్ళు తిరిగిపోయింది మురళికి 'బాటలు నడచి, పేటలు కడచి వెళ్ళిపోతూంది సైకిలు మురళి కేవలం నిమిత్తమాత్రుడై తొక్కుతున్నాడు హైకోర్టు గోపురాలు కనుపించాయి ఇంకా వెళ్ళిపోతూంది సైకిలు ఒక తెల్ల చొక్కా కిందివేలి చివరను తెల్లటి, గుండ్రటి రేకూ, దానిమీద నాలుగు నల్ల అక్షరాలూ కనుపించాయి కాని సైకిలు ఆగలేదు —ఆగగలిగితే కద !

సంపూర్ణంగా ఆత్మార్పణ చేసుకుని దైవాన్ని స్మరిస్తూ బోసు రోడ్డుని దాటేశాడు మురళి. ఏవో కారులూ, బస్సులూ కీచుమంటూ బ్రేకులు వేసుకున్నాయి

'స్టాప్' చిహ్నాన్ని చేత ధరించిన హెడ్‌కానిస్టేబుల్ ఆర్ముగం మురళీధరుణ్ణి చూసి "ఎన్న మడయన్ ! సొల్లిటు వందియా ?" అన్నాడు సెందమిళ్ భాషలో—

దిక్కు తెలియక, దిగడం తెలియక, ఫోర్టు స్టేషన్ రోడ్‌మీద పడిన మురళి ట్రాఫిక్ చిహ్నాలనూ, నిబంధనలనూ ఎడా పెడా ఉల్లంఘించేసి, ఆకాశవీధిలో మేఘమాలలా వెళ్తున్నాడు రెండు చోట్ల ఇంచుమించు ఆస్పత్రిలో చేరబోయి ఆగిపోయాడు తొడలు రెండూ కర్రల్లా అయిపోగా యాంత్రికంగా బీచి స్టేషన్ వైపు తొక్కుతున్నాడు అతడికీ మూర్ఛకూ మధ్య ఎక్కువ కాలం లేదు—

కుడిప్రక్క వొక రైల్వేగేటు తెరిచి ఉండడం గమనించి హఠాత్తుగా అటు తిరిగాడు చల్లగా పలకరించింది సముద్రపు గాలి బీచి రోడ్డుమీద రిజర్వుబ్యాంకు భవనం దాటిపోయాడు రేడియో దగ్గర ఎడమప్రక్క — సముద్ర తీరానికి వెళ్ళే రోడ్ మీదకు మళ్ళించాడు ఆ రోడ్డు అలా అలా వెళ్ళి ఇసుకలో కలిసిపోతుంది రెండే నిముషాలలో ఆ రోడ్డు అయిపోయింది ఇసుక దగ్గరయిన కొద్దీ మురళి ప్రాణముల్ ఠావుల్ తప్ప నారంభించాయి 'నీవే తల్లియు తండ్రియు, నీవే సారథివి' అనుకుంటూరెండుచేతులూ పైకెత్తేశాడు.

సైకిలు ముందు చక్రం ఉస్సురంటూ దిగిపోయింది ఇసుకలోకి సైకిలు పడిపోయింది, మురళి కూడా

*  *  *

అలాటి మురళీధరుడిని ఆరు నెలల తర్వాత ఈనాడు కలుసుకుంటే "—మొన్న మహాబలిపురానికి సైకిలుమీద వెళ్ళి వచ్చానండీ — ఎంత గొప్ప శిల్పాలనీ ! అందులోనూ నా సైకిలు 'ఫ్రీవీలు'కు ఇరవై రెండు పళ్ళున్నాయేమో అరవై మైళ్ళనూ మూడుగంటలలో ముగించింది !" అంటాడు ఇంకా వింటే "చక్రాలు లేని సైకిలు ఎప్పుడొస్తుందా అని చూస్తున్నానండీ" అంటాడు

సైకిలు సవారీలో ఇంత ప్రావీణ్యత సంపాదించిన ఆ భగీరథుడి కోరిక ఒకటి మాత్రం తీరకుండా ఉండిపోయింది

అది—పాలడబ్బాలున్న సైకిలుని తొక్కడం! ★

# న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

అయింది క్యూబా పంచదారకు సాము ర్క్యం ఓ్‌ లోనూ, భారత పంచదారకు మైమిలోను అమ్మకాలు జరుగుతున్నై

అటు ప్రభుత్వంనుంచి గాని, ఇటు చక్కెర పరిశ్రమవల్ల గాని పిసమెత్తు ఉపయోగమైనా పొందలేని, వినియోగదారుడు తన మామూలు పద్ధతిలోనే చర్య తీసుకోటానికి నిశ్చయించుకున్నాడు చక్కెరను తక్కువగా, బహు తక్కువగా వాడుకుంటున్నాడు ఇందుమూలంగా విదేశాలలో భారతీయ చక్కెర ఎగుమతులకు తగిన మార్కెట్లు కనుక్కొనేందుకు శ్రీ ఎస్ కె పాటిల్‌ని ఉత్సాహపరచటం గూడా జరుగుతోంది!

ప్రణాళికల మంత్రి శ్రీ గుల్జారీలాల్‌నందా లోక్ సభలో తృతీయ ప్రణాళికపై తమ ముగింపు ఉపన్యాసంలో ధరలను నిలకడగా ఉంచటం అవసరమని వక్కాణించారు అయితే ఆహార ధాన్యాల పొలాలను చెరకుపంటకు ఉపయోగించేందుకు ఏవిధంగా ప్రణాళిక సిద్ధం చేస్తున్నారనేది మాత్రం ఆయన వివరించలేదు ఏవిధమైన యిబ్బందులు వచ్చినా సర్దుకు పోవటానికి వీలుగా పథక కర్తలు, ధరలను నిర్ణయించి ఉండవలసిందని కొంతమంది అభిప్రాయం

శ్రీ పాటిల్ చేసిన ప్రకటన, ఫోర్డు సంస్థ సంఘం నివేదికను బలపర్చేదిగా ఉంది ఆహారధాన్యోత్పత్తి పెంపుకు ధరలను మద్దతు చేయాలనే సిద్ధాంతం ఈ సంస్థ ప్రతిపాదించింది చెరకు అధికోత్పత్తి ఉద్యమం లాంటిదేమీ లేకుండానే చెరకు పంట పొలం విస్తీర్ణం 16 లక్షల ఎకరాలకు ఆరేళ్ళలోగా పెరిగినప్పుడు అదేవిధంగా తిండి గింజల ధరలు వాణిజ్య పంటల ధరలతో సరిసమానంగా ఉంటే వాటి ఉత్పత్తి కూడా పెంచే వీలు ఉంటుంది

అధికాహారోత్పత్తి ఉద్యమం అభివృద్ధిపైన తయారైన మొదటి నివేదికను 1945 సెప్టెంబరు 4 వ తేదీన ప్రచురించారు దానిలో కొన్ని వాక్యాలకు ఇక్కడ ఎంతైనా ప్రాముఖ్యం ఉన్నది "దేశంలో ఆహారధాన్యాలకు అధికధరలున్న కాలంలో ఆహారోత్పత్తిని పెంచే వివిధ మార్గాలను సూక్ష్మబుద్ధితో గ్రహించి అమలు జరిపేందుకు కర్షకులు ఏమాత్రం ముందకొడిగా ప్రవర్తించటం లేదు అందువల్ల వారికి పరిస్థితులు అవకాశం కల్పించినంతవరకు, కావలసిన వస్తువులు సరఫరా అయినంతవరకు కర్షకులు ఆహారధాన్యాల అధికోత్పత్తికి దప్పకుండా పాటుబడుతారు సందేహంలేదు" ప్రణాళికాసంఘం అసలు, ఆహార ధాన్యాలపై ధరలు విపరీతంగా పెరిగిన సమయంలో గలిగిన అనుభవాలను జాగ్రత్తగా పరిశీలించిందా అనేది, ఇప్పుడు తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో తన వ్యవసాయ విధానాన్ని ఏర్పరచుకునేటప్పుడు హెచ్చుగాను అసాధారణంగాను ఉన్న చెరకు ధరను పరిశీలించిందా అనేది అనుమానంగా ఉన్నది

* * *

యూరోపియన్ నౌకాసంస్థల సమావేశం రవాణా చార్జీల పెంపు ప్రతిపాదన వట్ల, వర్తకులతోపాటు భారతప్రభుత్వంకూడా బెంబేలు పడిపోతున్నది భారత్—యు కే—కాంటినెంట్ సమావేశం, తూర్పుకుపోయే సరుకు రవాణాపై చార్జి 10% పెంచుతామని చేసిన నిర్ణయం భారతదేశపు ఎగుమతులపై తీవ్రంగా దెబ్బతీయటమేగాక భారతదేశపు దిగుమతుల ఖర్చులను విపరీతంగా పెంచివేస్తుందని రవాణా కార్యదర్శి శ్రీ అయ్యర్, నౌకా వాణిజ్య వ్యవహారాల సంప్రదింపుల సంఘానికి నివేదించారు

ఈ విషయాన్ని నిష్పాక్షికంగా పరిశీలించాల్సి ఉంటుంది బెంగాల్, అస్సాంలలో పనిచేస్తున్న సంయుక్త నౌకాసంస్థలు తమ రవాణా చార్జీలను హెచ్చించాయన్నమాట వాస్తవమే ఇందుమూలంగా అస్సాము ప్రభుత్వము నిరసన తెల్పటం విచారణసంఘం ఏర్పడటం, చివరకు ఈ సంఘం 5% పెంపుకు అంగీకరించటం జరిగింది ఇండియన్ నౌకాసంస్థలు బర్మా బియ్యం కేరళకు, దక్షిణ భారతదేశానికి బొగ్గు రవాణాచేసున్న విషయం అందరికీ తెలిసినదే సముద్రంపై బొగ్గు రవాణాకు సహాయం చేసేందుకుగాను భారత ప్రభుత్వం బొగ్గుపైన సెస్సు విధించాల్సి వచ్చింది స్వాధీనపర్చుకోటం ద్వారా గానీ, అద్దెకు తీసుకొనిగాని ఇంకా కొన్ని నౌకలను ఈ వాణిజ్యానికి చేర్చుకోవా లనేది కూడా ఆలోచనకు వచ్చింది ఇంతవరకూ భారత నౌకా పరిశ్రమ సాలీనా 10 లక్షల టన్నుల బొగ్గును రవాణా చేస్తూవచ్చింది ఆర్థికసహాయం కానీ, రవాణా చార్జీల పెంపుగానీ లేకుండా ఇంకో 10 లక్షల టన్నులు రవాణా చేయటానికి ససేమిరా ఒప్పుకోలేము రవాణాచార్జీల 10% పెంచటంవల్ల పోటీ వాణిజ్యంలో భారత్‌పై దెబ్బతగిలి దిగుమతి ఖర్చులు పెరుగుతాయనేది వాస్తవమే కాని బొగ్గు లేక మూలపడిన దక్షిణాది పరిశ్రమలకు బొగ్గు, కేరళ అన్నార్తులకు బియ్యం సరఫరా చేయటం ఆర్థికంగా అసాధ్యమని దేశీయ నౌకా వాణిజ్యసంస్థలే భావిస్తున్నప్పుడు భారతప్రభుత్వం యూరోపియన్ సంస్థల రవాణా చార్జీ పెంపును ఎలా ప్రతిఘటిస్తుంది? సముద్ర వాణిజ్యంపై భారత్ చెల్లించేరు 160 కోట్లలోను 50 వంతులు సమాఖ్య సంస్థలకే గాని భారత నౌకాసంస్థలు ఈ సమాఖ్యలో సభ్యులు కావటంవల్ల రవాణాలల్లో కూడా వారు భాగస్వాములే దేశభక్తి కారణంగా భారతీయ నౌకాసంస్థలు, తూర్పుకుపోయే సామగ్రిపైన రవాణా చార్జీలలో అక్టోబరు 1 నుండి జరుగబోయే 10% పెంపును అమలు జరుపము అని భారతప్రభుత్వానికి హామీ నివ్వాయా అనేది ముఖ్యం సమాఖ్యలో భాగస్వాములు గనుక భారత సంస్థలు సమాఖ్య నిర్ణయాలకు బద్ధులు కావాల్సి ఉందని వాదించవచ్చు ఏమైనా తమ దేశప్రజలవద్ద వసూలుచేసిన అదనపు చార్జీలు నౌకాసంస్థలు మళ్ళీ ఏదోవిధంగా ముట్టచెప్ప దలిస్తే వారించగల శక్తి ఎవరికుంది?

అదలా ఉంచుదాం ఏ అవార్డువల్లనో, రైలు రవాణా చార్జీల పెంపకం వల్లనో వ్యయ స్వరూపం పెరిగిపోయినప్పుడు ఎగుమతి వాణిజ్యంసంగతేదన్నా ఆలోచిస్తారా? ★




వచ్చే వారం!
ఎప్పుడూ ఇంతే
శతకార్టూనుత్సవం !

### మీ (మా) సాహిత్య పరిచయం

అన్ని ప్రశ్నలకూ సరియైన జవాబులు (ఇ) లే: మీ సమాధానాలన్నీ తప్పులైతే మీ సాహిత్య పరిచయం ఇంకా ప్రమాదంలో లేదన్నమాట. ఆరుకిపైన, పన్నెండుకిలోపూ ఉంటే కొంచెం జాగ్రత్త పడటం అవసరం అంతకి తక్కువ ఉంటే (మా-మీ) కథలు చదవటం మానలేరు!!



## పొట్టి కథ

### కాఫీ దండకము

శ్రీమన్మహాదేవి నిన్నెంత మేమెంత కారం. దయాదృష్టి మాపైన బంపించినమ్మేలు మా దేవి నీ వంత మా భాగ్య మంచున్, నిన్ను యింటింట సేవించుచుండన్, కను లార వీక్షించి, నీ పైన దండకం బొక్క టింపుగా నూహించితి. ఓ దేవి! ఇంగ్లాండు, పోలెండు, ఐర్లెండు మొదలైన దేశంబులం దుద్భవించి, నేపాల, భూపాల, కాంభోజ కర్ణాటక దేశంబులాదిగా వ్యాపించుచున్ తుదకు పల్లెలం బ్రముచ్చరించంగ వేంచేయగా, నిన్ను రాజాధిరాజులున్, పండిత పామరుల్ బీదయున్, బిక్కుయున్ నిన్ను సేవింప యోచించి కుంపటల్ అగ్నితో పేల్చి గంగయున్ గాచి చక్కెరన్ పాలతో గూడ నీ సన్నిధిం జేర్చి ఓ కాఫీ మహా దేవి! పొర్లుచున్, తెర్లుచున్నట్టి నీ రూపు మానాల్క కాల్చంగ బొబ్బలున్ పోవునంచున్, భయం బింత లేకుండ ఎల్లప్పుడు నిన్ను సేవించి ఆస్తులన్నియున్ పోవంగ నిన్నేమి విడిపించమన సొప్పకున్నన్ భార్య సొమ్మంత అంగటన్ కుదువగా పెట్టితిన్ కడకు నీ భాగ్యమిదా, నన్ను కాపాడునా తల్లి నన్నీడువు ఓ కాఫిదేవీ మహా దేవదేవీ నమస్తే. నమస్తే. నమస్తే. నమః ఓం. ఓం. కాఫీ మహాదేవి స్తవమిది సంపూర్ణం.

ము రాధాకృష్ణన్, మాగుటి (ఒంగోలు)

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1. Chief Editor S. Sambhu Prasad.

